## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ధనసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆహ్వానము

'అభినవ పోతన'

శ్రీ వానమామలై వరదాచార్యులు

ప్రచురణము 28 :

దేశోద్ధారక  గ్రంథమాల

2844, ఇమాంబావి వీధి సికింద్రాబాదు

# మనవి

భాగవతం వంటి పోతన జీవితాన్ని, మహా కావ్యంగా రచించి, 'అభినవ పోతన' గా ఆంధ్ర సాహితీజగత్తుకు అభిమాన పాత్రులైన శ్రీ వానమామలై వరదాచార్యులగారి ఈ ఖండకావ్య సంపుటిని మా గ్రంథమాల ప్రచురణగా వెలువరించు భాగ్యం కలిగించినందులకు ఆచార్యులవారికి మొదట కృతజ్ఞత లర్పించుకుంటున్నాం. ఇంకా అచ్చు కావలసిన వెన్నో ఉన్నాయి. వీటిలో ప్రధానంగా పేర్కొనవలసింది "పోతన మహా కావ్యం." చాలా సంవత్సరాల నుంచి ఆ గ్రంథ ముద్రణకై ఎన్నోవిధాలా కృషి జరుగుతున్నది. ఈ సందర్భాన ఒక శుభవార్తను అందజేస్తున్నాం. శ్రీ ఆచార్యులవారు తమ పోతన మహా కావ్యాన్ని, మా గ్రంథమాల ప్రచురణగా ప్రకటించుటకు అనుమతించారు. ఈ విధంగా మా గ్రంథమాలకు గౌరవము చేకూర్చడమేగాక, ఆంధ్రు లంతా ఉవ్విళ్లూరుతున్న ఆ గ్రంథ ప్రచురణకు అవకాశం కలిగించి నందుకు వారిని ప్రస్తుతించడానికి మాటలు చాలవు.

శ్రీయుతులు పల్లా దుర్గయ్య, దేవులపల్లి రామానుజరావుగార్లు సహృదయంతో ఈ కవి- వారి కవితనుగురించి తమ అమూల్యాభిప్రాయా లను వెలిబుచ్చారు. వారి సహకారాని కెంతైనా కృతజ్ఞులం.

ఈ గ్రంథ ముద్రణ భారంలో భాగస్వాములై శ్రీ కొత్వాల్ వీర భద్రరావు (పంగెం) గారు రు. 200 లు గ్రంథమాలకు విరాళం ఇచ్చారు. అట్లే గ్రంథమాల నిర్వహణకై ఆర్థికంగా, నైతికంగా దేశీయులు సాయ పడుతున్నారు. వారందరికీ హృదయపూర్వక నమస్కారాలు.

ముఖచిత్రకారులు శ్రీ ఎం. బలరామాచారిగారికి మా అభివందనాలు.

*దేశోద్ధారక గ్రంథమాల,*
సికింద్రాబాదు,
9-11-57

విన్నవించు :
వట్టికోట ఆళ్వారుస్వామి
స్థాపకుడు, ప్రకాశకుడు

# పీఠిక

"ఆహ్వానము" అను యీ ఖండకావ్య సముచ్చయము తమ అనేక అముద్రిత రచనల నుండి వరదాచార్యులవారు ఏరి కూర్చి ప్రకటించిన మలి సంపుటము. తొలి సంపుటియైన 'మణిమాల' యిప్పటికి పదునైదు సంవత్సరాల క్రితము ప్రకటితమై ఆధునికాంధ్ర కవి పండితుల మన్ననల నందుకొనినది. 'మణిమాల' ప్రకటనానంతరము గడచిన పదునైదు సంవత్సరాలలో వరదాచార్యులవారు 'పోతన' మహాకావ్య రచనలో నిమగ్నులై యున్నప్పటికిని అప్పుడపుడు అనేక ఖండకావ్య రచనలను గూడ గావించియున్నారు. వానిలో కొన్నింటిని యీ గ్రంథములో క్రోడీకరించుట జరిగినది. అచిరకాలములో 'పోతన' మహాకావ్యమును ఆంధ్ర పాఠకలోకమునకు అందించగలరని ఆశించవచ్చును. పోతన మహాకావ్య రసామృతము ఆరగించుటకై రసికాంధ్రలోకమునకు యీ గ్రంథము 'ఆహ్వానము'.

శ్లేషను యింత రమణీయముగా ఉపయోగించిన కవులు ఆధునికాంధ్ర వాఙ్మయమున లేరనిచెప్పినచో అతిశయోక్తి కాజాలదు. సంగీత సాహిత్యములకు ఆటపట్టయిన విద్వత్కుటుంబమున ఆచార్యులవారు జన్మించినారు. వీరు తమ జీవితములో అధికభాగమందు పల్లెటూళ్లలో ప్రకృతిమాత యొడిలో ఉపలాలితు లయినారు; అడుగడుగున జాతీయ భావాలచే ఉత్తేజితులైనారు; వీని యన్నింటి ప్రభావము ఆచార్యులవారి రచనలలో కనుపించుచున్నది. విశేషించి యీ గ్రంథములోని రచనల యందు సమకాలిక సమాజ విమర్శనము ప్రతి పదమునందును ప్రతిబింబితమగుచున్నది.

భారతజాతి పిత గాంధీమహాత్ముని హత్యకు సంతప్తమైన వీరి హృదయము ఆ ఉదార చరితుని, అమృతమూర్తిని బహువిధముల సాక్షాత్కరించుకొనినది. ఈ సాక్షాత్కారము ఆచార్యులవారి మనస్తత్వ

మునకు మంచి దర్పణముగా నున్నది. ఆచార్యులవారి బాపూజీ అమరుడు : సత్యమే ఆతని స్వరూపము ; నిరుపేదప్రజల సేవయే ఆతని నిత్యకృత్యము ; ఆ ఉదారచరితుని అస్తికలు భారతదేశమును పావనము గావించు మంత్రపూతాక్షతలు. ఆ పనియంతయు ఆత్మగేహముగావించు కొనిన గాంధిజీ కవిగారి దృష్టిలో మానవుడుగా వచ్చిన మాధవుడు ; సత్యవంతుడు ; దేశభక్తుడు ; కర్మవీరుడు ; సర్వసముడు ; లోక బాంధవుడు ; భజనపరుడు ; చంటిబిడ్డనివంటి నిరాడంబరుడు ; శత్రువునకు గూడ మిత్రుడైన మహానుభావుడు. ఈ విధముగా జాతి పిత అమృత మూర్తిని అవలోకించిన ఆంధ్ర కవులలో ఆచార్యులవారు అగ్రగణ్యులు. శ్రీరామ కథను గానముచేసిన వాల్మీకివలె మోహనదాసుని పవిత్రచరిత్రను వరదాచార్యులవారు కావ్యగానము గావించినారు.

రైతు జీవితమును ఆచార్యులవారు యిందు మనోహరముగా చిత్రించినారు. రైతుకు సూర్యుడు, చంద్రుడు నిత్య నీరాజనము లిచ్చువారట ; వాయుదేవుడు వింజామరలు వీచుచున్నాడట. భూదేవికి అతడు తాకిన వెంటనే పులకలేపారినవి, గోమాతకు పాలచేపులు మీరినవి, ఆకాశ గంగ అతనిని అభిషేకించుచున్నది. ఈ సుందర దృశ్యము పల్లెటూరి నిష్కల్మష జీవనము వంక నాగరికులను ఆకర్షించుచున్నది. వర్షాలను ఆచార్యులవారు ఎంత చక్కగా వర్ణించినారో చూడుడు : వానలు వసుధా రాణికి తలంబ్రాలట ; పాడు కరువులకు బాణాలట ; పంటచేలకు ప్రాణాలట ; కాపు కన్నులకు ముత్యాలట ; వరికర్రల నోళ్లకు చనుబాలట. ఇందలి భావము, శైలి ఆచార్యులవారి ప్రత్యేకతకు నిదర్శనము. ఇటువంటివి యీ ఖండకావ్యములో మరెన్నియో కలవు. ఈనాడు మన దేశములో వ్యాపించియున్న అవినీతిని ఆచార్యులవారు చాల చక్కగా ఎత్తి చూపించి, కవులు యెన్నుకోబడని శాసనకర్తలని నిరూపించియున్నారు. దేశభక్తిలో మోసము ; దేవుని గుడిలో మోసము ; రామచంద్ర రూప

ములో రావణాసుర విలాసము అని చెప్పినపుడు నేటి సమాజ పరిస్థితి చక్కగా చిత్రితమగుచున్నది.

కోకిల నుద్దేశించి,

" గానమునకు తగు రూపము
గాంచనైతి నను చింతే;
గానము రూపమును లేని
కాకము గతిని దలంతే."

" అన్ని నాకె యుండవలయు
ననుకొనుటే పెనుదోషము
ఉన్నదానితో తృప్తిని
నొందుటయే సంతోషము. "

అని కవివాణి వ్యంగ్యముగా దేశీయులకు సకాలములో సరియైన హెచ్చరికను గావించినది. ఆంధ్రప్రదేశ్ అవతరణము జరిగిన నవంబరు ఒకటవ తేదీని అతిలోకసుందరమైన నవాంబరముగా ఆచార్యులవారు వర్ణించియున్నారు. ఈ గేయముతో పాటు 'అపూర్వ దీపావళి' ఆచార్యులవారి ప్రత్యేకతను సూచించగల మచ్చుతునకలు. ఈ విధముగా యీ గ్రంథములోని ప్రతి శీర్షికయందును ఆచార్యులవారి ప్రత్యేక వ్యక్తిత్వము ప్రత్యక్షమగుచున్నది. తెలంగాణ కవులలో అగ్రగణ్యులైన ఆచార్యులవారికి సకలాంధ్ర కవులలో సమున్నత స్థానము కలదు. ఈ ఖండకావ్య సంపుటికి హృదయపూర్వకమైన సుస్వాగతము. తాము జేయుచున్న సాహిత్యపు విందును ఆరగించుటకు విచ్చేయవలెనని వరదాచార్యులవారు పంపిన యీ "ఆహ్వానము" రసికాంధ్ర ప్రీతి గావించగలదని ఆశించుచున్నాను.

హైదరాబాదు,
హేమలంబ
కార్తిక బ. విదియ

దేవులపల్లి రామానుజరావు



## రచయిత పరిచయం



జననం : *1913*

చిరునామా : జనతా కళాశాల, దోమకొండ,
(నిజామాబాదు జిల్లా)

కార్య కలాపాలు : సాహిత్య రచన

అభిరుచి : సాహిత్యము, సంగీతము

రచనలు - ముద్రితం : మణిమాల (ఖండకావ్యం)
ఆహ్వానం ,,

అముద్రితం : పోతన (పద్యకావ్యం), నాటికలు, బుర్ర కథలు, సాహిత్య వ్యాసాలు.

అభిమాన రచయితలు : సరస కావ్య రచయితలు.

మకుటాలు

పుట

# జందెపు పోచలు

'ఆహ్వానము' అను ఈ ఖండకావ్య సంపుటి రచయిత శ్రీ వానమామలై వరదాచార్యులు జగమెఱిగిన బ్రాహ్మణులు. పోతనగారి జీవితమును నూతన మహాకావ్యముగా రచించి, దాని ముద్రణకు పూర్వమే 'అభినవ పోతన' బిరుదాంకితులయినవారు శ్రీ ఆచార్యులవారు. ఏవంగుణ విశిష్టులగు వీరికి జందెపు పోచలు వేయుడని కోరుట నాకెంతయు నాశ్చర్యము కలిగించినది. ఐన విధిలేదు. పరిచయ వాక్యములు కోరినవారు మన్మిత్రులును, దేశోద్ధారక గ్రంథమాల ప్రచురణకర్తలునయిన శ్రీ వట్టికోట ఆళ్వారుస్వాములు. స్వాములమాట దాటరానిది కదా ! ఇంతేకాక ప్రస్తుత గ్రంథకర్తయగు ఆచార్యులవారును, నేనును ఒకకంచమున దిని, యొక్కమంచమున బెరిగినవారము. కావున నీకార్యము సంతోషదాయకమై నాకు తప్పనిసరియయ్యె.

శ్రీ వరదాచార్యులవారిది పండిత కుటుంబము. వీరి పూర్వులందఱును దిగ్దంతుల వంటివారు. ఈవిషయమును కవి తమ ప్రథమముద్రిత గ్రంథమగు "మణిమాల" పేరిటి ఖండకావ్య సంపుటి యవతారికలో చక్కని పద్యములలో స్వయముగా సవిస్తరముగా వ్రాసియున్నారు. ఈ 'మణిమాల' ఆంధ్రసారస్వత పరిషత్తు విశారద పరీక్ష పాఠ్యగ్రంథములలో నొకటిగా నున్నది. కవిగారి పూర్వులలో నొకరు శ్రీ వానమామలై పీఠాధిపతులగు అప్పటి స్వాములవారితో సప్తవాసర పర్యంతము శాస్త్రవాదమును సాగించిరట ! దానికి చిహ్నముగా నాటినుండి ఈ వంశమువారికి "వానమామలై" వారను ప్రసిద్ధి కలిగి, నేటికిని వీరింటిపేరుగా స్థిరపడియున్నది. వాణి వీరియింట వసతి గొన్నది.

శ్రీ వరదాచార్యుల జనకులు నరసింహాచార్యులు. వీరికి బక్కయశాస్త్రియని ప్రసిద్ధి. వీరు గొప్పసంస్కృత పండితులేకాక చక్కని పౌరాణికులు. వీరి పురాణ కథనమునుగూర్చి, 'వింటే బక్కయ్యశాస్త్రి పురాణమే వినవలె, తింటే గారెలే తినవలె'నను నానుడి వరంగల్లు జిల్లాలో ప్రబలినది. వీరిది చక్కని జంబూర గోత్రము. కవిగారికి ముగ్గురగ్రజులు కలరు. జ్యేష్ఠులు శ్రీ వెంకటాచార్యులు. వీరు సంస్కృతభాషానిధి. ఆంధ్రభాషాపండితులు. అరవము, ఆంగ్లము, ఉర్దూ, హిందీ, భాషలు స్వయంకృషిచే నభ్యసించిరి. అధునికగణితశాస్త్రమునందును అతిపరిచయము

కలవారు. నిరాడంబరులు, ఎచ్చటికినిరారు, పోరు. గాంధీభక్తులు. ఖద్దరునుమాత్రము కట్టుదురు. ప్రస్తుతము గట్లనరసింగాపురమున వీరికాపురము. తర్వాతివారు లక్ష్మణాచార్యులు. అన్నగారివలెనే వీరును బహుభాషావేత్తలు. తర్క, వేదాంతశాస్త్రములలో నిష్ణాతులు. వీరు కొంతకాలము ఆహిరీరాజాగారి ఆస్థానవిద్వాంసులుగా నుండి కోయ భాషకు లిపి వాఙ్మయములను నూత్నముగా సృష్టించిరి. సంస్కృతాంధ్రములలో కవులు. వీరి 'ప్రకృతిరాగము' అను తెలుఁగు ఖండకావ్యము నాచిన్నతనమున ముద్రితముకాగా చూచితిని. ఇప్పుడు ప్రతులు దొరకవు. సంస్కృతమున అనసూయా నాటకమును కాబోలు రచించియున్నారు. గ్రంథము ముద్రణాభాగ్యమును పొందలేదు. మూడవవారు శ్రీ జగన్నాథాచార్యులు. వీరునూ సంస్కృతాంధ్ర భాషాపండితులు. అగ్రజులవలెనే అన్యభాషలు నేర్చినవారు, ఎన్నదగిన కవులు, 'కార్పాసలక్ష్మి' యను చక్కని తెనుఁగు నాటకమును రచించిరి. ఇందలి కొన్నిపద్యములు మచ్చునకు గోలకొండ కవుల సంచికలో ముద్రితములయి యున్నవి. కాని అది అచ్చుకాకముందే ఆచార్యులవారియొద్దనుండి అసలుప్రతి అదృశ్యమైనది. వీ రీటీవల *'రైతురామాయణ' మను పేర నొక క్రొత్తకావ్యమును వ్రాసినారు. ఇతివృత్తము కల్పితము. వీరు సేద్యము వృత్తిగా గలిగి, కర్షకులతో కలసిమెలసి తిరుగు కాలమున గ్రామములయందలి కర్షక వాఙ్మయమును జాగరూకతతో సంగ్రహించిరి. వారి జీవితవిశేషములను, కష్టనిష్ఠురములను కనుగొనిరి. కవిగాన కృషిజీవితమునందలి యీ తమ యనుభవమును ఆంధ్రసాహిత్యకృషికి వినియోగించి "రైతురామాయణ"మను ఉత్తమకావ్యమును నిర్మించిరి. కాపుల జీవితమునందలి కష్టనిష్ఠురములే యిందలి ఇతివృత్తము. కవిత్వము సహజమై, యుత్తమశ్రేణికి చెందినది. చక్కని జాతీయములు, నుడికారములు విశేషముగ కలిగి కేవలము కావ్యమేకాక ఈ "రైతురామాయణ"మొక మాండలిక పదకోశమనదగి యున్నది. ఈ జగన్నాథాచార్యులు గాయకులు. హరికథలు కూడ తెలుగు, హిందీభాషలలో రమ్యముగా చెప్పగలరు.

ఈ గ్రంథకర్త శ్రీ వరదాచార్యులు ప్రాయమున పై ముగ్గురికి పిన్నయైనను కవిత్వమున మిన్న. వీరు తండ్రిగారియొద్దను, తండ్రిగారితో సమానులయిన అగ్రజులయొద్దను పంచకావ్యములు, నాటకములు పఠించి, చిన్నతనముననే సంస్కృతభాషా పాండిత్యమును సంపాదించిరి. అరవము మొదలగు అన్యభాషలు

---

*దీనిని మా గ్రంథమాల ప్రచురణగా అందించ నున్నాము. —ప్రకాశకుడు.

వీరికిగూడ వచ్చును. అందరి గుణములును వీరియందు సంక్రమించుట విశేషము. తండ్రిగారివలె పురాణము చెప్పగలరు. అన్నలలోని గుణములన్నియు వీరియందు కలవు. చక్కగా పాడగలరు. హరికథా కాలక్షేపము చేయగలరు. పైగా తబ్లా, హార్మోనియమ్ మొదలగు వాద్యములుకూడ నేర్చినవారు. ఇక వీరి కవిత్వమును గూర్చి నేను చెప్పవలసిన పనిలేదు. వీరి తొలి రచనయు, బాల్యరచనయునైన 'మణిమాల'యే తిరుపతివేంకటేశ్వర కవులు, విశ్వనాథ సత్యనారాయణగారి వంటి వారి ప్రశంసలకు పాత్రమైనది. వీరు ప్రస్తుతము వ్రాసియున్న, వ్రాయుచున్న పోతన మహాకావ్యము తెలంగాణమునందలి సకలప్రజానీకము మన్ననల నందినది. వీరి 'అభినవపోతన' బిరుదమే యిందుకు సాక్షి. ఇందలి కవిత్వము పోతన శ్రీనాథుల అడుగుజాడలలోనడచి, వారి కవితాసరస్వతి చేలాంచలాకర్షణమునకు దగియున్నది. ఇట్టి పోతనకావ్యరచమునకీ కవిగారు తమజీవితమునందలి యుత్తమోత్తమభాగమును ధారవోసిరి. ఆర్థికముగను, శారీరకముగను ఎన్నిచిక్కులకు లోనైనను తమ ప్రయత్నమును మానక పట్టుదలతో కొనసాగించి, కృతకృత్యులయిరి. ఈ పోతన కావ్యమును ముద్రణరూపమున జూచుట నేటికిని తలపోతగనే యున్నది. ఇట్టిభాగ్యము దీని కచిరకాలమున ప్రసాదింప పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను. ప్రస్తుతము శ్రీ వరదాచార్యులు దోమకొండ జనతా కళాశాలలో నుద్యోగులుగా నున్నారు. ఉద్యోగ ధర్మముననుసరించి వీరిటీవల బుఱ్ఱకథలు మొదలగు వినోదకవితారచనమును జేయుచు, సాహిత్య సవ్యసాచిత్వమును నపరించుకొనుచున్నారు.

ఈ 'ఆహ్వానము'ను కవి, శ్రీ కాళోజీ రామేశ్వరరావు, నారాయణరావుగారుల జననీ జనకులగు శ్రీ కాళోజీ రంగారావుగారికిని రామాబాయమ్మగారికిని అంకిత మొనగి, గురుభక్తిని వెల్లడించుకొనెను. కాళోజీగారిని, అందఱు మెఱుగుదుము. ఆయన నాకు అతిబాల్యమిత్రుడు. ఆయన తలిదండ్రులును, ఏతత్కృతి భర్తలును అగు శ్రీ కాళోజీ రంగారావుగారిని, వారిధర్మపత్నిని గూర్చి చెప్పుటకుగాని, వారి గుణగణముల లెక్కించుటకుగాని యిట చోటుచాలదు. వారు, ఈకవి గురువులు మాత్రమే కాదు. వారి యిల్లొక గురుకులము. వారియింట చదువనివారును, వానలోన తడువనివారును మా మడికొండగ్రామమున లేరు. వారి శుశ్రూషచేయుట పిన్నపెద్ద లొక గౌరవముగ భావించువారు. వారిని సేవించి చెడినవారును, సేవింపక బాగుపడినవారును ఆనాటి విద్యార్థులలోలేరు. విద్యతోబాటు వినయమును, క్రమ శిక్షణమును ఆచరణపూర్వకముగా వారు విద్యార్థులకు గరపిరి, వారు రామభక్తులు, విరతసత్యవ్రతనిష్టులు. వీరి యిల్లాలు రామాబాయమ్మగారు నిజముగనే ఆదర్శ

గృహిణి. ఈ కారణమున నిట్టి ఉత్తమ దంపతులను స్మరించి నేను ధన్యుడనైనట్లు భావించుచున్నాను. కృతికర్త, కృతిభర్తలనుగూర్చి యీ కొన్ని వాక్యములను పలుకు నదవకాశమును కల్పించిన మిత్రుడగు శ్రీ పట్టికోట ఆళ్వారుస్వామిగారు నాకు అభినందనీయులు. ఇది కేవలము కవిపరిచయము. ఈ కావ్యపరిచయమును నామిత్రులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు సమంజసముగా కావించి యున్నారు.

తేది. 29-11-57

పల్లా దుర్గయ్య
ఆంధ్రోపన్యాసకులు
నిజాంకళాశాల.

కీ. శే. కాళోజి రంగారావుగారు



కీ. శే. కాళోజి రామాబాయమ్మగారు



“ అంకితము నొనరింతు నత్యంత భక్తితో తలిదండ్రు లటు లాత్మ దలచి యేవేళ ”.



# అంకితము

పార్వతీ పరమశివ ప్రతిబింబములు తాము
మానవాకృతులలో మహి నవతరించిరన
సుఖ దుఃఖముల సమతఁజూచు నిర్లిప్తులై
పూజ్యులును, ప్రాజ్ఞులును పుణ్యాత్ములైనట్టి.

రామేశ్వరాఖ్య నారాయణాఖ్య వెలంగు
కాళోజి సోదరులగన్న తలిదండ్రులగు
కాళోజి రంగరా ఘ్ననునకును శ్రీవారి
ఆదర్శపత్ని రామాబాయిసాధ్వికిని.

గాంధి స్మృతిగాథలను గాంధి గుణబోధలను
సంధాన మొనరించి సత్కృతిని రచియించి
అంకితము నొనరింతు నత్యంతభక్తితో
తలిదండ్రులటు లాత్మ దలచి యేవేళ.





# తొలిపలుకు

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య త దాత్మానం సృజా మ్యహమ్.

అని శపథ మొనర్చిన యా పరంజ్యోతి తన విశ్వరూపమును తీర్చి దిద్దుకొన, ప్రతియుగమున శుద్ధ సాత్వికములగు నామరూపముల జన్మించుచునే యున్నది. తన యమూల్య విజ్ఞాన శరచ్చంద్ర చంద్రికా కాంతి సంతతుల సమస్త బ్రహ్మాండభాండమున విరజిమ్ముచు అఖిలదిశల వ్యాప్తమైన ఘోర దోషపటలమును పారదోలుచునే యున్నది.

ఆదినుండి యా పరతత్వము సకలభూతములలో తన యేకత్వము నిరూపించుకొన మీన, కూర్మ, వరాహాది తిర్యగ్జంతు సంతతుల తన ప్రకాశమును ప్రతిబింబిత మొనర్చి దేవావతారముల దిద్ది తీర్చినది. గుణ కర్మ విభాగముల సృజించుకొనిన చాతుర్వర్ణ వ్యవస్థయు, కడదగు పంచ మత్వము గూడ తన వేషభాషా విభేదములే యని, క్రమగతి నిరూపించు కొనుచున్నది. మొదట వామన పరశురామాది వైఖరిలో నగ్రవర్ణమున నవతరించి, పిదప రామకృష్ణాది క్షాత్ర జన్మములందును తన యేకత ప్రత్యక్షపరచికొనినది. ప్రస్తుతము విశ్వభూతకోటి తన యంశములే కావున విశ్వరూపమున నే యవయవము బలహీనమైనను దేహికె బాధా



కరమగుటచే నాత్మరూపులగు నఖిల ప్రజలకు సమాన సుఖసంపద్భాగ
ముల పంచి యిడుటకు (సమబుద్ధి) రూపమగు తులంబూని మూడవజాతి
యగు వైశ్యత్వమును తన రూపొనర్చినదిగా దోచును.

పరాక్రాంత ధరా భాగముల భారతీయుల వశమొనర్చి దాస్యభార
ముడిపినది. అజాతశత్రు వర్తనమునం దఖిల మానవుల కాదర్శకమై
యాచార్యప్రాయమైనది. అమూల్య కస్తూరి నలముకొని యసమాన
మోహనకరగంధియై యొప్పినది. కస్తూరి గతించినను వస్త్రరూప భార
తావనిలో నా సుగంధ రూపగంధి కతిపయ దినములను గడిపి వెడలి
పోయినది. పుష్పముల విడిచిన పుష్పసౌరభము ఇంతి శిరోజములలో
నెంతకాలమో నిల్వక నిట్టె యెగిరిపోవుట సహజమే.

ప్రహ్లాదుని భక్తి సుధారసమును, ఆదిశుకుని అమాయకత్వమును,
భీష్ముని ఇంద్రియ నిగ్రహమును, హరిశ్చంద్రుని సత్యసంపదను,
శ్రీరామచంద్రుని ధర్మనిరతిని, ధర్మరాజు అజాతశత్రుత్వమును, కృష్ణుని
కర్మజ్ఞాన సంపుటీకరణ కౌశల్యమును, శిబి, కర్ణుల స్వార్థత్యాగమును,
జనకుని నిష్కామకర్మ నిపుణతను, బుద్ధుని దయాజలధిని, క్రీస్తు క్షమా
గుణమును, టాల్‌స్టాయి తత్వరహస్య జిజ్ఞాసను, ప్లాటో భావోన్నతిని,
సోక్రటీసు కష్టసహనశీలతను, అబ్రాహాంలింకన్ కార్యదీక్షను, ఒక్క
దిక్కునకు దెచ్చి తన యమూల్యజీవన పేటిలో భద్రపరచి శక్తిపూర్ణ
దేవావతారమును సహజ మానవత్వపు ఛాయలలో చూపిన పురుషోత్త
ముడు గాంధి.

పసిపిల్లని యమాయకత్వములో బ్రహ్మజ్ఞానసమాధి సోపానముల
పదిలపరచిన పరమహంస, పవిత్రయోగీశ్వరుడు, అవధూత, అర్ధదిగం

బిరుదు, అధ్యాత్మజ్ఞాన కోవిదుడు, అపరిమిత రాజకీయ విజ్ఞానవిశారదుడు అమరమూర్తి గాంధీ.

అతని తేజం బఖిల భూతకోటి అపార విచారాంధకారమున మునుంగ శ్రీ సర్వజిన్నామ సం. పుష్య బ. ౫ శుక్రవారమునకు సరియైన క్రీ. శ. 1948 జనవరి 30 వ తేదీని సాయంకాలము 5 గంటలకు ఒక మదోన్మాది - కాదు ఒక మతోన్మాది తుపాకి ప్రేల్పులకు, బోయవాని ములికి ప్రేటునకు కృష్ణునివలె సమిష్టితేజమున లీనమందెను. అది విని నా హృదయవేదన నాపజాలక ఒకేమారు హృదయము ద్రవించి వ్రాసిన పాట లివి.

ఆ మహాత్ముని నిర్యాణమును గూర్చియు నతని గుణగణముల గూర్చియు కొన్నిగేయములు వ్రాసితిని. ఇంకను నే నప్పుడప్పుడు వ్రాసిన ఇతర గేయముల నీ గ్రంథరూపమున ప్రకటించు నదవకాశము కల్పించిన నా ప్రాణమిత్రునకు కాళోజీ నారాయణరావుగారికి కృతజ్ఞుడను.

ఈ చిన్ని పుస్తకమును నాకు గురువులును, అపార విజ్ఞాన నిధులును అయిన శ్రీ కాళోజీ రంగారావుగారికి, వారి ధర్మపత్ని ఆదర్శ మహిళ శ్రీమతి కాళోజి రామాబాయమ్మగారికి కృతినొసంగు నదవకాశము గల్గించిన శ్రీ కాళోజీ నారాయణరావుగారికి మరొకమారు నా కృతజ్ఞతల నర్పించుచు విరమింతును.

ఇట్లు
ర చ యి త.



# విజయగీతి

జయ భారతావనీ, జయ లోకపావనీ
శాంతిసుఖదాయినీ, జననీ నమస్తే.

సకలసంపత్ఖనీ సస్యనందనవనీ
ఆసేతుశీతనగ హాటకావనీ
చత్వారింశత్కోటి జయసంఘటికాధ్వనీ
సాశీతికోటి భుజబల మహావాహినీ. జయ.

హిందూ ముసల్మాన్ ఈసాయి సిఖ్ జైన్
బౌద్ధ చార్వాక మత బహుమత కుటుంబినీ
సంస్కృతాంధ్ర ద్రవిడ వంగ హిందీ ఓఢ్ర
ఘూర్జర మరాఠ కర్ణాట కలభాషిణీ. జయ.





గంగామహానదీ గౌతమీ కృష్ణాది
రంగత్తరంగిణీ రమ్యామృతస్తనీ
శాంత్యహింసా సత్య శస్త్రాస్త్ర ధారిణీ
వీరనారీమణీ విశ్వహితకారిణీ. జయ.

వేద వేదాంత విజ్ఞాన విదుషీమణీ
బౌద్ధ సిద్ధాంత నిర్వాణ ప్రచారిణీ
కాళిదాస వ్యాస కావ్యమందాకినీ
సంగీత సాహిత్య సత్కళా మోహినీ. జయ

నీ మహోన్నతి హిమానీ గోత్ర శిఖరమ్ము
నీ పవిత్రత గాంగ నిర్ఝర ప్రవాహమ్ము
నీ చేతిసౌ మ్మెలోరా శిల్పఖండమ్ము
నీదు వాక్యమ్ము శ్రీగీతోపదేశమ్ము. జయ.

నీకు ముమ్వంకలును నిలిచి రత్నాకరుడు
వెలినురుగు తరగలను వింజామరల వీచు
నీ హిమాలయమకుట నిర్మాణమున దోచు
జీవమణులై సూర్య శశి తారకలు పూచు.

జయభారతావనీ.





# నిజమే ?

నిజమె ? భారతభూమి భర్త, మా బాపూజి
నిహతుడైనాడనే వార్త. నిజ.
తప్పువిన్నారలా తలచెడినవారలా
ఎప్పు డీపనిగాదు ఎవడాయన విరోధి ? నిజ.
కల గాంచుచుంటినా కల్ల వినుచుంటినా
యిల పత్రికలకు పిచ్చెత్తి యిటు లాడెనా. నిజ.
రేడియో మోరలకు నేడేమి మూడినది
ఈ యమంగళవార్త నెటు లుచ్చరించినవి. నిజ.
తామె పత్రిక లబద్ధమ్ము లీవార్త లని
ప్రకటించు మరల రేపటికి నను మన నేమొ. నిజ.
అ:ఖలు గల్పించిన మహాత్ముపైగల పీడ
తేలిపోవు నటంచు తెల్పియుండవుగదా ? నిజ.
నీవు బ్రతికియెయుండ నిహతుడైనా డనగ
అవనిలో నెవని నాల్కాడు హరిహరి నిజమె. నిజ.
చనినాడు చనినాడు చనినాడు బాపనుచు
భూమియాకాశమ్ము ఘోరమనుచున్న దిక
నిజమె యిక నిజమె యిక నిజమే. నిజ.





# కొంప మునిగినది

కొంప మునిగినది బాపూజీ ! నీవిట్లు
గుట్టవలె గూల గాంధీజీ !
ఎంతపనియైపోయె నిదియేమి యీమాయ
ధరణిజనములగుండె దద్దరిలి పోయినది.      కొంప:
నిశ్చేష్టమైపోయి నిఖిల ఖండాలతో
నుర్వియంతయు వడకి యుయ్యాలలూగినది.      కొంప.
భరతదేశపుగుండె బ్రద్దలై పోయినది
గంగాయమునలార్చి కన్నీరు గార్చినవి.      కొంప.
ఆ హిమాలయమంత యల్లల్ల నాడినది
అదరి కై బరుకనుమ యను నోరు దెరచికొని.      కొంప.
హిందూమహోజలధి హృదయమంతయు నుడికి
సలసలంగ్రాగి కడు సంక్షోభముం జెందె.      కొంప.
చెవుల పిడుగులుగూల్చి చీల్చె నెద నీవార్త
కనుల బాష్పాంబుధుల కలచె పెద్ద తుఫాను.      కొంప.
చేతులందున్నట్టి జవసత్వములె యుడిగె
వ్రేళ్ళుదెగు చెట్లగుచు కాళ్ళు నేలం గూలె.      కొంప.





# చచ్చినటులేదు

చచ్చినటులేదు గాంధీజీ, యెటనుండొ
వచ్చునటు దోచు బాపూజీ
బోసినగవులతోడ కానె ఖద్దరుతోడ
కాళ్ళచెప్పులతోడ కన్నద్దములతోడ. చచ్చి.
ప్రార్థనావసర సంభాషణమ్ములు సలిపి
కాందిశీకుల వెచ్చ కన్నీళ్ళు దుడుచుటకు. చచ్చి.
జవహరు పటేలులకు సలహాలనిచ్చుటకు
హరిజనుల నోదార్చి యాదరించుట కొఱకు. చచ్చి.
పిలుచుచుండినయట్లు పలుకుచుండినయట్లు
నవ్వుచును మాముందు నడయాడ కట్టిగొని. చచ్చి.
నమ్మటయెలేదు మానస మతడు చనెనన్న
ఇమ్మహియు గాంధీ విహీనయై యెటులుండు. చచ్చి.
కనులుమూసినగాని కనులు దెరిచిననేని
అచ్చముగ ఆమూర్తి వచ్చి కన్నులగట్టు. చచ్చి.
మరగాలు పైచుకొని యరదిగంబరుడగుచు
చరఖాను ద్రిప్పుటకు నిరుపేద వేషమున. చచ్చి.





# ఇక నీవు కనబడవు

ఇకనీవు కనబడవు గాంధీ, బాపుజీ
యిల మిగిలె మాకు నీరంధి. ఇక.
బంగారువంటి నిను పాపి కులనాపకుడు
దొంగయైవచ్చి యిటుమ్రింగి నీళ్ళుంద్రావె. ఇక.
నీచావు విన్నంత నిలువు నిస్సారమై
గుండెలోపల పెద్ద గుండుబడినట్లయ్యె. ఇక.
నిను జంపుకొని నేడు నిఖిలభారత గృహము
బావురని చీకట్ల పాడుబడినటుదోచు. ఇక.
మోకాలువరకు వ్రేల్డాకు నీ యాజాను
బాహు రూపమ్మ గుప్తమయ్యె సర్వదా. ఇక.
లోకమంగళరేఖ యాకల్పతరుశాఖ
నీచేతి నీడ కిక నీళ్ల విడిచెను కనులు. ఇక.
నిఖిలభువి తనకీర్తి నిలబెట్టు కొడుకు చన
భారతాంబకు కడుపు పగిలిపోకుండు నెటు. ఇక.
బ్రతికి నవ్వెం చాత్మబంధువుం డగువాడు
చచ్చితానేడ్పించు శత్రు వింతయు గాడు. ఇక.





# అనుకొనలేదు

అనుకోనెలేదు కలనైన, నీ మరణ
మగు నిట్టు లనుచు బాపూజీ. అను.
ఆటమ్మబాంబులకు హడలుపుట్టించు నీ
గుండెకాయ తుపాకిగుండు కెటు సందిచ్చె. అను.
మతకక్షరూపంపు మారి నీ సముఖాన
నాల్కలం జాచ మానసమునం గుండువడు. అను.
భరతదేశంపు దౌర్భాగ్యమ్ము మూర్తమై
అల్పమానవు డొకడు హతమార్చు నిన్ననుచు. అను.
ఇలమతద్వేషకృత హింసాదులను గనుచు
బ్రతుకవలదను నీదు ప్రార్థనల హరి వినుట. అను.
నీదు గండాన జన్మించె నీ స్వాతంత్ర్య
శిశువనచు నేజోషి చెప్పడాయెను మాకు. అను.
మొనమొన్న నేపుట్టి కనులె తెరవని యట్టి
చిన్ని స్వాతంత్ర్య సుత కన్నయ్య జంపుకొను. అను.
నూటయిరువదియేండ్లపా టుందునని చెప్పి
ఎనుబదేండ్లకె దివికి నెగసి పోయెదవనుచు. అను.





# ఎవరున్నారు

ఎవరున్నవారు గాంధీజీ, మమ్ములను
సవరించి సాద బాపూజీ. ఎవ.

ఉపవాసములబండి యుప్పిడుల మనుచుండి
మాకు గూర్చెడివారు మహి నింకొకడు లేడు. ఎవ.

ఊఁయంటె ఆఁయంటె, ఉరికి సలహాజెప్ప
మను పటేలుకు జవహరుకు దిక్కేదింక. ఎవ.

ఘోరాసురులనీడ బారనీకుండ మము
కంట కనుబెట్టుకొని కాపాడుకొను వారలు. ఎవ.

శాంతిఖడ్గమ్మగుచు సాముజేసెడి దివ్య
రసనాగ్రమున రాజ్యరమగెల్చి జగజెట్టి. ఎవ.

మహిని యన్యాయమ్ము మాకెచట గాకుండ
మావైపు నిల్చి నీమాడ్కి పోరాడువారు. ఎవ.





# చేతు లెటు వచ్చె

ఈఘోరమరణమ్ము దెచ్చె, బాపూజి
ఇటు వాని చేతు లెటు వచ్చె. ఈఘోర.
వీరమరణమ్ము జేకూరవలె నా కనుచు
శాంతిసమరాన మేన్జాలించితివె బాపు. ఈఘోర.
ధరమహాత్ముల జీవితముభాతి మరణమును
ఉపకరించునటంచు నుదహరింప నిటైతె. ఈఘోర.
హిందుముస్లిం సుతుల కిరువురకు పితవీవు
కన నిర్వురును రెండు కన్నులని తెలిసె తుది. ఈఘోర.
తామన్నదమ్ము లిటు తన్నుకొని చచ్చునెడ
ఎవడుజచ్చిన నేనె యేడ్వవలెనని చనితొ. ఈఘోర.
ప్రజల పాపమ్ము నాపైనుండి చనుగాక
అని మాదుశిక్ష నీవనుభవించితె స్వయము. ఈఘోర.
నీ పూతరక్తాన నిఖిలాఘములు మావి
కడిగివైచితివేమొ గంగాజలమువోలె. ఈఘోర.
బలియిచ్చినావు నీ ప్రాణాల మాకొఱకు
కళదెచ్చినావు నీకడచూపులం దరకు. ఈఘోర.





# ఎటు బోతి వయ్యా

ఎటుబోతివయ్యా బాపూజీ, నీవారి
నెటుగానివారలను జేసి. ఎటు.
మనసులో మెరసియాడును బోసి నగుమోము
కనుమూసినంతలో కరవయ్యె నది నేడు. ఎటు.
తళతళమేల్పసిడి తడలీను నీమేని
కగ్గిమంటలపుటము లవసరము లయ్యెనా. ఎటు.
కళలనొప్పారు చక్కని నగుమొగము పూవు
జన్మ భూ మాతృపూజకు రాలిపడెనేమొ. ఎటు.
పాలబోల్ ఖాదిలో తేలాడు నీమేను
క్షీరాబ్ధిలో హరికి శేషశయ్యగ జనెనా. ఎటు.
పంచదశ విమలోపవాస దీక్షలతోడ
ఘనత మోహనదాస కర్మచంద్రుండవై
నిండుపున్నమనాటి పండువెన్నెలవంటి
కీర్తి షోడశకళల పూర్తిజేసి గతించి. ఎటు.





# ఏడి మీ బాపూజి?

ఏడి మీ బాపూజి యన్న, పరదేశజుల
కేమనుచు జెప్పవలెనన్న. ఏడి.
మానవత్వమ్మునకు మకుటమ్ము బాపూజి
తాను భువి కరుణావతారమ్ము బాపూజి. ఏడి.
భరతదేశంపు సౌభాగ్యమ్ము బాపూజి
ధరణికంతకు శాంతిదాత మీ బాపూజి. ఏడి.
మహి బుద్ధభగవాను మరపించె బాపూజి
ఏసుదేవుని మారువేసమ్ము బాపూజి. ఏడి.
శాంతి నోబుల్‌ప్రైజు సకలమానవులలో
ఒక గాంధి దక్క వేరొరుని వరియింపదట. ఏడి.
మనబాపునం దఖిల మతకర్తలైక్యమై
రచను దిగ్దేశమ్ము లభినందన మొనర్చు. ఏడి.
సేవగ్రామము నేడు రావలయు నీవనుచు
తనువు సింగారించుకొని యెదిరిచూచునట. ఏడి.





# తాళలేము

తాళ మీ గొప్పయవమతికి, మాకిపుడు
తల నేలబడె యేటి బ్రతుకు. తాళ.
అన్నమిడువారికే సున్నమిడు హిందువని
నగువారిలో యెట్లు మొగమెత్తి తిరుగవలె. తాళ.
ఆనాడె ఆంగ్లేయు లంట వెరచిరి నిన్ను
నవఖాళి ముస్లిములు నంగిపోయిరి నీకు. తాళ.
కన్నబిడ్డలవోలె కాపాడు నిను మేము
చేనేత జంపుకొని సిగ్గువిడి బ్రదికితిమి. తాళ.
పగటికలలయ్యె మా భావానుభూతియది
కలవరింపాయె మా పలికిన ప్రియోక్తులవి. తాళ.
చేజిక్కు రత్నమును సింధువున విసరితిమి
కోతివలె ముత్యముంగొరికి పడవేసితిమి. తాళ.
గ్రుడ్డిదొరతనము కూకటి వ్రేళ్ళతోగూర్చి
ధర్మవిజయముగూర్చి ధరశాంతి నెలకొల్ప
భారతనరుని సమరసారథిని నే నవిన
పురుషోత్తముని దీన నరబాంధవుని జంపి. తాళ.
తమ నాయకుడు మార్గదర్శకుండయినట్టి
యుగపురుషుడగు గాంధి సుగుణాఢ్యు జంపిరన. తాళ.





# ప్రార్థనకు వచ్చె

ప్రార్థనకు వచ్చె బాపూజీ దర్శనము
నర్థించు ప్రజమధ్య జొచ్చి
ఖాదిదుప్పటి ధవళ కాంతు లీనగ మేన
రజతాద్రి నడయాడు భుజగభూషణు భాతి. ప్రా.
నిఖిలజన నేత్రరుచి నీరాజన మ్మిడగ
గాంధీకి జైయనే గంటలే మ్రోగంగ. ప్రా.
పదుగు రేకమ్మగుట పరమాత్మ శక్తియని
పదిప్రేళు లొకటిగా నదె కేలు జోడించి. ప్రా.
నాదనుచు నీదనుచు భేదమ్ము జూపించు
ఆదిమాయకు గృహము లగు కన్నుగవ మూసి. ప్రా.
వేలతలలన్గనుల వెలయు మానవతతిని
సరివిశ్వరూప దర్శనముగా భావించి. ప్రా.
తనదు జీవనమె పుణ్యనదీజలము గాగ
ఆ విశ్వరూపునకు నభిషేక మొనరింప. ప్రా.
అనృత మాడని జిహ్వయను తులసిదళముతో
శాంత్యహింసాన్వితస్వాంత పుష్పమ్ముతో. ప్రా.





# ఎంతశనివేళ

ఎంతశనివేళ తావచ్చె బాపూజి
హంతకుం డాసభను జొచ్చె. ఎంత.
అవివేక మను దున్న నధిరోహణ మొనర్చి
పిలుచుకొనిపో వచ్చి నిలిచె నా కాలుండు. ఎంత.
గోముఖవ్యాఘ్రమై క్రూరు డాహంతకుడు
ఆలస్యమయ్యె నేడని యాత్రమున వంగె. ఎంత.
గోలి ఢామ్మన వేగ గోలయది యేమనుచు
బోర్లబడినది ఢిల్లి పురమొక్కపె ట్టచట. ఎంత.
గడియలో చీకట్లు గ్రమ్మె నచ్చటి ప్రజకు
మరి రెండు తేపలం గురిసె ధణధణ గుండ్లు. ఎంత.
కడుపులో తలదూర్చి కదలించుకొనిపోయె
నలతుపాకీగుండ్లె యై మీది లోకాలు. ఎంత.
ఆ లోకముల కెంత యవసరము బడినదో
పక్షివలె నెత్తుకొని పరువెత్తె గాంధీని. ఎంత.
ఖలుడు కుమతి యెవండో కాల్చె బాపు నటంచు
తూర్పార బట్టి ప్రజ దుమ్మెత్తి పోయగా. ఎంత.





# ( హేయ్‌రామ్ )

హే రామ యని నేలగూలె, దుష్టుండగు
హంతకుని చేతి గోలీల. హే.

జగమె నేనను లోకజనకకల్పుని గాల్చి
కొట్టుకొనె తా నెక్కినట్టి కొమ్మనె వాడు. హే.

వెదురు చెట్టున బుట్టు విత్తన మ్మట్టు లీ
ఖలుడు భారతమాత గర్భమ్ము జెడబుట్టె. హే.

గాయాలలోన భీకర కాళికా ముఖము
నోరు విప్పెను రుధిరధార సెలవుల గార. హే.

నెఱి ఖాది కండువా నిర్మ లాకాశమున
సూర్యాస్తమయ మగుట జూపె రక్తారుణిమ. హే.





# క్షోణి నొరిగెను

క్షోణి నొరిగెను గాంధి యపుడె భువనమ్ము
లోనికిం గొనిపోయి రతని
ఏమి జేయుద మంచు నిటటు పరుగిడువారు
తొందరకు నేమియును దోచకుండినవారు. క్షో.
చల్లనీ ర్మొగమందు జల్ల తెలివికి వచ్చి
పలుకునో యని యురక పిలిచి యేడ్చెడివారు. క్షో.
విశ్వప్రయత్నముల్ విఫల మగుటన్ వైద్యు
లాశయే లేదనుచు నశ్రువుల్ గురిసెదరు. క్షో.
జడమువలె నట్టిట్టు
క త్తివా టిడిన ర క్తములేదు నెప్రహూకు. క్షో.
బ్రదుకునని యెవదేని భార మిచ్చినయెడల
ఎవరి ప్రాణంబేని యెదురీయ వెనుబోరు. క్షో.
సంజీవకరణి దొ జాడ జెప్పిన యెడల
పర్వతము గొనివచ్చు పవనాత్మజులు గలరు. క్షో.
స్వర్గమ్ము నమృతమ్ము సత్యమైన నైన
ఎగిరి చని కొనివచ్చు ఖగరాజులుం గలరు. క్షో.





# ఎట్లున్నది ?

బాపూజి కెటులున్న దనుచు, ప్రజ విరుగ
బడి యడుగు నెపు డార్తిగొనుచు. బా.
దేవుడే లేనట్టి దేవాలయం బేల
అగ్నిహోత్రము లేని యజ్ఞవాటిక యేల. బా.
తీసికొని చని యేమి జేసినా రని జనము
ఆసు బోయగ సాగె నా "బిర్లభవన్" దరి. బా.
వచ్చిపడు ప్రజనెట్లు వారించుటను దళము
ఆకట్టదెగు నదము నాప నెవ్వరి తరము. బా.
తెలివి గనెనా యేమి పలుకు చున్నా డంచు
అరనిముసమైన ప్రజ యాగనీయక నడుగు. బా.
బ్రదికెనని యొక్కండు గతియించె నని యొకడు
ఏదినిజ మని జనము లేడ్చి యడుగుదు రురక. బా.
చనిపోయె గాంధీజి యని యే మొగమ్ముతో
తెలుపుదును ప్రజల కో దేవుడా యను నెహ్రూ. బా.
ముదిమి పైబడినట్లు ముఖ మొక్కపరి మార
ఎదొ గొంతు నొక్కనటు లేడ్చు చాగుచు నురక బా.
కాళ్ళాడకున్న నెటొ కదలి వెలి కరుదెంచి
ఆరె మన జ్యోతి యను టదొక గండ మ్మాయె. బా.



# దుః ఖ మ య ము

అరిగె బాపూజి యన్నంత దుఃఖమయ
మై కానబడె లోకమంత
మన్ను మి న్నేకమై కన్నీరు గార్చినది
అన్నమ్ము నీళ్లనక యట్టుడికిన ట్లుడికి. అ.
మరల జీవిం చెచటి మరణ మనియెడివారు
నె_త్తి గొట్టుక న్నట్టె నేల గూలెడువారు. అ.
చచ్చె నెట్లని రేగి పిచ్చె_త్తి చనువారు
తెలియగనె పడిపోయి తెలివి దప్పినవారు. అ.
కన్నీరు గార్చుచును మిన్నురక గనువారు
మన్ను బొమ్మలు నిల్చి మాట లుడిగినవారు. అ.
హాయంచు గుండెచెడి యడలి చచ్చినవారు
ఛీయంచు బావియో చెరువొ వెదకెడివారు. అ.
ఎచట జూచినగాని యేడ్పులే అర్పులే
ఎచట జూచినగాని యేమో విచారములె. అ.
ఎచట గన నయ్యయో యెంతపని యనువారు
ఎట ముక్కుపైన వ్రేలిడికొనెడివారలే. అ.
హాహారవంబులే అడరు దుఃఖాబ్ధులే
ఊహయాడని యెదలు నూర్పుగాడ్పులు రొదలు. అ.



# తీసికొని పోవుచున్నారు

తీసికొని పోవుచున్నారు, బాపూజి
దివ్య దేహము యమునదరికి. తీ.
పాసిపోయె ఋణానుబంధమ్ము మీకు నా
కని బాపు మనమీద అలిగి చనుచున్నాడు. తీ.
బావురుమనగ భిర్లభవన మంతయుగూడ
ఆ వరచినట్లు ప్రజలరచి తల జరచికొన. తీ.
గుండె బగులగ పండితుండు జవహర్‌లాలు
చిన్నపిల్లనియట్లు జేరి యేడ్చుచు నుండ. తీ.
ఢిల్లి పట్టణమంత గొల్లుమని యొకసారె
యిల్లు కిల్లూ గదలి యేడ్పు లార్పులు సేయ. తీ.
ఇసుక వేసినగాని త్రసరాల కుండునటు
ఆబాలగోపాల మట వారిధింగట్ట. తీ.
దుఃఖంపు మేఘాల దొంతరలు ప్రజకండ్ల
బాష్పవర్షము గురియ బ్రహ్మాండ ఘోషతో. తీ.
ఆశలు నిరాశలై యడుగారి చన మనదు
దేశనాయకులంత దిక్కులం గనుచుండ. తీ.
భువి చిన్నవోవగా దివి కళల నీనగా
ఆగనీయక గడియమైన నిష్కరుణతో. తీ.





# అగ్నిసాహసము

అగ్నికెటు చేతులవివచ్చు బాపూజి
యవతారమును గాల్చి పుచ్చు.
భగ్నాశులనుగాగ భారతీయుల జేసి
కనుచుండ బాపూను కదలించుకొనిపోయె. అ.
బాపూ తనువు గాంచు పావకార్చుల గాంచి
కళవచ్చె నాకలోకమున నల్దిసలందు. అ.
అపరాబ్ధిలో భాను డస్తమించె నటంచు
చిమ్మచీకటి పడెను శ్రీ దొరగి భూతలము. అ.
జ్వాలనుండు కాల్చి నిను సౌరభమ్ముల జిమ్మ
చందనేంధన సమితి గాంధి హృదయము దెలుపు. అ.
బాపు మే న్గాదదియె భారతీయుల యెదయె
చీమపుట్టల కిట్లు చిచ్చిడెను ఖలుడెవడొ. అ.
బాపూజి యెదపైన బడి ముద్దుగొను పూలు
ఏ దేశ భక్తగణ హృదయ కమలమ్ములో
తాముసయిత మ్మతని దహనంపు మంటలన్
భాగమ్మ బంచుకొన బలిపీఠ మెక్కినవి. అ.





# భస్మరాశి

భస్మంపు రాశియై కూలె, మా గాంధి
భాస్కరుం డస్తగిరి వ్రాలె. భ.
సస్మిత ముఖుండగుచు చావు నాహ్వానించి
విస్మయము గలిగించె విశ్వమున కంతకును. భ.
అతని బూడిద బుక్కయై మాత యెద గూలె
అతని యెముకలు పూవులై మాతృభువి రాలె. త.
వివిధ దేశము లతని వీరమరణమ్ముపై
పుష్పవర్షము గుప్పి పూజ లొనరించినవి. భ.
చందన చితాపీఠి సింహాసనము గాగ
ఆజ్యఖాండములన్ని యభిషేక మొనరింప. భ.
అగ్నిహోత్రుడు స్వీయ హస్తాగ్రముల
స్వర్గాధిపత్యమ్ము సమకూర్ప నిచ్చోట. భ.
ఆత్మీయ భూతియే యఖిల తీర్థమ్ములకు
అవ్యయవిభూతియై యలరార యమున దరి. భ.
చితయొద్ద జతగూడి మతగ్రంథతతు లతని
ఆత్మశాంతికి దేవు నభ్యర్థన మొనర్చు. భ.





# అమరుడవు

అమరుడవు నీవోయి గాంధీ, బాపూజి
హంతకుం డెవ్వాడు నీకు. అమ.

పండుబారిన మేను భరతదేశమ్మోయి
ఖాదిదుప్పటి దాన గంగానదమ్మోయి. అ.

తెల్లనై లోకాలనెల్ల నున్నతిగనిన
చల్లనగు నీదు తలపెల్ల హిమనగమోయి. అ.

బోసి నగుమొగము మా కాశివిశ్వేశ్వరుడు
విమలోపదేశాలె వేదమంత్రములోయి. అ.

వరశాంతగుణము నీ వజ్రాయుధంబోయి
మతసమైక్యతయె నీ మహనీయ మతమోయి. అ.

కన నహింసయె నీదు కరుణాంతరంగమ్మొ
అనఘ ! సత్యమ్మె నీ యాత్మస్వరూపమ్మొ. అ,

నిరుపేదప్రజ సేవ నిత్యకృత్యము నీకు
పరదుఃఖమే నీకు పడరాని బాధయట. అ.





# మందారకుసుమములు

అదిగో బాపూజి యస్థికలు, యమునదరి
నలరు మందార కుసుమములు.
నెహ్రూపండితుడు కన్నీట దడుపుచు నెంతో
పూజ్యభావముతోడ ప్రోదిసేసిన పూలు. అ.
భరతదేశపు నదుల పావనముగావింప
మహిమాన్వితములైన మంత్రపూతాక్షతలు. అ.
యమునమ్మ కుంతల భ్రమరమ్ము లాపూల
మకరందమునకునై మారాము నొనరించు. అ.
కృష్ణ తన నల్లనగు కీల్జెడన దురుముకొని
ఉదధిరాజుకు జూప నొయ్యారముగ నురుకు అ.
రామేశ్వరముపొంత రత్నాకరుడు పూల
వెలగట్టలేననుచు వెనుకముందాడు నెద. అ.
కావేరి యీ పూలతావుల స్వేదజల్ల
కస్తూరిరంగయ్య కనుల మైకము హెచ్చె. అ.
విమలగంగానతి త్రివేణి నీ పూలిడగ
కాశివిశ్వేశ్వరుని కనులు మిరుమిట్లుగొనె అ.
అపురూపమైన యీ అమరలోకపు పూల
నదులెల్ల యొడిబట్టి నాకునా కని వేడు. అ.





# ఆదిమనువు

ఆదిమను వీవోయి గాంధి, ప్రేమంపు
టవ్వ కస్తూరి శ్రీగాంధి.
ధర నన్నిజాతులును తనయులే నాకంటి
వవని యంతయు నాకు నాత్మగేహం బంటి. ఆ.
చిన్నపెద్దనక ధరనున్న సుతులందరికి
సమముగా పంచియిడు జనకుం డవని తెలిసె ఆ.
ఆసియావాసులం దా భారతీయులకు
భాగ మీకుండుటలు పాడియే మీ కనుచు. ఆ.
క్రీస్తు భారతిజాతికిం గన్నతండ్రియై
స్వమతావలంబకుల శాసించి యిప్పించు. ఆ.
సిలువముండ్లో నీదు విలువ దెలిపిన వచట
భళి తుపాకీగుండ్ల తులదూగినా విచట. ఆ.
నిను గాంచుట న్మాదు కనతల్లి యగు భరత
ధరియిత్రి గర్భమ్ము ధన్యమ్ము ధన్యమ్ము. ఆ.
మతములందాటి నీ మతిపైకి జని సకల
మానవైక్యతలోనె మగ్నమై చనెనోయి. ఆ.





# ప్రాణములతో చెరలాట

ప్రాణములతోనె చెరలాట. ధర్మదే,
వత మెప్పుగొన చనెడి బాట. ప్రా.
తనపరీక్షల కాగు ధన్యమానవు నామె
తలనిడుకొనును శాశ్వతము దేవసముడంచు. ప్రా.
విసముమంటల మ్రింగు అసమానయోధుడగు
సోక్రటీసుకు నాకె జోడంచు వచియించు. ప్రా.
సిలువ సింహాసనాసీనుండయిన క్రీస్తు
ముండ్లకవచముతోనె ముద్దునా కిడెనను. ప్రా.
ముదకడైనను గాంధి యెద తుపాకీగుండ్ల
హారమున నా మనసు హరియించె నేడనును. ప్రా.
మాహృదయ మేడ్చునను మాటయొక్కటి దక్క
మా బాపు తా వీరమరణకీర్తిని గాంచె. ప్రా.
ఏరోగమునబడక నెవరి చాకిరిగొనక
రామ యన కఫ మడ్డురాకముందే యేగె. ప్రా.
ఏమి తక్కువజేసె యిల మాకు మాగాంధి
ఎన్నాళ్లు మాకొరకు ఇచట కూర్చుండు నిక. ప్రా.



# మానవుడుగా వచ్చిన మాధవుడే

మాబాపు తాను మానవుడే, దీనజన
క్షోభ వినవచ్చె మాధవుడే.
నగుమోము పైన నో నారాయణత్వమ్ము
విమలకాంతులతోడ వికసించు నిత్యమ్ము. మా.
నిడుదమైగూటిలో వెడదవక్షము ప్రమిద
వెన్నపూసగ గుండె వెలిగించు విశ్వమును. మా.
మేకపాల్గొన నతడు లోకమ్మె చల్లబడు
ఉపవాసముల నుండ నుడికి చను జగమెల్ల. మా.
పట్టినంతనె మట్టి బంగారమై క్రాలు
ముట్టుచోటను రాళ్లు ముత్యమ్ములై రాలు. మా.
సత్యాగ్రహ మ్మడర సమర మొనరించెనా
భృత్యుడౌ ప్రతికక్షి గత్యంతరమె లేదు. మా.
సకల కల్యాణగుణ సంపూర్ణచరితుండు
కన నవాప్తసమస్తకామ సముదాయుండు. మా.



# చంపినచచ్చువాడా

గాంధి జంపిన చచ్చువాడా, అంతకున్
ఘనుడగుచు బుట్టు మరునాడే.
బిర్లాభవనమందు బిలువ నోహోయంచు
పలుకుచున్నవి యతని భవ్యోపదేశాలు. గాం.
వంచి విడిచినకొమ్మ వడి మీది కెగురునటు
కొట్టివేసిన తరువు కొమ్మల చివుర్చునటు. గాం.
నేలగొట్టిన బంతి నింగి కెగయువిధాన
అణచినకొలది గాంధి యాశయము లెదుగునవి. గాం.
ఫలబీజ మవనిపై బడి మన్నయిననేమి
పదిబీజముల గొంచు బయలుదేరదొ తిరిగి. గాం.
బుద్ధుండు తా జచ్చిపోయి యిచ్చట మరల
గాంధియై పుట్టునని కలగనిన దెవ్వాడు. గాం.
ఆగాంధియే మరల నధికశక్తులతోడ
అవతరింపడటంచు అనుమాన మదియేల. గాం.
భౌలికంబగు మేను బాసిపోయిన నేమి
ఆత్మశక్తి కెవండు హంతకుం డున్నాడు. గాం.



# అలసినావా

అలసినావయ్య బాపూజీ, సమరమ్ము
సలిపి సత్యాగ్రహపుటాజి
వీరతల్పమ్మున మేన్విడిచి నీవీవేళ
శాశ్వతము స్వర్గవిశ్రాంతి గొనుచున్నావు. అల.
నవఖాలిభూముల న్నడచి బడలవు కాళ్ళు
ప్రాయోపవేశాల పండి యలవదు మేను. అల.
యమునయొడ్డున నీ గృహము గట్టుకొన్నావు
మమువీడి యుండ నిటు మనసెట్టు లొప్పినది. అల.
అలిగితివె మాపైన పిలిచినం బలుక విటు
కన్నెత్తి మావైపు గాంచ వొకమారైన. అల.
స్వాతంత్ర్యవిజయమ్ము సాధించి యమునదరి
నొరిగి మూసినకన్ను తెరవకుంటివి తిరిగి. అల.
అభిషేకమొనరింతు మశ్రువర్షాల నిను
శ్రమదీర విసరెదము తమి నూర్పువీవనల. అల.
శాంత్యహింసల నెవరు సాకువా రున్నారు
అవిలేక సుఖమేడ కువలయమునం దింక. అల.



# వార్తాపత్రికలశోకము

శోకించుచుండె పత్రికలు, బాపూజీ
నేకగతి వర్ణించుకొనుచు. శో.
అక్షరాక్షర మొక్క యశ్రుబిందువుగాగ
కన్నీటికాల్వలై కాలముల్ ప్రవహింప. శో.
అఖిలవాఙ్మయము శోకాబ్ధియై యుప్పొంగి
ప్రళయమున ముంచినది బ్రహ్మాండభాండమున శో.



పైగుడ్డలేనట్టి బడుగుకై విలపించు
బోసినగవుల జ్ఞప్తిజేసికొని వలపోయు    శో.

చరఖావినోదమ్మె సలుపుచుండెడి రూపు
ప్రార్థనకు జనుదెంచు బడుగుతాపసిరూపు
గోలిదెబ్బలు దాకి నేలకొరిగిన రూపు
గాయములపై పూలు గప్పుచుండిన రూపు
అతని రక్తాబ్ధి నీరాడు మృత్తిక రూపు
హా రామ యని నగుచు నాత్మవీడిన రూపు
బిర్లాభవనమందు స్వర్లోక సౌధాల
నిశ్చింతగా దీర్ఘనిద్ర నుండిన రూపు
పెండ్లివలె చితిపైకి పిల్చుకొని చనురూపు
అగ్నిహోత్రునిమధ్య నాహుతిం గనురూపు
అస్తికల గొనిపోయి అఖిలతీర్థములందు
కలిపి యేడ్చుచు ప్రజలు యిలుజేరు రూపమ్మె
చిత్రపటముల నెన్నొ చిత్రించి చింతించి
ధర్మగుణముల నెన్నొ తలపోసి వలపోసె.    శో.

# సత్యవంతుడు

సత్యవంతుండు మా గాంధి భువి దిగిన
శాంతిమూతయె మహాత్మాజీ.
ఆత డబద్ధము స్వప్నమందైన తెలియ డెద
గోసి చూచిన లేదు కోపమ్ము పేరునకు. సత్య.
సత్యరూపమ్మె యా సర్వేశ్వరుం డనుచు
బోసినోట న్నూరిపోసె నజ్ఞానులకు. సత్య.
సత్యమున కెయ్యెడల జయము దప్పదటంచు
బాసజేసెను గీత బట్టుకొని తనచేత. సత్య.
ఆడితప్పె నొకప్పు డా ధర్మరాజైన
మాగాంధి కా చిన్నమచ్చయైనను లేదు. సత్య.
జ్ఞానరంగపు మొక్కవోని చక్కనియోధ
అతనిగాంచిన పులియు నట మేకయైపోవు. సత్య.
అల రాజకీయాల నధ్యాత్మ విజ్ఞాన
మును జూపి లోకాల కనులుదెరపించి చనె. సత్య
వరభారతావనికి అరిభయము లేకుండ
సిరిగల్గు తన మేను శ్రీరామరక్ష యనె. సత్య.



# దేశభక్తుడు

దేశభక్తుండు గాంధీజీ, ప్రేమసం
దేశధారుడండి బాపూజీ. దే.
తీసిచదవండి యేదేశచరితమ్మైని
ఆసాటి సేవకుం డన్యుం డొకడు లేడు. దే.
దేశంపుటిల్లిల్లు దేవాలయ మ్మగుచు
ఆశోధకుని కనుల కగుపించెను గదోయి. దే.
దేశంపు ప్రతివ్యక్తి దేవస్వరూపు డని
తీసి యర్పించె కడుతీపియగు ప్రాణాల దే.
దేశసోదరులలో తిండిలే కొక్క డుప
వాసముండిన వానికోసమ్మె గోసరిలు. దే.
తెల్లవారలనుండి దేశమును గొనుదాక
నిశ్చయముగా నతడు నిద్దురేపోలేదు. దే.
భారతప్రజలదౌ బాగుకొరకై కడకు
తన మేని రక్తమ్ము ధారవోసిన త్యాగి. దే.





# కర్మ వీరుడు

కర్మవీరుండు గాంధీజి, నిశ్చలమైన
ధర్మవర్తనుడు బాపూజీ. కర్మ.
బడలికెరుగని బంటు మడమద్రిప్పని యోధ
అపజయము పేరెరుగనట్టి దొడ్డసిపాయి కర్మ.
కాంక్షించుపని పూర్తికానంతవరకు తన
శస్త్ర మొరలోనిడని సర్దారు బిడ్డండు. కర్మ.
వ్రాసిరెందరొ గీతవ్యాఖ్యానములు గాని
చేసిచూపెను దాని జీవితగతుల నితడు కర్మ.
ఉప్పుసత్యాగ్రహ మ్మూపివైచెను దొరల
క్విట్టిండియా మ్రోత క్రిందుమీ దొనరించె కర్మ.
కాంచుచో నది యొక్క కదురుపుల్లయె కాని
ప్రక్కబల్లెమ్మగుచు వరలె మాంచెస్టర్‌కు. కర్మ.





# లోకబాంధవుడు

లోకబాంధవుడు బాపూజీ, అతిదయా
శుస్వరూపుడు మహాత్మాజీ లో.

ఏకులమువారనక యేకమానవులమని
ఏకులను కదురుపై నేకమొనరిచి చూపె లో.

తాకరానితనమ్ము దగ్ధమ్ము నొనరింప
హరిజనులకొఱ కొక్క అవతారమును దాల్చె లో.

మాలబ్రదుకుల పూలమాలలుగ జతగూర్చి
కస్తూరిరంగనికి కానుకలు పంపించె లో.

ఏకకాలమున నిను డిల నంతవెలుగతే
డేకరణి బాపూజి లోకమంతట వెల్గె లో.

ఒప్పరెల్లరు గీత, హోలి బైబిల్, ఖురాన్
మా మహాత్ముని సూక్తి మహికంత వేదమ్మె లో.

మహామదీయులకెంతో మహనీయు డనిపించె
తెల్లజాతులు క్రీస్తుదేశికుం డనియెంచె లో.

లావణ్యసీమయగు లండను నగరమంత
ఖండించు జర్మనని కన్నీరు గార్చెనట. లో.





# భజనపరుడు

భజనపరుడోయి మాగాంధి, శ్రీరామ
భక్తవరుడోయి బాపూజీ భ.
ఎడమకుడిచేతులను ఏకముగ జతపరచె
నట హిందుముస్లింల ఐక్యతకు లయవేయ భ.
రామ యని పల్కిన రహీమనుచు బల్కినను
ఈమహానదు లరుగు నేకవారిధికె యను భ.
గీతగాని ఖురాను సేతగాని యివన్ని
ఆభరణభేదములె అంతయు సువర్ణమను భ.
హరిజనుడుగాని భూసురవరుడుగాని ఈ
శ్వరుని గడియారమున వరలు చక్రములె యను భ.
నానావిధమ్ములగు నామరూపమ్ములను
వేషభాషల దాటి వెలయు నాత్మారామ భ.
శ్రీరామ బాణమును శ్రీకృష్ణ చక్రమును
గూర్చి చరఖాజేసి కూర్చొనియె రిపుగెల్చు భ.
కంచుతాళములనుచు కాళ్ళ శృంఖలల గొని
జాతీయగీతాల రీతులకు ప్రయోగించు. భ.





# సర్వసముడు

సర్వసముడోయి బాపూజీ, అత్యంత
నిర్వికారుండు గాంధీజీ సర్వ.
పాకిపని మొదలుకొని లోకపాలనవరకు
నాకార్యమే యనుచు నడుముగట్టిన మేటి సర్వ.
ఉమిసిన నదనను గని భ్రమిసినను రవ్వంత
మార్పేమిలేని బ్రహ్మణ్యుండు బాపూజి సర్వ.
పంచమత్వము జార్జి పంచమత్వముగూడ
ఆకోమటికర మ్మొకింతె విలువకు తూచె సర్వ.
రాటంపుచక్రమున్ రాజ్యంపు చక్రమును
ఏకరీతిగ ద్రిప్ప నెంతేని మొనగాడు సర్వ.
పండ్లుగాని తుపాకిగుండ్లురానీ ప్రీతి
స్మేరాననమ్ముతో నారగించెడి భోక్త సర్వ.
కుడిచినను పస్తులను గడపినను మొగమంచు
చిరునవ్వు వెన్నెలల కరువులే దేవేళ. సర్వ.





# శత్రువునకును మిత్రుడు

శత్రువుకు మిత్రుండు గాంధి, విశ్వాస
పాత్రుండు భువికి బాపూజీ శ.

మిత్రస్వరూపుడు జగత్త్రయ ముఖాబ్జముల
శత్రుదౌష్ట్య లతాలవిత్రం బతని నాల్క శ.

రాళ్ళగొట్ట ఫలాల రాల్చే రసాలంబు
పరశుముఖమున తావి నెరపు చందనతరువు శ.

పొదుగుగ్రుమ్మిన పాలు పిదుకు వేలుపుగిడ్డి
కష్టమిడువారిని గ్గరుణాపరత గాంచు శ.

బోసినగు వెన్నెలలు గాసెనా ప్రతికక్షి
ఆత్మలోగల తమ స్పడుగారి చను నపుడె శ.

ఆయమాయకదృష్టు లైంద్ర జాలము సేయు
ఖదరుదారాల లోకాలకే వలవేయు శ.

అతని వాక్సుధలు ద్వేషానలమునకు వృష్టి
ఘనకరస్పర్శ తిరుగని మరుగుమందోయి శ.

మంత్రముగ్ధుల సేయు మాటలకు ప్రేమించి
కాలసర్పముగూడ కంఠహారంబౌను శ.



# అతి నిరాడంబరుడు

అతినిరాడంబరుడు బాపు, లోకమున
కాదర్శమానవుడు గాంధీ  అ.

పదవులను భాగ్యసంపద జూపి యూరించు
ఆశాపిశాచమ్ము నరకాల ద్రొక్కెనట  అ.

మా భరతభువికి నిర్మకుట సామ్రాట్టయ్యు
కొల్లాయికట్నముం గోరుకొనె యవధూత  అ.

సార్వభౌములను మునిచక్రవర్తులు మ్రొక్క
కొల్లాయి కట్నమును కోరుకొనె యవధూత  అ.

అన్నపూర్ణమ భారతాంబ మృష్టాన్న మిడ
కాయగడ్డల దినుచు కడుపునింపిన జోగి  అ.

నిరుపేదయైయుండి నరపతుల తనదరికి
రప్పించుకొనిన గుజరాతి కోమటిబిడ్డ  అ.

కుడువతోపయులేని కడు దీనమానవులు
కష్టాల బోదోలు కంకణవ్రతధారి  అ.

ముక్కుపై వ్రేల్ మౌనముద్రావిచారాలు
మరగాలు పీఠమ్ము అరదిగంబర వేష.  మతి.



# చంటిబిడ్డడు

చంటిబిడ్డండు మా గాంధి, అత్యంత
సరళ హృదయుండు గాంధీజీ చం.
ఎనుబదేడుల వృద్ధు డెలమి భారతమాత
కనుల కెనిమిది నెలల కసుగందువలె తోచె చం.
ఏండ్లు పైబడె వృద్ధు డీత డెపుడనుకొనదు
పండ్లెమొలవని ముద్దు పసిబిడ్డడని సాదు చం.
ఎన్నియేండ్లే నామె కన్నులకు పసికూన
అడుగు లిడనేర్చె కర్రానుకొని యిపుడిపుడె చం.
జనములను ముగ్ధులనుజేయు బోధల గాంచి
వచ్చిరానివి ముద్దువాక్కులనుకొని మురిసె చం.
చరఖావినోదమ్ము సలుపుచుండుట గాంచి
బొంగరాలాడుకొను బొట్టెకాయని యెంచె చం.
పరవారి కనులలో బడి యేమగునొ యంచు
వెట్టిగా సాదె నొక విలువగుడ్డయు నిడక. చం.





# రైతు రాజు

(గేయ నాటిక)

(రైతురాజును రమ్మని యాహ్వానించుట)

రావోయి ఓ రైతు
రాజా! ... మాకు
పాడి పంట లొసంగి
భారతావని నేల రా.

రవి శశియు నిత్యనీ
రాజనము లీయగా
పవనుండు కేల విం
జామరము వేయగా
నవ మోహనమ్ము లౌ
నాగేటి వృషభముల్
నందీశ్వరులు గాగ
నటరాజమూర్తివై రా.





భూదేవి నిను దాక
మై పులక లేపారె
గోమాత నీ వంట
పాల చేపులు మీటె
ఆకాశగంగ ని
న్నభిషేక మొనరింప
శ్రీకాంత పాణి సర
సీజమ్ముల జనింప రా.

(కాపురాజు తన సహచరులతో ప్రవేశించి సంతోషంగా గిత్తల
దీసికొని మడి దున్నుతాడు)

దున్నవోయి దున్నూ మడి
దున్నవోయి దున్నూ
వడిగల గిత్తల గట్టి
హడా, హై, కహ్ కెయ్ మని దు.

చిఱునగవుల కాపుసతులు
సిగపూవులు సొగసు లీన
సోలు నడుము లల్లాడగ
చాలు బట్టి విత్తులేయ దు.





మన్నులోన మన్నై యవి
వెన్నుకు వెయి విత్తులీయ
మన్నె బంగారు చేయు
అన్నపూర్ణ యవతరించ — దు.

వంతలు మిట్టలు బాపి
అంతా సమ మొనరించి
అందఱకును సుఖజీవన
మందుబాటులో నుండగ — దు.

*( కాపు కరవైపోయిన వానల కెదిరి చూస్తాడు )*

రావోయి ఓ వాన
దేవా !.... నీవు
రావోయి ఓ వరుణ
దేవా !....
ఇంటి వఱ కొకసారి
రావా.... మా
పంటచేలను జూచి
పోవా........ — రా.





ఇంటిలో గింజలను
మంటిలో బోసితిమి
మింటికేయీా జూచి
కంట నీ ర్వెట్టుదుము. రా.

రాత్రింబవలు చెమట
రాల్చి కష్టించినా
ఆలుబిడ్డల కింత
అన్నమే కరవాయె రా.
చెరువు లెండుక పోయె

కరువు మండుక పోయె
బరువాయె బ్రదుకులే
కరుణ రాదా నీకు రా.

*(కాపు మొఱవిని వర్షము కురియుటతో కాపు సంతోషము ప్రదర్శించుచుండును)*

వచ్చెను వచ్చెను వర్షాలూ మా
వసుధారాణికి తలబ్రాలూ వచ్చె.





కత్తులు కత్తులు కలిసిన యట్లూ
ఉత్తర దిక్కున ఉరిమింది, కను
పాపల చక్కని మెఱసింది - దివి
గడగడ గడగడ ఉరిమింది - దిశ
చకచక చకచక మెఱసింది వచ్చె.

పాడు కరవులకు బాణాలు - మా
పంటచేల కివి ప్రాణాలూ ....
కాపుకన్నులకు ముత్యాలు - వరి
కట్టలనోళ్ళకు చనుబాలూ వచ్చె.

కోడెనాగులై యుఱికే వాగులు
క్షీరధారలై పారే తోగులు
మరకత మణులై పచ్చిక లేచే
చెట్లు పచ్చబడి శిరముల నూచే వచ్చె.

మదవృషభమ్ములు కొమ్ముల గ్రుమ్మచు
మట్టిని జిమ్ముచు ఱంకె వేయగా
ముదితమయూరము పుచ్చము విచ్చి
ముద్దుగ నాట్యము సలిపిందీ వచ్చె.





ఇంటిలో గింజలను
మంటిలో బోసితిమి
మింటికేయీా జూచి
కంట నీ ర్వెట్టుదుము. రా.

రాత్రింబవలు చెమట
రాల్చి కష్టించినా
ఆలుబిడ్డల కింత
అన్నమే కరవాయె రా.
చెరువు లెండుక పోయె

కరువు మండుక పోయె
బరువాయె బ్రదుకులే
కరుణ రాదా నీకు రా.

*( కాపు మొఱవిని వర్షము కురియుటతో కాపు సంతోషము ప్రదర్శించుచుండును )*

వచ్చెను వచ్చెను వర్షాలూ మా
వసుధారాణికి తలబ్రాలూ వచ్చె.





కత్తులు కత్తులు కలిసిన యట్లూ
ఉత్తర దిక్కున ఉరిమింది, కను
పాపల చక్కని మెఱసింది - దివి
గడగడ గడగడ ఉరిమింది - దిశ
చకచక చకచక మెఱసింది వచ్చె.

పాడు కరవులకు బాణాలు - మా
పంటచేల కివి ప్రాణాలూ ....
కాపుకన్నులకు ముత్యాలు - వరి
కఱ్ఱలనోళ్ళకు చనుబాలూ వచ్చె.

కోడెనాగులై యుఱికే వాగులు
క్షీరధారలై పారే తోగులు
మరకత మణులై పచ్చిక లేచే
చెట్లు పచ్చబడి శిరముల నూచే వచ్చె.

మదవృషభమ్ములు కొమ్ముల గ్రుమ్ముచు
మట్టిని జిమ్ముచు అంకె వేయగా
ముదితమయూరము పుచ్ఛము విచ్చి
ముద్దుగ నాట్యము సలిపిందీ వచ్చె.





ఆఱవేసిన చీరల వోలె
తూరుపుగట్టున ఆవులు తోచె
నడిచే నల్లని గండశిలలవలె
పడమటి గట్టున గేదెలు మేసే                    వచ్చె.

( కాపు వరికళ్లల గొని నాటువేస్తాడు )

నాటు వేయవోయ్ పొలము
పాటు జేయవోయ్
ధరణిదేవి పచ్చపచ్చ
వరిపైరుల కోక గట్టి
మలయమారుతపు డోలల
మది పొంగుచు నూగియాడ                    నాటు.

నడుము వంచి యడుసు లోన
నవనవలాడే పైరుల
నాటవోయి వరుసగ నే
పూట లక్ష్మి తాండవింప                    నాటు.

కూటి కరువు దీఱె ననుచు
కూలి పడుచు చిఱుచెమ్మట





గోటమీటి కోకిలపై
పోటి పాట బాడుచుండ నాట.

*( కాపు పొలము కావలియుండి తన భార్య చద్దిగొనితేక పోయెనని ఆకలితో ఎదిరిచూస్తాడు )*

వచ్చేది మా లచ్చిమేనా... ఆ
ఒయ్యారి నడకలతో
వియ్య మందును హంస వచ్చే.

నగుమోము వగచూచి
పగబట్టి చందప్ప
కొంటెగా నడి దారి
కొంగుగాని ఆపిండా వచ్చే.

పిలిచి నచ్చైతే జా
మలతోట కెళ్ళితిని
చిలుక పలుకని తెలిసి
సిగ్గొచ్చి మరలితిని. వచ్చే.

కనుచుండె పొదచాటు
కన్నె లేడియొ లేక





నను గేలి సేయంగా
నక్కి యుండెనో తానే　　　　　　　　　　వచ్చే.

కొమ్మెక్కి చూసితిని
కొండెక్కి పిలిసితిని
కడుపు మంటల లోన
కాలుచున్నది లంక　　　　　　　　　　వచ్చే.

( లచ్చి వచ్చి చద్ది యిస్తుంది )
లచ్చి వచ్చినాదోయ్ మామ !
చద్ది తెచ్చినాదోయ్ మామ !
ఎదిరి చూచు నీ కన్నులకు ఇం
కేమొ తెచ్చినాదోయ్ మామ !
ఏమొ తెచ్చినాదోయ్　　　　　　　　　　లచ్చే.

కిలకిల నవ్వుల్లో మామా !
కలువలు బూసిన వోయ్ మామా !
కలికి చూపుల వలపు తేనియల
కావడి తెచ్చినదోయ్ మామా !
త్రావగ రావేమోయ్ మామా !　　　　　　　　లచ్చి.





(కలుపు తీయుటకు భార్యను పిలుస్తాడు)

కలుపు తీయ రావేమే
కాపోరి పడుచా !....నీ
కంకణాలు గాజుల్లూ
గల్లు గల్లూ మనగా కలు.

పైట నడుముకు జుట్టి
చేత కొడవలి బట్టి
దుష్టశిక్షణ చేసే
అష్టభుజ కాళికపై కలు.

మన భూమి యందేమి
పరజాతి యా స్వామి
నటికి వేసెద నన్న
నారి ఝాన్సీ వగుచు కలు.

నరుల కన్నము బెట్టు
వరి కట్టలను జుట్టి
పెరుగనీయని తుంగ
పెటికెయ్య వలె నింక కలు.





( చేనికావలిగాయుచు భార్యావిరహానికి వెతపడుచున్న కాపు : )

ఏ జన్మలో ఎవరి
నెడబాపితిమొ యేమొ
ఈ చేనిలో నేను
ఇంటికాడా తాను
కన్నుల్లా తెలవాఱుతున్నది । మా
కర్మ మింతే నోచుకొన్నదీ ఏ.

చద్దియన్నము దెచ్చి
సరసమాడుచు లచ్చి
పలుకరాని గాథ
పడరాని ఒక బాధ
ఎన్నడగు వరికోత లన్నదీ । కొంగు
కన్నీట తడిసిపోతున్నదీ ఏ.

పవలంత చేనిలో
పనిపాట కనివచ్చి
పసిబిడ్డపై అర్లు
పాల పొంగై రాగ





తడజిమ్మి చనుబాలు లచ్చిమీ। అవిక
తడిసిపోవును వట్టి పిచ్చిదీ ఏ.

అత్తమామల బెదరు
ఆడుబిడ్డల యలుక
వత్తమన రాలేదు
పంజరములో చిలుక
పెత్తనమ్మేది నా రాణికీ। ఎంత
ప్రేముంటె ఏమి దొరసానికీ ఏ.

(చేనికోతకు లచ్చిని పిలుస్తాడు)

కోసికొనుము మెద
వేసికొనుము వరి
మోసికొనుచు జని
రాశిగ బేర్చుము కోసి.

కోసికొనుము నీ
చేసే శ్రమ కిదె
దాచుకొనక వెల
బోసె వసుంధర కో





తుట్టా దాలిచి
దొరయై కురియును
కట్టి కట్టియును
కనక వర్షములు కో.

కుప్పల బంగరు
తెప్పల మేరువు
కొప్పుల భాగ్యము
చిప్పిల గూర్చుము కో.

వసుధా దేవిని
వరించి దేవుడు
పపిడి యక్షతలె
పొఱజల్లెనో కో.

పసుపు తీర్థముల
జలకమ్మాడిన
పసిబిడ్డల బా
లింత పొలమ్మిక కో.





(కోసిన వరికట్టల నూర్పిడి చేసి తూర్పార బట్టటానకు
కాపు తన భార్యను పిలుస్తాడు)

తూరుపాఱ బట్టరావే
నా యింటి దొరసాని !
అందాల రాణీ ! ఓ లచ్చి ! తూ.

తూరుపాఱ బట్టు
దుమ్ములో నిను జూడ
మబ్బుల్లో చందప్ప
మన చేల దిగివచ్చె తూ.

వయసు బరు వోపక
వడకాడు నడుములో
నాగ కోమలి మేను
నాట్యమ్ము లాడేను తూ.

చేత చేటను బట్టి
చెరిగి పోసే మేన
పైర గాలికి సోలు
పైడి తీగెల చాలు తూ.





# మోసము

మోసము ! మోసము !! మోసము !!!
జీవితమంతయు గూడా దాని గూర్చి అభ్యాసము మో.

వద్దు వద్దు నా కనుచునె
పెద్దతికము గోరు జగము
వద్దు వద్దనే మాటలు
నాలుక కొనపైన సగమె మో.

దేశభక్తిలో మోసము
దేవుని గుడిలో మోసము
రామచంద్ర రూపములో
రావణాసుర విలాసము మో.

కులమతములలో మోసము
గొప్ప చిన్నయని మోసము
బలము, పలుకుబడి గలిగిన
బడిత మనిషిదే దేశము మో.





దోషము దాచెడు కోసము
చేయు మోసమను దోషము
స్వాంతములోపల నెపు డా
షాఢభూతిదె నివాసము   మో.

కుడిచే వేళల దున్నె
కోడె గుంపుల ప్రవేశము
దున్నే వేళల ఆవుల
దూడలలోన నివాసము   మో.

కృషి చేసే యెద్దులకో
మూతికట్ల ఉపవాసము
కూర్చుండే గుత్తాలకు
మూతికె దాణాకోశము   మో.

భార్యా బిడ్డల కోసము
బంధుమిత్రతతి కోసము
జగత్తు నంతను గూడా
చేతుము సర్వము నాశము   మో.





# ధ న ము

ధనం ! ధనం ! వందనం ధనం !
సకల కార్యసాధనం ధనం
లోకప్రీతి వర్ధనం ధనం ధనం

ఎదిచూపించిన పసిబిడ్డైనను
ఏడ్పుమాని దగ్గఱ కరుదెంచు
ఎది కనిపించిన రంభయైన వల
పెగయ నవ్వి మనల పల్కరించు ధనం.

ఏదిగాంచి లోకమాదరించు
ఏది మనకు చుట్టఱికము బెంచు
ఏది లేక బ్రతుకు చావనిపించు
ఏది కనుల తలపై కెక్కించు ధనం.

ఏ బలమున మీసము నెక్కించు
ఎదిలేదని పరులకు తలవంచు
దేనిని హరియైన నాశ్రయించు
సముద్రమును సొంతము గాలించు ధనం.

ఏ కాసుల సంచిని పోషింప
వడ్డీలకు వడ్డీలను బెంచు
మా కాయుష్యం మా కారోగ్యం
మాకు ధనం మరి మీకు ఋణం ధనం.





# కోకిలా!

రావె కోకిలా!.... నీ
రాజన మిడు మా కన్నులు　　　　　రా.

కుహూ కుహూ స్వనమ్ములనే
కొమ్మ మాటు కూసెదవో
మాధవ మురళీ నాదమొ!
మాకందవనీ మోదమొ!　　　　　రా.





మాకందమ్ముల నుందువు
మా కందమ్ముల కగపడ
వాలకింతు మొక గానము
నాలపించు నిను గానము రా.

ఎవరికోస మీ పాట?
ఎవరి గుండె నీ వేట?
ఎపుడు వసంతుడు వచ్చె?
ఎపుడు వసంతము జిల్కె? రా.

ఇగురించెనొ నీ వలపులె
కుసుమించెనొ నీ తలపులె
ఎవ్వరినే ఆ పిలుపు?
ఎవరికె ఆ మేల్కొలుపు? రా.

చెమ్మరించు దేహమునకు
తెమ్మెర అల వీచెదవే
ఝుమ్మనియెడు తుమ్మెదలకు
కమ్మతేనె పోసెదవే రా.





కమ్మనైన నీ పాట
తుమ్మెద తంబుఱ మీట
కిసలయరాగము చిగిర్చె
ప్రసూన హృదయము ద్రవించె  రా.

చక్కని దానను గానని
చాటు చాటు కేగెదవా ?
ముక్కున బొడుచును కాకుల
మూక లనుచు దాగెదవా ?  రా.

గానమునకు తగు రూపము
గాంచ నైతి నను చింతే
గానము రూపమును లేని
కాకము గతిని దలంతే  రా.

అన్నినాకె యుండవలయు
ననుకొనుటే పెనుదోషము
ఉన్నదానితో తృప్తిని
నొందుటయే సంతోషము  రా.





# ఎవరో!

ఎవరో! ఎవరో!
నను పెదవి గదల్పక పిలిచెదరు
మురళిని గొని ముంగల నిలిచెదరు ఎవ.

ఆ చూపులలోపలి తలపులలో
ఆ పలుకులు నేరని వలపులతో ఎవ.

అరుణాధర రాగపు వెల్లువలో
చిఱునవ్వుల పువ్వుల జల్లులతో ఎవ.

నిటలేందు మనోహర సీమలలో
కుటిలాలకజాల విఖేలనతో ఎవ.

బొమదీవెల తావుల మాటులలో
కనుచూవుల తూపుల వేటలతో ఎవ.

వదనేందీవర దరహాసములో
వంశీరవ మోహన రాగసుధ ఎవ.





# విరహాబ్ధి

ఎవరి జ్ఞాపక చిహ్నా
మీ విరహ జలధి
బడబాగ్ని హృదయాన
పరితాప పడుచుండె                ఎ.





నిశియుం బవలు కంట
నిదురరాని యెడంద
బింబించు నే చంద్ర
బింబమ్ముగని పొంగు ఎ.

నిట్టూర్పు గాడ్పుతో
నిలువకం జనుదెంచు
కన్నీటి కెరటాల
కదలిమ్ముత్యాల ఎ.

అంబరము చాటుగా
అలరు మో మొరనాడు
చిఱునవ్వు జిలికించి
నెలవంకను లిఖించె ఎ.

మెలమెల్ల సిగ్గు విడ
తల యెత్తి కనె నింతి
నిక్క మీ రే యంత
నిండు పున్నమకాంతి ఎ.





# పంచశీల

విజయీభవ నవభారతయువ సింహకిశోరా!
నిజదేశాభ్యుదయాకృతి నిర్మాణ విచార! విజ.

శ్రమజలకణముక్తామణి సంశోభితఫాలా!
సుమహిత నిజకష్టార్జిత సుధాపాన లోలా! విజ.

సకలదేశ మతమిత్రా! సర్వదాపవిత్రా!
నిఖిల జాతి విద్వేష వనీలతాలవిత్రా! విజ.

సమభావన సహజీవన సహకార విహారా!
క్రమవిరహిత పరదేశాక్రమణ పథనివారా! విజ.

పరదేశాంతరంగిక వ్యవహారసుదూరా!
పరసీమావిస్తీర్ణ ప్రభుతాంగీకారా! విజ.

జనమారణ ఘనకారణ సమరాగ్నివినాశీ!
స్వనిరూపిత పంచశీల శాంతిలోక వాసీ! విజ.





మాకందమ్ముల నుందువు
మా కందమ్ముల కగపడ
వాలకింతు మొక గానము
నాలపించు నిను గానము    రా.

ఎవరికోస మీ పాట ?
ఎవరి గుండె నీ వేట ?
ఎపుడు వసంతుడు వచ్చె ?
ఎపుడు వసంతము జిల్కె ?    రా.

ఇగురించెనొ నీ వలపులె
కుసుమించెనొ నీ తలపులె
ఎవ్వరినే ఆ పిలుపు ?
ఎవరికె ఆ మేల్కొలుపు ?    రా.

చెమ్మరించు దేహమునకు
తెమ్మెర అల వీచెదవే
ఝుమ్మనియెడు తుమ్మెదలకు
కమ్మతేనె పోసెదవే    రా.





కమ్మనైన నీ పాట
తుమ్మెద తంబుఱ మీట
కిసలయరాగము చిగిర్చె
ప్రసూన హృదయము ద్రవించె రా.

చక్కని దానను గానని
చాటు చాటు కేగెదవా ?
ముక్కున బొడుచును కాకుల
మూక లనుచు దాగెదవా ? రా.

గానమునకు తగు రూపము
గాంచ నైతి నను చింతే
గానము రూపమును లేని
కాకము గతిని దలంతే రా.

అన్నినాకె యుండవలయు
ననుకొనుటే పెనుదోషము
ఉన్నదానితో తృప్తిని
నొందుటయే సంతోషము రా.



# ఎవరో!

ఎవరో! ఎవరో!
నను పెదవి గదల్పక పిలిచెదరు
మురళిని గొని ముంగల నిలిచెదరు ఎవ.

ఆ చూపులలోపలి తలపులలో
ఆ పలుకులు నేరని వలపులతో ఎవ.

అరుణాధర రాగపు వెల్లువలో
చిఱునవ్వుల పువ్వుల జల్లులతో ఎవ.

నిటలేందు మనోహర సీమలలో
కుటిలాలకజాల విఖేలనతో ఎవ.

బొమదీవెల తావుల మాటులలో
కనుచూపుల తూపుల వేటలతో ఎవ.

వదనేందీవర దరహాసములో
వంశీరవ మోహన రాగసుధ ఎవ.



## విరహాబ్ధి

ఎవరి జ్ఞాపక చిహ్న
మీ విరహ జలధి
బడబాగ్ని హృదయాన
పరితాప పడుచుండె — ఎ.





నిశియుం బవలు కంట
నిదురరాని యెడంద
బింబించు నే చంద్ర
బింబమ్ము గని పొంగు ఎ.

నిట్టూర్పు గాడ్పుతో
నిలువకం జనుదెంచు
కన్నీటి కెరటాల
కడజిమ్ము ముత్యాల ఎ.

అంబరము చాటుగా
అలరు మో మొకనాడు
చిఱునవ్వు జిలికించి
నెలవంకను లిఖించె ఎ.

మెలమెల్ల సిగ్గు విడ
తల యెత్తి కనె నింతి
నిక్క మీ రే యంత
నిండు పున్నమకాంతి ఎ.





# పంచశీల

విజయీభవ నవభారతయువ సింహకిశోరా !
నిజదేశాభ్యుదయాకృతి నిర్మాణ విచార !   విజ.

శ్రమజలకణముక్తామణి సంశోభితఫాలా !
సుమహిత నిజకష్టార్జిత సుధాపాన లోలా !   విజ.

సకలదేశ మతమిత్రా ! సర్వదాపవిత్రా !
నిఖిల జాతి విద్వేష వనీలతాలవిత్రా !   విజ.

సమభావన సహజీవన సహకార విహారా !
క్రమవిరహిత పరదేశాక్రమణ పథనివారా !   విజ.

పరదేశాంతరంగిక వ్యవహారసుదూరా !
పరసీమావిస్తీర్ణ ప్రభుతాంగీకారా !   విజ.

జనమారణ ఘనకారణ సమరాగ్నివినాశీ !
స్వనిరూపిత పంచశీల శాంతిలోక వాసీ !   విజ.





# బుద్ధగీతి

నమో బుద్ధదేవా! భగవన్
నమో సుప్రభావా!
క్షమాసత్యకరుణామయ భావా! నమో.

ఆకర్ణాంత మనోహరనేత్రా!
మణిమయ కుండలమండితశ్రోత్రా!
ద్వాత్రింశచ్ఛుభ లక్షణగాత్రా!
ధ్యానాసన శోభిత బుధమిత్రా! నమో.

నీ మనస్సు నవనీత సమానము
నీ వచస్సు దివ్యామృతపానము
నీ తపస్సు మా జ్ఞాన నిధానము
నీ యశస్సుశ్రుతికి సామగానము నమో.





మంచుకొండ శిఖరాగ్రమందు వె
ల్గించబడిన యో దివ్యజ్యోతి !
మంచిమార్గముల మానవతను నడి
పించిన భారతదేశఖ్యాతీ ! నమో.

అరవిందమ్ముల హసించు నీపా
దాంకముద్ర నో దయాసముద్రా !
పరితాపమ్ముల బంధనముల విడి
ప్రాణికోటి జెందెను సుఖనిద్రా నమో.

రాత్రిమేలుకొని స్వార్థమ్మును స
ర్వస్వమ్మును విడిచిన ఓ త్యాగీ !
ధాత్రిఁ వ్యాధిజరామృతి భయములు
దప్పిన నిర్వాణామృత భోగీ ! నమో.

ధరణి జీవరాశులు నీ పుత్రులు
దయాధర్మములె నీ సన్మిత్రులు
అరిషడ్వర్గములే నీ శత్రులు
వాని జయించిన మీరె పవిత్రులు నమో.





బోధిమహీరుహ శీతచ్ఛాయల
బుద్ధుడ వగు విజ్ఞాన స్ఫూర్తీ!
సాధకతతి కన్నులు దెఱపించియు
సత్యపథము జూపిన గురుమూర్తీ! నమో.

మనుజుడు తన వగు మంచిచెడుగులఁ
సుఖదుఃఖాకృతి చూచుట సత్యము
మనసు లోపలఁ దయాధర్మముల్
మఱువకు డని బోధించితి నిత్యము నమో.

కరవాలములను హింసాజ్వాలల
కరగి స్రవించిన గుండియ జాలీ!
నరకప్రాయపు నరజీవితముల
నందనవనముల నాటిన మాలీ! నమో.

మలయానిల మను మాఱుపేరుతో
నీప్రాణానిల నివహము చెలగె
చల్లనితెల్లని శశిబింబములో
నీ మనస్సు వెన్నెలయై వెలిగె నమో.





తాపతప్త విశ్వాపద బాపగ
ఘనజీవనమై కరగి చనెదవా ?
కోపతమస్సును సుస్మిత విద్యు
ద్దీపముతో వెల్గించి కనెదవా ! లమో.

చీనా బర్మా ఇండొనేషియా
సింహళాలు వినె నీ సందేశము
ధ్యానమగ్న భగవానుని నిన్గని
ధన్యమయ్యె మా భారతదేశము నమో.

ప్రమాద మెపుడీ యధర్మచింత
సమాన మీ నర సమాజ మంత
సమంతభద్రుడు సంఘసేవయే
స్వర్గప్రదమని చాటు నియంత ! నమో.

సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
బుద్ధం శరణం గచ్ఛామి
నమో బుద్ధదేవా !





# అపూర్వ దీపావళి

వచ్చె వచ్చె దీపావళి
నగు మొగాల రూపావళి

అన్ని పండుగుల వంటిదె
యన వల దీ దీపావళి
ఎన్ని వేదనల మంటో
ఎన్ని తపస్సుల పంటో — వచ్చె.

ఈ దీపావళి కోసము
ఎదిరిచూచె కండ్లెన్నో
ఈ దీపావళి కొఱకై
జపము చేసె నోళ్ళెన్నో — వచ్చె.

ముక్కోటిన్నర తెలుగుల
ముక్కోటిన్నర వెలుగుల
అదిగో! మన ప్రకాశఖని
అదిగో! మన సంజీవిని — వచ్చె.

ఆనా డొక అమర జీవి
ఆఱిపోయి వెలిగించిన





అఖండ మగు దీపావళి
అపూర్వమగు దీపావళి వచ్చె.

ఆఱిపోని దీపావళి
ఆఱ నీని దీపావళి
వచ్చె వచ్చె దీపావళి
ఇచ్చె మనకు రూపావళి వచ్చె.

దీనికై రాములు సెట్టి
జీవితమును ముడిబెట్టి
కడకు విశాలాంధ్ర గలుప
కాస్త అయ్యెను పొట్టి వచ్చె.

కర్పూరపు కళికవోలె
కరగిన ఆ జగజెట్టె
అఱవ చాకిరిని నలిగే
అమ్మ చెఱలు విడగొట్టె వచ్చె.

ఈ దీపావళి వెలుగున
ఇరువురమును సోదరులుగ
తెలిసికొంటి మెడద నెడద
కలిపికొంటి మొక మైతిమి వచ్చె.





# నవంబరు 1 వ తేది

అదిగో ! నవాంబరము
అతిలోక సుందరము

అది సుప్రభాతమ్మ
అరుణ కిరణాపూర
సౌవర్ణ శోభాప్ర
సాదిత నవాంబరము        అది.

అది తాను నాకలో
కాప్సరోభామినీ
మందహాసప్రభా
మయ కళామందిరము        అది.

అది చతుష్కోటి పు
ల్లాంభోజ రమణీయ
కాంతిచ్ఛటా సుధా
కలితకాసారమ్ము        అది.





అది నిత్యమంగళా
స్పద సంతతాభ్యుదయ
మార్గ దర్శక దివ్య
మణిదీప హారమ్మొ — అది.

ఆ నవాంబర మోహ
నారుణోదయములో
తిలకించు ప్రాత రా
దిత్యబింబ మ్మేదొ ! — అది.

ఆ నవాంబర సుంద
రావగుంఠనములో
హాసియించు రాకాశ
శాంక బింబ మ్మేదొ ! — అది.

కాదు కాదామె యొక
కమల కోమల గాత్రి
ఆ నవాంబరముతో
నవతరించిన ధాత్రి — అది.

ఆమెయే కోటి త్ర
యాంధ్రసుత జనయిత్రి





ఆమెయే లోక క
ల్యాణ కృతి కవయిత్రి అది.

అవతరించిన దోయి !
ఆంధ్ర ప్రదేశమ్ము
పావనంబగు నవం
బరు మొదటి దివసమ్ము అది.

ముక్కోటి తంత్రులన్
మ్రోగు వీణా వాణి
మూడు గంగలు గలిసి
మురువు సూపు త్రివేణి అది.

అక్షయ వరమ్ము లిడు
అన్నపూర్ణ మృడాని
ధర్మదోలిక నాడు
భాగ్యనగరపు రాణి అది.

నీరాజనం బెత్త
నిలుచున్న ముక్కోటి
కళ లీను రత్నాల
గన్న కనకపు పేటి అదిగో.





# పతాక వందనం

వందేఽహం వందే
వందే వందే                    వందే.

వందేఽహం జయ భారత
మాన్య త్రివర్ణ పతాకాం
వందే చత్వారింశత్
కోటి ప్రజా సత్తాకాం                    వందే.

ఆసేతు హిమాచల ప
ర్యంత మహీ శోభాకర
దేశ స్వాతంత్ర్య కళా
దీపాయిత రూపాం                    వందే.





హరిత శ్వేతారుణ ప్ర
ఖ్యాత వర్ణ భాసాం
స్ఫుర దశోక చక్రాంకణ
శోభిత సువిలాసాం
నీల నభోహృదయాంబుజ
నిలయాంచిత శ్రీకాంతా
చేలాంచలాపకర్షణ
శీలాయిత లీలాం వందే.

వర సస్యశ్యామల సుం
దర మరకత వర్ణాం
గురు విద్యా విజ్ఞానా
కర ధవళ సుపర్ణాం
భారత జననీ స్వేచ్ఛా
భూరుహ సంవర్ధక బల
సారారుణ రక్తోజ్జ్వల
సంచలిత తరంగాం వందే.





# వైష్ణవ గీతము

వాడే వైష్ణవుడు, దయగల
వాడే వైష్ణవుడు....
పరుల పీడ గుర్తెఱిగిన నర సో
దరుడే వైష్ణవుడు.... వాడే.

పరుల దుఃఖమును పరికించుచు నతి
కరుణతోడ నుపకార మొనర్చి
వరి ముల్లంతేనియు నభిమానము
దరిజేయగ నీయని పుణ్యాత్ముడు వాడే.

నాలుక గోసిన పలుక డసత్యము
వ్రేలనైన ముట్టడు పరధనముల
ఆలోకించును పరసతుల మాత
వోలె, తృణమ్మటు తృష్ణ త్యజించెడి వాడే.



ఒక యింతేనియు మాయామోసము
లకు తావొసగక దృఢ వైరాగ్యము
ప్రకటించెడి రామనామరతునకు
సకల తీర్థములు చరణస్థితములు వాడే.

అన్యుల నింద సలుప డందఱి సమ
మాన్యత జూచును, నిశ్చలగతి ఫల
సన్యాసము గైకొను త్రికణరముల
ధన్య ధన్య వానిని గన్నతల్లి వాడే.

కామక్రోధములను నిర్జించుచు
కపట రహిత విజ్ఞానము గలవా
డే మహాత్ము డతనిని దర్శించిన
ఏకోత్తరముగ కులము తరించును వాడే.

నరసీ మెహతా పాడినగీతము
నరసంతతి కది అమృతోపేతము
వరవైష్ణవ సద్గుణ సంకేతము
నరనుత గాంధీమహాత్మాదీతము వాడే.



# మనవి

వచ్చినట్టులు నేను
వండి వడ్డించితిని
అదియె నే డిని తన్మ
యానంద మొందితిని
ఓపినంతగ రుచిగ
నుంచ కష్టించితిని
కోప మేటికి వంట





కుదుర లే దని యనిన
నా పాకమే మంచి
నలపాక మని యనను
ఎవరెవరి రుచు లిందు
ఎటువంటివో యేమొ
అవని నందఱి దనుప
నజుని తరమే కాదు
మనవి జేతును నేను
మహనీయుడను గాను
తనివి బొందితి మనిన
ధన్యు ననుకొనియెదను
శృంగారరస మొకరు
బంగార మనియెదరు.
వీరరసమే కావ్య
సార మనియెద రొకరు
భక్తికారుణ్యములు
ముక్తిదము లని రొకరు
హాస్యరస మనిన పర
మానంద మని రొకరు.





అన్ని రసములు నాకు
ఆనంద మొసగునవె
అన్ని రసముల జీవ
నాధారమను నేను
ప్రాంతీయ భేదాలు
పాటించు వారొకరు
క్రాంతి ప్రేరేపణమె
కవిత యను వారొకరు
తా వలచి నట్టి యా
తరుణి రంభను వారు
తాను మునిగినది యే
దేని గంగను వారు
కులమత విభేదముల్
తిలకించు వా రొకరు
కళ కళ కొలికె యనుచు
కలహించు వా రొకరు
ఝరిలోని తుంగ గని
పెటికి వేయు నొకండు
వరినె తుంగ యటంచు





నరికి వేయు నొకండు
పుండ్లపై బ్రాలిపడు
పురుగు టీగ యొకండు
తీపి విరులకా బ్రాలు
తేనెటీగ యొకండు
రసదాహి మలిన నీ
రము గ్రోలు ద్విక మొకడు
పాలు నీరును వేఱు
పఱచు హంస యొకండు
మోమోటమునకు నై
ముందు మురిపించొకడు
వెన్ను చాటైనంత
వెక్కిరించు నొకండు
వెలుగునీడల వోలె
వెనుక ముందులు నడచు
నిందాస్తుతుల కొక్క
వందన మ్మొనరింతు
ఎడమకుడి చేతు లవి
ఏక మొనరించి నటు





నింద్రాస్తుతుల గూర్చి
వందన మ్మొనరింతు.
మాలిన్యమును గడిగి
బాలు ముద్దుల కలరు
తల్లియగు దోషజ్ఞ
తల్లిజునకు నమస్సు.
స్తుతి విన్నయపుడు నా
మతిలోని యజ్ఞాన
మరసి గర్వము నోటి
కందకుందును నేను
నింద విన్నపుడు నా
యందున్న గుణజాల
మూహించి దైన్య మృ
త్యువు గెల్చెదను నేను
సహృదయుండగు విమ
ర్శక చక్రవర్తి నుడి
వెల్గులో ముందడుగు
వేయుచుందును నేను.



# లోకాభిరామాయణము

అనాది రామాయణ మిది
అనంత రామాయణ మిది
వినండి యిటు మనసుంచి
వివిధదేశ వాసులారా !
రసాల పత్రమ్ముల నీ
రామాయణము వివేకి



కొసరి కొసరి పాడును కవి
కోకిల యై వాల్మీకి. అ.

షట్ఖండమ్ముల నంతట
షట్కాండమ్ములు గలవు
మంచి చెడ్డ లెల్లప్పుడు
మానవ దానవుల నెలవు. అ.

దానవ మానవుల మధ్య
దారుణ సంగ్రామ మ్మిది,
దానవపురి దగ్ధమ్మయి
మానవుడే గెల్చును తుది. అ.

మానవు డార్జించి కొనిన
మహాలక్ష్మి యా సీత
దానవు డెపు డపహరించు
దాని కొఱకు వలపోత అ.

రాముని యరణ్యకాండము
రావణు సుందర కాండము





యుద్ధకాండ మగు వెనుక అ
యోధ్యాకాండ మఖండము. అ.

మాయలేడి వ్యాపారము
మచ్చుదొంగ సన్న్యాసము
పనికిరాదు విడు మన త
త్పక్షఖండ నావేశము అ.

దానవునిఁ గెల్చుటకై
దాట రాని విపదంబుధి
మానవశక్తి సమైక్య
మ్మయి నిలిచిన యదె గోష్పది అ.

అక్షకుమారుని పాచిక
అణుమాత్రము పొరల దిందు
అక్షయమహదైశ్వర్యము .
తక్షణమ్మెలయ మందు అ.

మనసు మండుచున్న మంచి
మానవు నిట్టూర్పు గదురు
మదోన్మత్త కుంభకర్ణు
నిదుర మబ్బు లట్టె చెదరు. అ.





ఇంద్రజిత్తు ఇంద్రజాల
మీషన్మాత్రము దాగదు.
పది తల లిరువదిచేతుల
బంటు తన మ్మాట సాగదు. అ.

చీమలు పెట్టిన పుట్టలు
పాము లాక్రమించి చొచ్చు
బలవంత మ్మగు సర్పము
చలి చీమల చేత జచ్చు అ.

నాగటి చాలున చక్కని
నడ నొప్పెడు సీతాసతి
ఎవ్వీరుని విరహ మ్మది
త్రవ్వి పోసికొను నీ గతి అ.

శివధనుస్సు గా వెలిగెడు
సింగిణీని భంగ పఱచె
ఘను డొక్కండా భూసుత
కరగ్రహణముం బొనరిచె అ.

సీతాసతి పై ఘనుండు
జీవనంబు లర్పించెను





ఆమె వాని తనలోన స
మైక్యమ్మును గావించెను. అ.

సీతాసతి గర్భమ్మున
చెలగె బీజలవ మొక్కటి
మహదరణ్య మధ్యమ్మున
మసలె నామె పెను వేకటి. అ.

లవరూప మ్మగు బీజము
లలితాకృతి కుశ మయ్యెను
కుశరూపాకృతితో నొన
గూడె బీజ లవ మొయ్యన అ.

మహాలక్ష్మి సీతాసతి
మహిత బీజ లవకుశవతి
దానవు చెఱ విడగొట్టిన
మానవ సుఖశాంతి వసతి.
అనంత రామాయణ మిది
అనాది రామాయణ మిది
వినండి ఇటు మనసుంచి
వివిధ దేశవాసులారా !





# క్షేత్రయ్య

గీ. ఆణిముత్యాల చేరుల ల్లల్లినట్టి
మధుర మంజుల శబ్దసామ్రాజ్య మందు
పదపదమ్మున గోపికాపద్మనయన
విరహవీక్షణపంక్తుల వికసనమ్మొ.





గీ. నీదు రసభావ మందాకినీ తటమ్ము
తరుణ వల్లవీప్రణయ నందన వనమ్ము
వల్లవీ వల్లికా ప్త యౌవనసుమమ్ము
వలచి వలపించు చిలిపిగోపాలు సొమ్ము.

గీ. మదనగోపాల వదన బింబాధరమ్ము
అఖిల విరహిణీ మదనజ్వరౌషధమ్ము
గోపికానాథ గాఢోపగూహనమ్ము
క్షితిని రాధికాజన్మ వచ్చిన ఫలమ్ము

గీ. స్వీయవక్షోజ కందుక శ్రీవహించు
లలిత సంగీత సాహిత్యముల కితండు
స్వామి యని మువ్వగోపాలు సాక్షిగాగ
వాణి క్షేత్రయ్య పదముల వలచి వచ్చె.

గీ. వేద వేదాంత వీథుల వెలయు నట్టి
ఆత్మ పరమాత్మ గలియు సమైక్యలీల
సరస శృంగార వీథుల జాటినావు
ఆంధ్రజయదేవ ! రతిరహస్యానుభావ !





# వరాల భీమన్న

నందనారామగత
మందార కల్పలత
అందాల కొమ్మల శి
ఖాగ్ర భాగము నుండి
రాలె నొక సురభిళిత సూనము - మంత్రపురి
గోదావరీ పెన్నిధానము నంద.

బ్రహ్మలోక హిరణ్య
భవనాగ్ర సీమలఁ
భారతీ దివ్యాభ
రణరత్న మంజూష
రాల్చెనొక వరకళారత్నము - మంత్రపురి
నాంధ్రజన పుణ్యప్రయత్నము నంద.

బ్రాహ్మీ కరాంచిత వి
పంచీ స్వరార్ణవము
రమ్య మోహన సుధా
రాగవీచీ మాల



విసరెనొక రసభావగీతము - మంత్రపురి
విద్యాపయోబ్ధి నవనీతము నంద.

ఆదిదైవ వరాల నడరి భీమాకృతియె
భారతావని దేహబల జయధ్వజ మెత్తె
ఆంధపుత్రులను హతమార్చగా - ధర్మగతి
బంధ మోక్షమ్ము సమకూర్చగా నంద.

అదియె దైవవరాల నలరారు భీమాత్మ
మేధాబలోన్నతిని మేటియై జన్మించ
మంత్రపురి వెల్గె మణిదీపము - విడచి చనె
విద్యావిహీ నాంధరూపము నంద.

విద్యాలతాశాఖ విప్పారు సూనమ్ము
భాగ్యనగరీ పీఠ భారతీగానమ్ము
మంత్రపురవర శిరోమణి పెన్నిధానమ్ము
పాఠశాలాభివర్ధక బహిః ప్రాణమ్ము
ఆరిపోయినది యీనాడూ - మంత్రపురి
ఆగిపోయినది యీనాడూ - లతనుండి
అవని రాలినది యీనాడు నంద.



# కపాల మోక్షము

అతివిజ్ఞానులు నాగరకులు వీ
రన బడు మానవులము మేము
మితిమీఱిన యీ స్వార్థపరతతో
మీమును దానవులము మేము.

కామ క్రోధాల్ మద మాత్సర్యాల్
కరడుగట్టుకొని మాలోన
ఆటం హైడ్రోజను బాంబులుగా
నాటలాడు నీ యిలలోన అతి.





గుజ్జపు రూపుల గాడిద నడకల
కులమతవర్గమ్ములు మావి
ఎజ్జని జూపి చేపను లాగుట
కిచ్చెడి దానమ్ములు మావి అతి.

విందులు గుడిచే సందర్భములో
బంధురూపులము మేమంతా
బొందలోన బడు వానిగాంచి రా
బందు రూపులము కడు వింత అతి.

వెలుపల జూడగ నేమి యెఱుంగని
వెడ్డి మంగలము మే మనిన
ఫలితము లరసెడి తలపులలో నీ
ర్వంకతుంగలము మము గనిన అతి.

గట్టిగనుండిన మానవు గని కను
గుట్టును నిద్దురయే పోము
గుట్టకు గుట్టకు తాకులాట నిడి
కూర్చొనియే చూస్తుంటాము అతి.





అవసరపడ మీ దరిజేరుచు వే
శ్యప్రేమల గురిపిస్తాము
అవసరపడి మీరే వచ్చినచో
జుట్టు బట్టి ఆడిస్తాము అతి

పట్టపగలు నడివీథిలోన నిల
బెట్టి దోపిడిని చేస్తాము
గట్టిగ ఎవరే నడిగిన కానూ
గ్రక్కు తప్పుకొని వస్తాము అతి.

కొట్టులాడుకొని తగవు జెప్పుమని
కోరితిరా మమ్మెవరైన
పిట్టలు పిట్టలు పోరిన మధ్యన
పిల్లి తీర్చినట్లే యౌను అతి.

వేషభాషలూ మానవత్వమును
వెయి చెక్కలుగా జేస్తాము
భాషకొక్క దేవుని జూపించి క
పాల మోక్షగతి నిస్తాము అతి.



# రాజప్రముఖుడు నైజాము

నైజామా ! నైజామా !
నైజము నీకీ యాట
పైజుల నిచ్చే విటు గని
వలచితి నిన్నను పాట నై.

గాజుగ్లాసు రంగుతోనె
కనపడు లోపలి నీరు
కొంచ నూనె నువ్వు లోకపె
గాండ్లవాడే వేఱు నై.

పైజామా పంచా యని
పక్షపాత భావములకు



ఐజ ల్లిస్తుంటావా
అవి మరుస్తనంటావా నై.

కూరెంతో కారమంత
కుమ్మరించు సమతజూపి
తిన్నవారి కండ్లకెల్ల
కన్నీరును దెచ్చితివే నై.

రక్కసి చేష్టలు చేసిరి
రజ్వో నీవో కాని
ఒక్కొక్కటి దలచికొనిన
ఒళ్లంతా ముండ్లుదేలు నై.

లెక్కపత్రం లేని
కుక్కచావు చావకుండ
ఉక్కమనిషి పటేలు దయ
నున్నామీ యింతైనా నై.

పక్కగట్టి పుండ్లుమాన
బజ్జిలేమి మానిపోవు





మక్కారీ చేష్టలు ఒక
ప్రక్క మనసులో నున్నవి నై.

కాలినట్టి యిండ్లల్లో
ప్రేలు మందు గుండ్లల్లో
వెలిగే నీ దివ్య కీర్తి
చెలగే నీ భవ్య మూర్తి నై.

అరిగిన మానాల కెఱుక
తరిగిన ప్రాణాల కెఱుక
కాలుగాలు పిల్లివోలె
కష్టపడిన మా కెఱుక నై.

పోయిన దిక పోనిండని
వేయిమంది ఊరకున్న
షోయీబు రక్తాక్షరాలు
కియా మతున జవా బడుగు నై.

నిజాము సర్కారాలా
హజరత్ ఓ సాయెబయా !
రజ్వీ దయతో నేటికి
రాజప్రముఖుడ వయ్యా నై.





నిజముగ నీ కొడుకుల దగు
నెత్తిగొట్టి చెప్పవయా !
హాజ మీ యనిదే ఖికారి
రజిపీ కీ గుండెలయా ? నై.

పిడికెడు రజకరులే పులి
పిల్లలైరి మా మీదికి
కడవెడు గుమ్మడికాయయు
కత్తిక్రింద లోకువయ్యె నై.

చినిగిన గుడ్డలు దొడిగే
చిత్రపు పక్కీరువయా !
ఇనుము వలెనె బంగారపు
ఇటుక లింక గూర్చుమయా ! నై.

ఏబది లక్షల రూకలు
ఏటేటా ప్రతిఫలమట
గుజ్జము పడవేసిననూ
గుగ్గిళ్లు సమర్పణ మట నై.





# గ్రామోద్ధరణము

నవభారత భాగ్యవిధాతా!
నడచిరమ్మ నవయుగనేతా!
నడచిరావయా యువనేతా!
నడచి రావయా!

నవ వసంతోదయము ప్రసవించే
కవికోకిల గీతము వినిపించె
నవయుగ ధర్మము వివరించవలె
నవజగతి నిచట నిర్మించవలె నవ.

పడిపోయి ప్రమాదము కలిగించే
ప్రాతగోడలను పడగొట్టవలె
ప్రాతనీరు నవలికి తొలగించే
పారే జీవన్నది పుట్టవలె నవ.





మతవాద మనైక్యమునకుకోట
కులభేద మ్మెగుడు దిగుడుబాట
ధనికులు బీద లనే యీ మాట
వెనుకటి ప్రాతపురాణముపాట నవ.

రైతే దేశమునకు కనతల్లి
ఆయన నివసించే దొక పల్లి
పల్లియ మన బంగారపు ముల్లె
గ్రామసుధారే కల్పకవల్లి నవ.

ధనధాన్యములు గడియించ వలె
ఘనమగు కండబలం పెంచవలె
విద్యలందు నెల్లర మించవలె
వివిధ దేశములు కీర్తించవలె నవ.

మనకెవ్వడు లేడిల పగవాడు
మన మెవ్వరికిని తలపము కీడు
మన జోలికి యెవ్వడు రాలేడు
మరి వచ్చిన ప్రాణముతో పోడు నవ.





# ఆ హ్వా న ము

నడుము కట్టి కదలిరండి
నరసోదరులారా !........
సోదర నరులారా !........
సత్యతపోధనులారా !
శాంతిప్రియ జనులారా !
సకలలోక కల్యాణము
జపియించే మునులారా ! నర.

జనతయే జనార్దను డని
జనతయే స్వపాలక మని
జనతయే ప్రపంచ మ్మని
చాటి చెప్పు ఘనులారా ! నర.

జాతిమతాతీతులమై
నీతి నియమ సహితులమై
వసుధైక కుటుంబముగా
వసియింతము రండోయీ నర.





యుద్ధభయము చంపివేయు
బుద్ధుల వికసింపజేయు
సిద్ధార్థుల మహాత్ములను
సిద్ధము చేయుదము రండు నర.

ఒకేదేవు డొకేమనిషి
ఒకటేకష్టము సుఖ మని
దేశదేశముల కీ సం
దేశము గొనిపోవలయును నర.

ఆటంబాంబులతో చెర
లాటమ్ములు వద్దనుచును
ప్రపంచమంతయు వినునటు
బల్లగ్రుద్ది చెప్పవలెను నర.

శాంతిబీజముల సకలా
శాంతమ్ముల లోగొని చని
నాటిరావలెను మన మీ
నాటి నుండియే వినుడీ నర.





## ఓ రా జ !

ఆ బీద మేఘాల
అక్షి గర్భాలలో
అశ్రువులె యుండుననుకొనకు। ఓ రాజ।
అవి నన్ను కదలింపవనకు అ.

జడిసి గడగడలాడు
జలదాలె చెలరేగి
పిడుగులే కురిసెనా
పెనుగొండ పిండియగు
ఉడుపతియు రవియు గనలేరూ। ఆ ఘాటి
సూళ్ళపల్లెలు జలధి జేరు అ.

తలపెద్ద దింద్రియ
మ్ములకెల్ల నెప్పుడని





తక్కినవి తక్కువనుకొనకు। ఓ రాజ !
ఒక్కతల దేహమన జనదు ఆ.

కాళ్ళురెక్కలె సమ్మె
గట్టెనా నీ తిండి
కాండమ్ము పని ఆట
గట్టునని తెలియు మిక
కలిపియెవ్వడునోటబెట్టు ? నిన్ను పై
నిలుప నెవడు పునాది గట్టు ఆ.

పిన్నవా రికముందు
పెద్దవా రగుపెట్లు
అన్నమే నే బెట్ట
ననకూ.... మాలి భువి
నడవి బ్రతుకులు చేయజనకు ఆ.

అడవి చెట్లము మేము
కడవ నీళ్ళ న్నీవు
తడపకున్నను పెరుగగలము। ఉద్యాన
తరులపై నీక్రుధానలము ఆ.





# ఎన్నాళ్ళు ?

ఇది మొదలిక మీ కెక్కువ హక్కుల
నిడెద ముండుడను టెన్నాళ్ళు ?

మొదలె మొగుర మన కొనదూలంబని
మురిపించుట మ మ్మెన్నాళ్ళు ?

ప్రాత యేటి పంచాంగము చూపుచు
నూతన మిది యను టెన్నాళ్ళు ?

సీతను రావణు చెఱ విడిపింపగ
సింధువు బెదరిం పెన్నాళ్ళు ?





అరఘడియయు కోడలును సహింపని
అత్త పెత్తనం బెన్నాళ్ళు ?

సరిపడదిక మీతో మా కన్నను
సాగని దొరతన మెన్నాళ్ళు ?

పాయస మిడి బంతి నౌకరి కొక్కరి
పస్తుల నుంచెడి దెన్నాళ్ళు ?

ఈ యసమానపు త్రోవలలో తల
లెత్తి తిరుగు టిం కెన్నాళ్ళు ?

పంగనామములు గురువున కిడి యిక
భళాభళీ ! యను టెన్నాళ్ళు ?

దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకొని
దొరతన మేలుట లెన్నాళ్ళు ?

ఆర్జించిన మా నెత్తురు మీ జఠ
రాగ్ని హవిస్సగు టెన్నాళ్ళు ?





# ఎన్నాళ్ళు ?

ఇది మొదలిక మీ కెక్కువ హక్కుల
నిడెద ముందుడను టెన్నాళ్ళు ?

మొదలె మొగుర మన కొసదూలంబని
మురిపించుట మ మ్మెన్నాళ్ళు ?

ప్రాత యేటి పంచాంగము చూపుచు
నూతన మిది యను టెన్నాళ్ళు ?

సీతను రావణు చెఱ విడిపింపగ
సింధువు బెదరిం పెన్నాళ్ళు ?





అరఘడియయు కోడలును సహింపని
అత్త పెత్తనం బెన్నాళ్ళు ?

సరిపడదిక మీతో మా కన్నను
సాగని దొరతన మెన్నాళ్ళు ?

పాయస మిడి బంతి నొకరి కొక్కరి
పస్తుల నుంచెడి దెన్నాళ్ళు ?

ఈ యసమానపు త్రోవలలో తల
లెత్తి తిరుగు టిం కెన్నాళ్ళు ?

పంగనామములు గురువున కిడి యిక
భళాభళీ ! యను టెన్నాళ్ళు ?

దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకొని
దొరతన మేలుట లెన్నాళ్ళు ?

ఆర్జించిన మా నెత్తురు మీ జఠ
రాగ్ని హవిస్సగు టెన్నాళ్ళు ?





దౌర్జన్యాగ్ని ప్రజాశ్రులతో యు
ద్ధము చేయుట లిం కెన్నాళ్ళు ?

అడ్డెడు బియ్య మిమ్మడి నీ ప్రసాద
మవ్వ ! యనుట మా కెన్నాళ్ళు ?

గొడ్డు టావునకు వృథగ దాణనిడ
కుడితి పోయు టిం కెన్నాళ్ళు ?

ముచ్చటాడె దన్యునిగని యని సతి
మూతికి బురఖా లెన్నాళ్ళు ?

చచ్చినట్లు పడియుండక యిక యీ
చాలని పెత్తన మెన్నాళ్ళు ?

గొఱ్ఱెల మందను పులి కెర జేసెడు
గొల్లని కాపుర మెన్నాళ్ళు ?

కుట్టువాని వలె నెక్కిన కొమ్మను
కొట్టుకొనిన బ్రతు కెన్నాళ్ళు ?





కుమతిని సుమతిని ఎఱుగక పై బడు
కుక్కల గుఱ్ గరు లెన్నాళ్ళు ?

తమయింటి బలమ్మును జూచుక మీ
దంబడి కఱచుట లెన్నాళ్ళు ?

నిఱుపేదల క్రొవ్వుల నూనెం దిను
నీ దీపపు వెలు గెన్నాళ్ళు ?

పోరినా నిట్టూర్పులతో దీపము
పోరు సల్పు టిం కెన్నాళ్ళు ?

మలిగెడి వేళల వెలిగెడి దీపము
తళుకుల నమ్ముట లెన్నాళ్ళు ?

ఇల బ్రతికెదనని చావుతెలివి బడి
ఇగిలించుట లిం కెన్నాళ్ళు ?

నీట వసించి మొసలితో వైరము
నిల్పి పోరు టిం కెన్నాళ్ళు ?





కోట కొమ్మలం దెక్కి వసించెడి
కోతి దిగక యుం డెన్నాళ్ళు ?

ఆవలి వారలు చూచుటకైనా
కన్యలు గారను టెన్నాళ్ళు ?

చావగొట్టి చెవులను మూసెదు నీ
సవతి తల్లి ప్రే మెన్నాళ్ళు ?

కారణ మేమియు లేకయె పట్టిగ
కలహించెద రను టెన్నాళ్ళు !

పూరణ మెక్కువ యైనంతనె యా
బూరె విచ్చు కుం టెన్నాళ్ళు ?

ఇక్కడి యిప్పటి భాగ్యము జూచుక
ఎగిరిపడుట లి ట్లెన్నాళ్ళు ?

దక్క నిమ్మహి నిజామున కన్నను
దక్కుదు ననుకొను టెన్నాళ్ళు ?





# సూర్యచక్రము - చంద్రరేఖ

సూర్యచక్రము చంద్రరేఖయు చూడ నిరువురు నన్నదమ్ములు
అరయ రెండును రెండుకన్నులె యా విరాట్టునకు.

అంబరమ్మున బాలురిద్దరు నాడుకొందురు రేబవళ్లను
దాగురింతల పిల్లగాడ్పుల మూగుమబ్బులలో.

ఆడుకొనియెడి యారవిందుల నప్పుడప్పుడు బూచివాండ్రును
జోడుబాపుచు బుట్టలో నిడ జూచుచుండెదరు.

పరులయిన యారాహుకేతు ప్రముఖరాక్షస గ్రహము లిలలో
సూర్యచంద్రుల కెన్నడైనను చుట్టములె రాజా.



రవియొసంగు ప్రకాశమునుగొని రాజువై సౌభ్రాత్రముంగొని
తేజు చంద్రాయుధమవై యిటు తెగనటికినావె.

పాక్నాస్థానమ్ము నామది పాకనెదు ధ్వజపటగతేందువు
ఇదియు నిందుస్థానమే నీ విందుడవె యనెడిన్
ఇంతనీప్రభ వెలుగుచున్నను ఇంతపాకుగ నీవు మెలగిన
అంధకారముబాప ప్రతిగృహమందు దీపమొకో.

చక్కలేమన యైకమత్యము మొక్కవోయెను నీవలన నని
దిక్కుకొకరై నీయశక్తిని దివిటి నిడి చూపున్.

ఒక్కరై రవియం దిమిడికొనియున్నయట్టులు తారలుండమి
అందులకె నీ ప్రభుత కొక దీపావసరముబడెన్.

తమ్ములకు పగవాడవని విదితమ్మయిన యీ నీప్రమాదము
వమ్ముసేయగ జూచి పాకనవచ్చు నీయెదను.

బాలచంద్రుని పాలుగార్చెడి పరమపరిశుద్ధాంతరంగము
కాలరూపుడు మహాదేవుడు కని తలందాల్చెన్.



పూర్ణశశిగా గోర వెంబడె పుట్టు నీలో నల్లమచ్చయు
ప్రతిదినమ్మటనుండి రవిముం దెక్కుదవు రచ్చ
అతని సమ్ముఖమందు వచ్చినయంత తెలతెలబోయెదవు నీ
కళలుడుగు చినబోవు మొగమును గాంచి మెచ్చరిలన్.

చందనప్రభ పైన లోన విషంబయిన చెడిపోదు విందుడ
ఇట్టివానిం జిన్నపని యని యెంతు రార్యఘనుల్
గురువనితలను జెరచుచో పెరకొంపలను దోపించుచో
ఆ దురిత కులపక్షపాతమ్మె తుది క్షయం బిచ్చు.

కావలెను కాశ్మీర భోగము
కావలెను కాశ్మీర రాగము
నామత మ్మిది యందు వెల్లరు
నవ్వెదరు నిన్ను.

ఉదయరవితో నుదయ మందెను
పోయినను భానుతో బోవును
కాశ్మీర కళాలయము భా
స్కరుని సొమ్మెనోయ్.





# కాశోజీ కవి

దీనజన సముద్ధరణైక దీక్ష బూని
లోక కల్యాణ చింతావిలోలుడైన
నరుడె నారాయణుండని యెఱుకజెప్పు
నీదు నామరూపము లవనిం గవీంద్ర !

ఎన్నడు కల్లయుంగపటమేని యెరుంగని నీ యథార్థవా
దోన్నతశేముషీ ప్రకటితోక్తుల వీరవిహార వేషులౌ
పిన్న జవాహిరుల్ మరియు పిల్లసుభాషులు గానిపింత్రు మా
పున్నెపుపంట నీ నగవుపూల ఫలింపకయున్నె సత్కవీ !





కన్నెగులాబి మొగ్గల నిగ్గారపుసారము లూనునట్టి నీ
చిన్న యెదందలో నుడుకుచిచ్చుల నొచ్చుచు వెచ్చనౌచు నీ
కన్నుల నశ్రుబిందువుల గార్చుచు గూర్చు కవిత్వనిర్ఝరి
న్వెన్నల కన్న లౌచును ద్రవించి స్రవించెడి రాతిగుండెలున్.

పిచ్చురయంతలే వరెరె పీఠమునెక్కి యుపన్యసింప జూ
ల్విచ్చిన సింగమ ట్లొడలుబెంచుచు గర్జలు సేతు వప్పుడో
చచ్చినపీన్గుకైన నిముసమ్మున ప్రాణమువచ్చు మేన క్రొ
వ్వెచ్చుని నెత్రు క్రేళ్లురికి వీరరసమ్మయి పొంగు సత్కవీ!

ఈయెడ నీ సన్మానము
సేయగ నాకనులనిండ సేవించితి నే
నోయన్న కాశోజీ!
మాయాయువుబోసికొంచు మను నూరేడుల్.

పాండిత్యప్రతిభామణి
మండితు కాశోజికవిని మహితగుణాఢ్యు
న్నిండుతమి గౌరవించిన
చందూరిప్రజలు కడుప్రశంసార్హు లిలన్.





నారాయణకవి గౌరవ
మీరీతిగ జరిగెగాని యిదియెట్లగు న
య్యారే ఆ సమయము సమ
కూరుటకై యెదిరిచూచు కోట్లజనమ్ముల్.

కడుపునిండన్నిను కష్టజీవుల నవ్వు
పూవుల నాతడు పూజగొనును
నరుల నూతనచేతనజ్యోతి వెలుగొంద
నదియె నీరాజన మగు నతనికి
తనదేశ మాత్మాభ్యుదయ సిద్ధిగాంచిన
నదియె దేవాలయ మగు నతనికి
జయహిందునినద మాశాతటమ్ముల నిండ
నదియె భేరీనాద మగు నతనికి
భాయిభాయీ యనుచు నరుల్ రేయిబవలు
గలిసిమెలగుచు ప్రేమగంగా జలముల
జాతిమత వైరములను క్షాళనమొనర్ప
నదియె కనకాభిషేక మర్యాద యగును.





# సమ్మతము

ఓ దైవభక్తుడా ! ఓ దానకర్ణుడా !
కోపపడ కొక్క విజ్ఞాపనమ్మొనరింతు
సకల మతపరమార్థసారము, అదియె
జనతా జనార్దనాచారము ॥ ఓ ॥

భాషింపనట్టి యీ పాషాణమూర్తిలో
శీతోపచారములు స్వీకరించునె స్వామి
శుష్క శూన్యాంగణపు జుమ్మామసీదులో
తలనేలగొట్టుకొని పిలిచి వేడిన నేమి
కనుదెరచి కాంచు మదె దీపము
నీకు, కనబడున యీ విశ్వరూపము ॥ఓ॥

బహురూపధారియై పరమోపకారియై
పలుభాషల న్నిన్ను పలుకరించేవాని
నరుడంచు పరుడంచు నానావిధమ్మాని
పరిహసించితివి నీ వేలరా, ప్రభుసేవ
పరిహరించితివి నీ వేలరా ॥ ఓ ॥





# కా ళో జీ క వి

దీనజన సముద్ధరణైక దీక్ష బూని
లోక కల్యాణ చింతావిలోలుడైన
నరుడె నారాయణుండని యెఱుకజెప్పు
నీదు నామరూపము లవనిం గవీంద్ర !

ఎన్నడు కల్లయుంగపటమేని యెరుంగని నీ యథార్థవా
దోన్నతశేముషీ ప్రకటితోక్తుల వీరవిహార వేషలా
పిన్న జవాహిరుల్ మరియు పిల్లసుభాషులు గానిపింత్రు మా
పున్నెపుపంట నీ నగవుపూల ఫలింపకయున్నె సత్కవీ !





కన్నెగులాబి మొగ్గల నిగారపుసారము లూనునట్టి నీ
చిన్న యెడందలో నుడుకుచిచ్చుల నొచ్చుచు వెచ్చనౌచు నీ
కన్నుల నశ్రుబిందువుల గార్చుచు గూర్చు కవిత్వనిర్ఝరి
న్వెన్నల కన్న తౌచును ద్రవించి స్రవించెడి రాతిగుండెలన్.

పిచ్చుకయంతతే వరెరె పీఠమునెక్కి యుపన్యసింప జూ
ల్విచ్చిన సింగమ ట్లొడలుబెంచుచు గర్జలుసేతు వప్పుడో
చచ్చినపీన్గుకైన నిముసమ్మున ప్రాణమువచ్చు మేన క్రా
వ్వెచ్చని నెత్రు క్రేళ్లురికి వీరరసమ్మయి పొంగు సత్కవీ !

ఈయెడ నీ సన్మానము
సేయగ నాకనులనిండ సేవించితి నే
నోయన్నా కాశోజీ !
మాయాయువుబోసికొంచు మను నూరేడుల్.

పాండిత్యప్రతిభామణి
పండితు కాశోజికవిని మహితగుణాఢ్యు
న్నిండుతమి గౌరవించిన
చండూరిప్రజలు కడుప్రశంసార్హు లిలన్.





నారాయణకవి గౌరవ
మీరీతిగ జరిగెగాని యిదియెట్లగు న
య్యారే ఆ సమయము సమ
కూరుటకై యెదిరిచూచు కోట్లజనమ్ముల్.

కడుపునిండన్దిను కష్టజీవుల నవ్వు
పూవుల నాతడు పూజగొనును
నరుల నూతనచేతనజ్యోతి వెలుగొంద
నదియె నీరాజన మగు నతనికి
తనదేశ మాత్మాభ్యుదయ సిద్ధిగాంచిన
నదియె దేవాలయ మగు నతనికి
జయహిందునినద మాశాతటమ్ముల నిండ
నదియె భేరీనాద మగు నతనికి
భాయిభాయీ యనుచు నరుల్ రేయిబవలు
గలిసిమెలగుచు ప్రేమగంగా జలముల
జాతిమత వైరములను క్షాళనమొనర్ప
నదియె కనకాభిషేక మర్యాద యగును.





# స మ్మ త ము

ఓ దైవభక్తుడా ! ఓ దానకర్ణుడా !
కోపపడ కొక్క విజ్ఞాపనమ్మొనరింతు
సకల మతపరమార్థసారము, అదియె
జనతా జనార్దనాచారము ॥ ఓ ॥

భాషింపనట్టి యీ పాషాణమూర్తిలో
శీతోపచారములు స్వీకరించునె స్వామి
శుష్క శూన్యాంగణపు జుమ్మామసీదులో
తలనేలగొట్టుకొని పిలిచి వేడిన నేమి
కనుదెరచి కాంచు మదె దీపము
నీకు, కనబడున యీ విశ్వరూపము ॥ఓ॥

బహురూపధారియై పరమోపకారియై
పలుభాషల న్నిన్ను పలుకరించేవాని
నరుడంచు పరుడంచు నానావిధమ్మొని
పరిహసించితివి నీ వేలరా, ప్రభు సేవ
పరిహరించితివి నీ వేలరా ॥ ఓ ॥





ఆంగ్లమ్ముగా దతని ఆహ్లాదకరవాణి
సంస్కృతముగా దతని సరసవాక్యశ్రేణి
అరబీలుగా వతని యమృతభాషణ లెందు
పరపీడ గనలేక పరివేదనము జెందు
నరుని భాషణ మేదియైనను, అదియె యీ
శ్వరుని భాషణ మనుకొనంజను ॥ ఓ ॥

నిర్మలమ్మగు మనసె నిఖిలేశు మందిరము
నిష్కామ కర్మమ్మె నిరతపూజాకరము
కల్లలెరుగని నోరు ఘంటానినాదమ్ము
కలుషమెరుగని ప్రేమ తళిహప్రసాదమ్ము
నిత్యతృప్తి జనించు నవ్వులే ఆ
సత్యరూపార్చనకు పువ్వులు ॥ ఓ ॥

హింసనెరుగని మనసె హంసతూలికపాన్పు
రహిదయాదృష్టి నీరాజనమ్మై తన్పు
మండించుచుండువా మనసు లెప్పుడు నీవు
అతని కొంపకె అగ్గి నంటించుచున్నావు
సకలభూతగణాల హితమె - భగవాను
సన్నిధిం జేర్చు సమ్మతము ॥ ఓ ॥





# వల్లభభాయి స్మృతి

తా నిల నస్తమించె సరదారుడు మాదు పటేలనన్ వినన్
మానసమందు గుండువడె మ్రాన్పడె దేహము బావురంచెటో,
గానగనయ్యె నీభరతఖండము నల్గడ లశ్రువాహినిన్
తానములాడె పోయెనుగదా మన పెత్తల నేడొకండనెన్.

పులివలె నేడు నీవు పడిపోయినతత్క్షణమే మహాశయుం
డలఘుమనీషి పండితుడు హాయనె కొండలుగాగ నీపయిన్
నిలిపిన యాశలో త్రుటిని నీరయి కన్నులనుండి జారె వే
తెలుపుము నీవులేనికొఱ దీరునెటుల్ సరదారుయోధుడా.

అదనుకు సృష్టిజేసియిడె నాభగవానుడు నిన్ను మాకు మా
చెదరినయిల్లు చక్కవడ జేసి ప్రపంచము తీర్చిదిద్ద న
య్యది తుదిముట్టకుండ మృతినందితి వీవు మహాత్మహత్యచే
కదలిన పుండు గుండియల కారముజల్లెను నీవియోగముల్.

దేశవిముక్తికై మరియు దేశసమైక్యత కంకితమ్ముగా
జేసిన తావకీన సువిశిష్టచరిత్ర సువర్ణపంక్తులన్



వ్రాసికొను న్ప్రసిద్ధగతి భారత భారతి యెల్లవేళలన్
దోసిలియొగ్గు నీయడుగుదోయికి భారతజాతి అగ్రజా !

పర్వతమ్ములగుండె బ్రద్దలుగాజేయు
జలదగంభీరగర్జనము వాక్కు
నయభయమ్ముల శిక్షణమొసంగి జగమేలు
శశి సూర్యరూపముల్ చక్షియుగళి
భారతమ్మున కరిభయము లేకుండగా
గాచు హిమనగశిఖరము కరము
సకలనదీనదా లొకటిగా జేసిన
హిందూమహోదధి హృదయపరిధి
అంధ ధృతరాష్ట్ర నృపు తెంద రలమికొనిన
మొక్కవోవని యుక్కుభీముడవు నీవు
భవదమోఘశక్తియె హైద్రబాద్విముక్తి
ధన్యవల్లభాయీ ! మాదు తలతురాయి !

వామదక్షిణహస్తాలు వల్లభాయి
నెహ్రూ యనుచు మహాత్ముండు నిలిపిపోయె
ఒకభుజమ్మది పడిపోయె నొంటియొద్దు
జంటలే కెట్లు భారత శకట మీడ్చు ?



బందెనుంచిననీదు పదము భారతభువిన్
స్వాతంత్ర్యభవనంపు సంకువై చె
నీసాహసోపేత నిర్మలచరితమ్ము
ధరణి నిర్భయతకు పురుడుబోసె
గంగానదాభ ప్రసంగప్రబోధాలి
నెండిపోయినగుండె లిగురువెట్టె
నీదేశభక్త్యురునిర్మలాత్మజ్యోతి
ప్రజకెల్ల గన్తవ్యపథము జూపె
ఓపురుషసింహమా భవదుగ్రగర్జ
ఆంగ్లదేశప్రభుత్వ గజాసురులకు
చెవినిబడినంత గుండెలు చెదరిపోయె
అదరిపోయె చర్చిలు మంత్రియంతవాడు.

జయముజయము నీయాశయసిద్ధికి
జయముజయము నీసునిశిత బుద్ధికి
జయముజయము నీయశోభివృద్ధికి
జయమోయీ శ్రీ వల్లభభాయీ !





# స మ గ తి

నడిపగలుపయిన నిశికాంత
కడుపునగల తామసమెంత
ఎడద రాలు నగ్నికణాలు
కడవరకో అశ్రులు రాలు.

సత్యభాను సంఛన్నమ్మన
అత్యాచారపు మే ఘోల్బణ
అత్యాచారపు మే ఘోల్బణ
అనిలాహతి మాయమ్మౌ కన
సత్యభాను సహజ కళాకృతి
నిత్యగతుల నిలువగలుగు క్షితి॥

ఆకాశపు గడియారమునకు
లోకేశుల గడియారములకు
నిముషమ్ములబేదమ్మన్నా
నిజమగుకాలంబే యన్నా
గంటలతేడాయే యున్న
తంటాయే అది పైమన్న





ఈ యెత్తుల వంపులబాట
నీయురికే బండిభరాట
మునుగలవారలకో మురుపు
వెనుకటివారలకో అరపు
నడపే ఈ బండెవడెక్కా
నడకే శ్రేష్ఠమ్మని మ్రొక్కా.

తృణమూ తుమ్మలముం డ్లనక
తినుమేకలపై దయగనక
నరకే కత్తుల పనిముట్లన్
కరకగుటకె కాల్పులు కొట్లున్ ?

నట్టేటంగల భూస్థలముల్
మిట్టాపల్లమ్ముల పొలముల్
వలదన్నా నదీప్రవాహము
పల్లముగని యను దాసోహము
క్రమగతి మితి మించే వాహిని
సమతను సాధించే మోహిని॥





# భాగవతము

వినుడీ మన భాగవతము
విశ్వకథా సంగీతము
ఇదియొక మహాపురాణము
శుకపిక మురళీగానము
మొదటిజన్మ పాఠీనము
బ్రహ్మసృష్టి వరదానము
పిదప కమఠ సంతానము





అమృతకలశ మంథానము
మూడవజన్మ వరాహము
అవనీ కాంతాస్నేహము
సగము మృగము మిగత నరుడు
ప్రహ్లాద హితంకరుడు
వామన వటు సంచారము
వసుధా భిక్షాహారము
పరశురాము నవతారము
ధరణీ విజయ కుఠారము
అస్త్ర శస్త్ర సందీపన
రామరాజ్య సంస్థాపన
హలపురైతు బలరాముడు
మరచక్రపు శ్రీకృష్ణుడు
దుశ్శాసన దుష్పాలన
అన్నవస్త్ర సంక్షాళన
శ్రీధరచక్ర విలసనము
నరనారీ ధృతవసనము
ధర్మవిజయ సంప్రాప్తి
దుఃఖవిమోక్షావాప్తి.





# ప్రతాప ప్రశంస

సురనందనోద్యాన తరులతా పాతిత
పారిజాత సుమార్ద్రి పరిమళముల
సరసకాదంబినీ దరహాస సంకాశ
విద్యుత్ప్రిభాదీప్త విలసనముల
శారదాచరణ మంజీరశింజానాద
మంజుల సంగీత మధురిమముల
మోహినీకర వినిర్ముక్తామరత్వ సం
ధాయక పీయూషపేయరుచుల
సురవరసుధాస్రవంత్యవతరణ మొంద
నఖిలకకుబంతరాళమ్ము లాక్రమించి
వీచె మలయమారుత మొండు వెల్గె నొక్క
దివ్యదీధితి శ్రుతినిండె దేవగీతి.





జన్మజన్మాల పుణ్యసంచయము పండి
సురవరానుగ్రహోజ్వలస్ఫూర్తి నొంది
తెలుగు వీరప్రతాపనిస్తులయశంపు
విజయదుందుభి గోల్కొండవీధి మొరసె.

అత డొకరైతు నింట తెలుగమ్మ తపమ్ముల పంటయై మహో
న్నతమతి నుద్భవించి, నుడి నాతిని గాంచి వరించి, యాంధ్రసం
స్కృతమహితాంగ్లపారసికజిహ్వల నాల్గిట నుంచి, మోహన
శ్రుతుల రచించి పాడిన యశోధను డైన విరించి నాజనెౝ.

అతడు ప్రతాపుడే యొకని యయ్యకు జంకెడివాడు గా డదే
కృతిని సమీక్ష జేసిన నొకేపరి యందలి మంచిచెడ్డ క
చ్చితముగ చెంపపెట్టువలె జెప్పును తప్పుల గప్పుచు న్ముఖ
స్తుతుల నొనర్ప డాత డల సోముని భీముని ధాము నైననుౝ.

అతడు కవీంద్రమౌళి కథకాగ్రసరుండు సమస్తశాస్త్రసం
యుతుడును సద్విమర్శకుడు నుత్తమనాటకకర్త తెన్గు సం
స్కృతికి చరిత్రకారుడు ప్రసిద్ధవిపశ్చితు డింతకు న్స్వర
స్వతి నటియించె వాని తలవాకిట నిల్చి విరాట్స్వరూపతౝ.





తెనుగుపొలాల నీరయితు తేనియకాల్వల దీసి పైడివి
త్తనములువేసి క్రాల్మరకతమ్ముల నారిడి పెంచి మంచి రా
జనము సృజించి విందుల నొసంగెడి పత్రిక లంపి సాహితీ
జనముల దింపి సత్కృతు లొసంగి వరించెను కీర్తికన్యకన్.

అతడు నడయాడు గ్రంథాలయంబొ మూర్తి
గొనిన విజ్ఞానసర్వస్వఖనియొ కాని
అతడు చదువని పుస్తక మ్మనుట లరుదు
క్షితిని సర్వజ్ఞు డనరాదొ యతని బిరుదు.

కవులు పూజ్యము మీ తెలంగాణసీమ
ననెడి దుష్ప్రథ మాపుట కవతరించి
వచ్చి తొడగొట్టి నిలిచి సవాలుసేసి
నట్టి జెగజెట్టి తెలుగమ్మ యనుగుపట్టి.

న్యాయవాదవృత్తియును నన్యాయగతికె
ఫలితమిచ్చుట దలపోసి వెలికి వచ్చి
తెలుగుశారద పదముల నిలిచి కొలిచి
తనిసె నాతడు విజ్ఞానధనుడుగాగ.





గుణిని లింగవయోభేదజనితమైన
న్యూనతల ద్రోసిపుచ్చి వినూత్నకళకు
స్వాంతమున మెచ్చి తగిన ప్రోత్సాహ మిచ్చి
పైకి దెచ్చెడి సహృదయప్రముఖు డతడు.

పండితమౌళి యై మిడిసిపాటిసుమంతయుగాని లేని యా
నిండుఘటంపుమోము ముదినిగ్గుల పల్కు వెలంది భాగ్యముల్
పండ సభాస్థలిన్ సరసభాషలు సేసలుగా జయాంగనన్
పెండిలియాడు వైభవపు పేరిమి గాంచె నురుప్రతాపుడై.

రాజుల వైభవంబులును రాణుల ప్రేమకథాకలాపపున్
మోజుల దేలు వేల్చరితముల్ చదువన్ వినరోసి వ్రాసె న
వ్యాజవిధానతం దొడరి యాంధ్రుల సాంఘిక సచ్చరిత్రముల్
క్ష్మాజనముల్ నుతింప బహుమానములం గురిపింప పండితుల్.

అరయగా నాంధ్రసాంఘికచరిత గురుత
తరమె గురుతింప సామాన్య నరుల కెందు
భారత ఏకాడమియె యాంధ్రభారతి నట
అగ్రతాంబూలమొసగి సమాదరించె.





ప్రాచేతసుని వేదపాథోధి నుదయించు
రామాయణవిశేష రత్న మొందు
స్వర్గంగ నిమ్మహీస్థలికి దెచ్చె ననంగ
సాంఘికచరితప్రసక్తి రెండు
చెవులపండు వొనర్చు చవుల నుత్పాదించు
మన పండుగలలోని ఘనత మూడు
అందని ప్రమానిపం డ్లవని రాల్చె ననంగ
ధర్మ పోలీల కథలవి నాల్గు
రుచిర హంపీరసంభవరచన యైదు
ఉచ్ఛలవిషాద నాటకాభ్యుదయ మారు
ఎన్ని యని చెప్పవలె పల్కు వన్నెలాడి
వివిధభూషల మంజూష వీరి భాష.

జయజయ ప్రతాపరెడ్డీ
వ్యయ మెరుగని వాణి కొంగుబంగరు కడ్డీ
జయ తెలుగువేల్పుగిడ్డీ
నయగుణ నతిగొనుము నీఋణమునకు వడ్డీ.



# మా ప్రచురణలు

## ( 1938—1941 )

| | సభ్యులకు. | ఇతరులకు |
|---|---|---|
| 1. హైందవ ధర్మవీరులు | 0- 4-0 | 0- 6-0 |
| 2. ప్రాథమిక స్వత్వములు | 0- 4-0 | 0- 5-0 |
| 3. గ్రంథాలయోద్యమము | 0- 4-0 | 0- 6-0 |
| *కీ. శే. సురవరము ప్రతాపరెడ్డి* | | |
| 4, 5. కమాల్ పాషా జీవితము (2 భా.) | 0- 8-0 | 0-12-0 |
| *శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం* | | |
| 6. ప్రజలు - ప్రభుత్వం | 0- 4-0 | 0- 6-0 |
| *కౌంట్ లియో టాల్ స్టాయి* | | |
| 7. ఔంధు సంస్థానం | 0- 4-0 | 0- 5-0 |
| *శ్రీ పులిగడ్డ వెంకటసుబ్బారావు* | | |
| 8. నా భారతదేశ యాత్ర | 0- 4-0 | 0- 6-0 |
| *ఎచ్. ఎన్. బ్రెయిల్స్ ఫర్డ్* | | |
| 9, 10. గాంధీమహాత్ముడు (2 భా.) | 0- 8-0 | 0-12-0 |
| *విష్ణుచక్రం* | | |
| 11. కాంగ్రెసు - సంస్థానాలు | 0- 4-0 | 0- 6-0 |
| 12. సంస్థాన ప్రజల సమస్యలు | 0- 4-0 | 0- 6-0 |
| *డా. భోగరాజు పట్టాభిసీతారామయ్య* | | |

## 1953 నుంచి

| | 12½% తగ్గింపు | |
|---|---|---|
| 13. జైలు లోపల | 0- 9-3 | 0-10-0 |
| *శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి* | | |

| | | |
|---|---|---|
| 14. నా గొడవ (గేయాలు) | 1- 5-0 | 1- 8-0 |
| శ్రీ కాళోజి నారాయణరావు | | |
| 15. ఉదయ ఘంటలు (గేయాలు) | 1-15-6 | 2- 4-0 |
| 56 గురు అఖిలాంధ్ర కవులు | | |
| 16. ప్రజల మనిషి (నవల) | 2- 3-0 | 2- 8-0 |
| శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి | | |
| 17. సెలయేరు (జానపద గేయాలు) | 1- 8-6 | 1-12-0 |
| శ్రీ నేదునూరి గంగాధరం సేకరణ | | |
| 18, 19. జీవనరంగం (15 ఏకాంకదృశ్య నాటికలు) | 3- 1-0 | 3- 8-0 |
| 15 గురు రచయితలు, (2 భాగాలు) | | |
| 20. ప్రజలు - ప్రభుత్వం (వ్యాసాలు) | 1- 1-6 | 1- 4-0 |
| కౌంట్ లియో టాల్‌స్టాయి | | |
| 21. పునర్నవం (గేయాలు) | 1- 3-6 | 1- 6-0 |
| శ్రీ దాశరథి | | |
| 22, 23. పరిసరాలు (34 కథలు) | 3- 1-0 | 3- 8-0 |
| 34 గురు కథకులు, (2 భాగాలు) | | |
| 24, 25. తెలంగాణం (32 వ్యాసాలు) | 4- 3-6 | 4-12-0 |
| 23 గ్గురు రచయితలు, (2 భాగాలు) | | |
| 26. ఆత్మ వేదన (గేయాలు) | 1.9 న.పై. | 1.25 న.పై. |
| శ్రీ పొట్లపల్లి రామారావు | | |
| 27. తెలంగాణం (3వ భాగం, ప్రాచీనాంధ్ర నగరములు) | 1.20 | 1-37. |
| శ్రీ ఆదిరాజు వీరభద్రరావు | | |



# రాబోవు ప్రచురణలు :

1. ఆందోళన (ప్రధాన రాజకీయ ప్రణాళికలు)
2. కూర్చిన ముత్యాలు (ప్రముఖుల ప్రవచనాలు)
3. శ్రీ భాగి నారాయణమూర్తిగారి రచనలు
4. పరిసరాలు (3 వ భాగము)
5. తెలంగాణా కవిమిత్రులు
6. గంగు (నవల)
7. అఖిల భారత తస్కర మహాసభ
8. నాలో నేను
9. ప్రాచీన తెలంగాణా
   (రాజకీయ, చారిత్రక, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు)
10. విజ్ఞాన శాస్త్రము
11. భారత మహిళ
12. బుచ్చిపావలు (కథలు)
13. సమాజము - వ్యక్తి
14. రైతు రామాయణము
15. తరంగాలు
16. భారతీయ కళావికాసము
17. సామెత కథలు
18. శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారి రచనలు
19. రామప్ప రభస
20. హైద్రాబాదు సంస్థాన రాజకీయ పోరాటము
21. దేవుని పేరిట (నవల)
22. మీరు - మీ పిల్లలు
23. యుద్ధరంగం
24. సైనికుని జాబులు
25. నాటికల సంపుటాలు
26. బ్రతుకు బాటలు (కథలు)
27. ప్రాచీన భారతములో కార్మికులు
28. చారిత్రక గాథలు

# గ్రంథమాలను గురించి

★

దేశ భక్తుడును, ఆంధ్ర ప్రముఖుడును, దేశోద్ధారక, విశ్వదాత, కళా ప్రపూర్ణ బిరుదాంకితుడు నగు కీ. శే. కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నముగా బహుధాన్య సంవత్సరం (1938) లో ఈ 'దేశోద్ధారక గ్రంథమాలను' స్థాపించినాము. కథలు, నాటికలు, కావ్యాలు, వ్యాసాలు, జీవిత చరిత్రలు, దేశచరిత్రలు మొదలగు వైజ్ఞానిక గ్రంథాలనుఆంధ్రభాషలో అచ్చువేసి, దేశీయులకు అందజేస్తున్నాము. ప్రతి ప్రచురణము పాఠకుల మన్ననలను పొంది, వారి పఠనాసక్తిని ఇనుమడింప చేస్తున్నది. మేము పాఠకులనుండి రు. 10-0-0 చందాగా తీసికొని రూపాయకు రెండు అణాలు హెచ్చింపు ప్రకారం మొత్తం రు. 11-4-0ల వెల గల గ్రంథాలు క్రమంగా అందిస్తాము.

మీరు మా గ్రంథమాల కృషిని గుర్తించి, గ్రంథమాలకు చందాదారులై మమ్ము ప్రోత్సహించాలని కోరుతున్నాము.

విన్నవించు,
వట్టికోట ఆళ్వారుస్వామి
స్థాపకుడు, ప్రకాశకుడు.

# విరాళాలు

## హైద్రాబాదు జిల్లా

1. డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు (హైద్రాబాదు) 250-0-0
2. గౌ॥ డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు (హైద్రాబాదు) 200-0-0
3. గౌ॥ కొండా వెంకటరంగారెడ్డిగారు ( ,, ) 120-0-0
4. డా॥ ఎం. చెన్నారెడ్డిగారు ( ,, ) 125-0-0
5. శ్రీ వల్లూరు వెంకటేశ్వర్లుగారు
   (సుప్రీంకోర్టు అడ్వకేట్) ( ,, ) 116-0-0
6. శ్రీ పి. ఆనందరావుగారు (సికింద్రాబాదు) 105-0-0
7. శ్రీ కే. రాంచంద్రారెడ్డిగారు (పులిమామిడి) 105-0-0
8. శ్రీ మడూరి రాజయ్యగారి
   కిష్టయ్యగారి గద్వాల దుకాణం (సికింద్రాబాదు) 116-0-0

## మహబూబునగరం జిల్లా

1. శ్రీ సోమాగౌడ్ పుల్లయ్యగారు (ఆలంపురం) 400-0-0
2. శ్రీ టి. రాజశేఖరరెడ్డి,
   శ్రీమతి లక్ష్మి సరోజినీ దేవిగారు ( ,, ) 125-0-0
3. శ్రీ సురవరం వెంకట్రామారెడ్డిగారు (కంచుపాడు) 116-0-0
4. శ్రీ చెల్లా వెంకట్రామారెడ్డిగారు (పుల్లూరు) 100-0-0
5. శ్రీ కే. వి. భీమసేనరావుగారు (అప్పన్నపల్లి) 116-0-0
6. శ్రీ వి. అనంతసేనరావుగారు (వెదిర) 50-0-0
7. శ్రీ పల్లెర్ల హనుమంతయ్యగారు (మహబూబునగరం) 75-0-0

## నిజామాబాదు జిల్లా

1. శ్రీ కే. ఆర్. రాజిరెడ్డిగారు (కామారెడ్డి) 50-0-0
2. శ్రీ ఎం. రాంగోపాల్ రెడ్డిగారు (బోధన్) 50-0-0

## వరంగల్ జిల్లా

1. శ్రీ కొత్వాలు మధుసూదనరావుగారు (సంగెం) 250-0-0
2. శ్రీ పొట్లపల్లి రాంగోపాల్‌రావుగారు (పల్లగుట్ట) 151-0-0
3. శ్రీ కటికెనేని గోపాలరావుగారు ( ,, ) 50-0-0

4. శ్రీ కొత్వాలు వీరభద్రరావుగారు (సంగెం) 200-0-0
5. శ్రీ పొట్లపల్లి రాంచంద్రరావుగారు (తాటికాయల) 100-0-0
6. శ్రీయుతులు పొట్లపల్లి రామారావు.
శ్రీ రంగారావుగార్లు ( .. ) 100-0-0
7. శ్రీ సి. కృష్ణారెడ్డిగారు ( .. ) 50-0-0
8. శ్రీ పి. నర్సింహారెడ్డిగారు (రాజారం) 50-0-0
9. శ్రీ చింతకుంట్ల మాధవరెడ్డిగారు (ఘనపురం) 50-0-0
10. శ్రీ చింతకుంట్ల రంగారెడ్డిగారు ( .. ) 50-0-0
11. శ్రీ లింగాల వెంకట రంగారెడ్డిగారు (జనగామ) 55-0-0

## నల్లగొండ జిల్లా

1. శ్రీ గుడిదేవుని మల్లేశంగౌడుగారు (దేవరకొండ) 116-0-0
2. శ్రీ జి. రాంచంద్రరావుగారు (తిప్పర్తి నేనిగారారం) 50-0-0
3. శ్రీ టి. వెంకట్రావుగారు (చెరుకుపల్లి) 90-0-0
4. శ్రీ నల్లవెల్లి వెంకటరామారెడ్డిగారు (తవుళ్లాపురం) 50-0-0
5. శ్రీ సి. వెంకటరెడ్డిగారు (మిర్యాలగూడెం) 50-0-0

## ఖమ్మం జిల్లా

1. శ్రీ ఎం. హీరాలాల్‌రాయ్ (ఖమ్మం) 100-0-0

## ఆదిలాబాదు జిల్లా

1. శ్రీ ముద్దసాని జనార్దనరెడ్డిగారు (మంచిర్యాల) 75-0-0
2. శ్రీ ఎన్. వి. రాజారెడ్డిగారు (భీమారం) 50-0-0

## పశ్చిమగోదావరి జిల్లా

1. శ్రీ సి. హెచ్. పి. మూర్తిరాజుగారు,
ఎం. ఎల్. ఏ; (చిననింద్రకొలను) 116-0-0

## కృష్ణా జిల్లా

1. శ్రీ ముద్దా నారాయణశర్మగారు
అడ్వకేట్ (విజయవాడ) 116-0-0

# నవీన కావ్యమంజరి

సంకలన:

ముద్దుకృష్ణ



ప్రతిమా బుక్స్

49 మూకతాల్ వీధి

మద్రాసు – 7

# విషయసూచిక

# తొలిపలుకు

కొత్తనీరు రాగానే. నదికి నవజీవనం ప్రారంభమౌతుంది. కలతతో ప్రారంభమైనా, క్రమేణా, కలత తీరి, మంచినీరు తేరు కుంటుంది.

ఆ విధంగానే, పరదేశీయులు ఏ దేశాన్నయినా ఆక్రమించి స్వాధీనం చేసుకున్నపుడు, ఆ దేశం, మొట్టమొదట కలవరపాటు పాలైనా, క్రమేణా, తేరుకుని, పరాయివారు కల్పించే సంస్కా రాలకు అనుగుణంగా జాతీయ జీవనాన్ని సర్దుకురావడంలో, తన సంస్కృతిలోనే కొత్తదనాన్ని కల్పించుకుంటుంది.

పూర్వ చరిత్ర పుటలు తిప్పిచూస్తే, గ్రీకులు భారతదేశంలో ప్రవేశించిన తరువాత, వారి పలుకుబడిని, మన శిల్పచాతుర్యం నూతన రూపాన్నిపొంది, కొత్త అందాలను కల్పించుకున్నది. ఆ విధంగానే, ముఘలుల రాకతో, మన చిత్రకళ కొత్తదనాన్ని కూర్చుకుని, ముఘలు సాంప్రదాయాలను కూడా స్వాయత్తం చేసుకుని, నూతన సౌందర్యాన్ని సవరించుకున్నది.

పాశ్చాత్యుల రాకతో, భారతదేశంలో అనేకవిధాల మార్పులు ఆరంభమైనవి. తరువాతను ఇంగ్లీషువారు, దేశాన్ని తమ స్వాధీనం చేసుకుని, తమ ప్రభుత్వం సుస్థిరంగానూ సుఖంగానూ సాగే టందుకు ఇంగ్లీషు చదువుకు ప్రాముఖ్యత కల్పించారు. అంతతో, మన మేథావుల దృక్పథంలో పెద్ద మార్పులు కలిగాయి. ప్రపంచ కంలోని అన్ని భాషలకన్నా ఇంగ్లీషుభాషకి ఒక విశేషత ఉన్నది: ప్రాచీనంలో గ్రీకు రోమను భాషలలోనూ, మధ్య కాలంలో, ముఖ్యంగా ఫ్రెంచి జర్మను రష్యను భాషలలోనూ, ఆ తరువాత ప్రపంచకంలోని అనేక భాషలలోనూ రచన అయిన ఉత్తమ గ్రంథాలు అనేకం ఇంగ్లీషుభాషలోకి తర్జుమా కావడం పరిపాటి

అయ్యింది. అందువల్లను, మనవారు ఇంగ్లీషు భాషలో పాండిత్యం సంపాదించగానే, తద్వారా యూరపు దేశాలలోని ఉత్తమ రచనలను అవగాహన చేసుకునే అవకాశం కలిగింది. అంతతో, మన రచనలలో కొత్తతీరులు ప్రారంభమైనవి. వీటిలో ముఖ్యంగా యెంచదగినవి: వ్యాసము, ఆత్మకథ, నవల, చిన్నకథ, నాటిక, ఖండకావ్యము.

ఖండకావ్యంలో కవి, తన అనుభవాన్ని సూక్ష్మంగా సూటిగా తెలియజేస్తాడు. అందువల్లను, కవి గుండె కొట్టాటా, అతని జీవితానుభవమూ, వ్యక్తిగతమైన అతని ఆందోళనా, ప్రతిగీతంలోనూ ప్రతిబింబిత మౌతూవుంటుంది. ఈ గీతాలలో రసవంతమైన వాటిని చదువుతూవుంటే, పాఠకుడు తన చెవిని కవిగుండెకాయ మీదను అన్చి ఆలోపలి రహస్యాందోళనలను వింటున్నానా అనే భ్రమలో పడిపోతాడు. ఆ కారణం వల్లనే, ఈ గీతాలను వింటూ వుంటే, కవి, శ్రోత భుజంమీదను చెయ్యివేసి దగ్గరకు తీసుకుని, ఆత్మబంధువుడికి తన అనుభవాల్ని చెబుతున్నాడా అనిపిస్తుంది. ఖండకావ్య రచన, సున్నితమైన కళ. ఖండకావ్యమంటే, ఒక చిన్న రసఖండం, ఒక అమృత గుళిక, రసగుల్లా వంటిది.

అయినప్పటికీ, పెద్దన్న పెట్టిన ప్రబంధ వరవడిని గుడ్డిగా అనుసరిస్తూ, ప్రబంధశైలి నెమరువేత తృప్తితో గిడసబారిపోయిన నాలుకలకు ఖండకావ్యాలలోని రసం రుచించలేదు. ఆ రోజులలో, పాత పండితులూ పాతకవులూ చేసిన వికృత విమర్శలకు మహాకవి యిలా జవాబు చెప్పాడు:

"కొయ్యబొమ్మలె చూచు కనులకు
కోమలుల సొరెక్కునా ?" అని.

వ్యతిరేకమైన విమర్శ యెంత నిశితంగా సాగినా, లక్ష్యం చెయ్యక, నవకవుల్తు తమ రచనలను నిరాటంకంగా సాగించారు. ఉత్సాహపూరితులైనవారు సమాజాలను నెలకొల్పి, పత్రికలను ప్రకటించి, నవ్య కవిత్వానికి ప్రచారం యేర్పాటు చేశారు. ఈ

యత్నాలకు 'సాహితీసమితి' మార్గదర్శకమయింది ; 'సాహితి' పత్రిక దారిచూపింది. ఆ తరువాత, విశాఖపట్నంలో 'కవితా సమితి'వలె దేశమంతటా, కవులూ సాహిత్యాభిమానులూ అనేక సమాజాలను నెలకొల్పారు. సాహితి పత్రిక ఆగి పోగానే, ఆలోటు తీర్చడానికి సఖి, జయంతి, ఉదయిని పత్రికలు ప్రచురణ అయినవి. కాని, యే దేశీయులైనాసరే గర్వించగలిగిన యిటువంటి అద్భుతమైన పత్రికలను నిలుపుకో గలిగిన గౌరవం ఆంధ్రదేశానికి దక్కలేదు. అయినప్పటికీ, కవులు తమ యత్నాలను మానక, వేరువేరుగావున్న సాహిత్య సంస్థలనీ, రచయితల్నీ కూడగట్టి, ఆంధ్ర దేశానికంతకీ ఒక పెద్ద సంస్థను నిర్మించే ఉద్దేశంతో నవ్యసాహిత్య పరిషత్తును నెలకొల్పారు. ఈ పరిషత్తు పక్షాన 'ప్రతిభ' అనే పత్రిక వెలువడింది. కొన్ని సంవత్సరాలు నవ్యసాహిత్య పరిషత్తు తీవ్రమైనకృషిని చేసి ప్రజాదరణను పొందింది. కాని, క్రమేణా ఈ పరిషత్తుకూడా విచ్ఛిన్నమైపోయింది. ఆ తరువాత బెజవాడలో 'అభ్యుదయ రచయితల సంఘం' యేర్పాటయి, ఆ అధ్వర్యంలో 'అభ్యుదయ' పత్రిక ప్రచురణ అయ్యింది. సజావుగా సాగక పోయినా, ఈ ఉద్యమం యింకా కొనసాగుతూవుంది. అభ్యుదయ రచనలనే ధోరణి చాలామంది రచయితలను ఆకర్షిస్తూ వుంది. అందుచేతను, ఈ ఉద్యమాన్ని గురించి సూక్ష్మంగా తెలుసుకోడం అవసరం.

పందొమ్మిదివందల పదిహేడవ సంవత్సరంలో రష్యాదేశంలో అపూర్వమైన విప్లవం చెలరేగింది. మార్క్సు ప్రచారంచేసిన సిద్ధాంతాలను అనుసరించి, ఉన్నవారు - లేనివారు అనేభేదాలు లేకుండా, జనసామాన్యమంతా సుఖంగా జీవించే అవకాశాలను కల్పించడమే ఆ విప్లవ లక్ష్యం. అందుచేతను, ఆ విప్లవం మానవ స్వభావాన్నే మార్చివేస్తుందనీ, హెచ్చుతగ్గులు లేని ఆదర్శ సమాజం సృష్టి అవుతుందనీ, అనేకులకు ప్రబల విశ్వాసం కలిగింది. అందుచేతను, మన దేశంలో కూడా అనేకులకు ముఖ్యం

గా యువకులకు, దృష్టి రష్యావేపు మరలింది. రచయితలలో కొందరు ఆ సిద్ధాంతాలను అనుసరించి, నూతన సమాజాన్ని సృష్టించ వలెననే ఆశయంతో, తమ దృష్టిని బీదసాదల సాదకబాధ కాలవైపు మరలించి, నిరుపేదల ఆక్రందనాలు తమ రచనలకు నినాదాలుగా గీతాలాపనలు ప్రారంభించారు. ఈ రచనలవల్లను కొత్త విమర్శలు బయలుదేరాయి.

కవిత్వానికి అలంబనగా ఏ వస్తువు ప్రధానము అనే ప్రశ్న కవులనీ విమర్శకులనీ కలవర పెడుతూవుంది. కాని, ఈ సంఘర్ష ణకు రాజకీయ సిద్ధాంతాలను ఆధారంగా చేసుకుంటే సరియైన జవాబు లభ్యంకాదు. అనుకూలంగా నయినా, ప్రతికూలంగా నైనా, కవిత్వానికి సంబంధంలేని సూత్రాలనుబట్టి విమర్శించడం దృష్టివైశాల్యాన్ని సంకుచితం చేస్తుంది. కొత్త - పాత అనే అసహనం కూడా కూడదు. మహాకవి చెప్పినట్టు "కొత్త పాతల మేలి కలయిక" కోరదగినది.

ఇంతకీ, కవిత్వానికి సిసలైనవిలువలు కట్టవలెనంటే రసం ప్రధానమని నిర్ణయించక తప్పదు; అందుచేతను పద్యానికి ప్రాణం రసవంతంగా వుండడమే!

జయంతి తే సుకృతినో

రససిద్ధాః కవీశ్వరాః ।

మద్రాసు,
1957

ముద్దుకృష్ణ

## గురజాడ అప్పారావు

## (1862 — 1915)

విజయనగరం మహారాజా కాలేజిలో బి.ఏ. పేసైనారు. సంస్కృతము, ఇంగ్లీషు భాషల్లో పాండిత్యంతోపాటు, లేటిన్, పారసీకము, కన్నడ, బంగాళా భాషల్నికూడా బాగా చదివారు. ఇంగ్లీషు భాషలో పద్యాలు రాశారు. ఆనంద గజపతి మహారాజు వద్ద ఎపిగ్రాఫిస్టు పనిచేశారు. మద్రాసు విశ్వవిద్యాలయంలో సెనేటు మెంబరుగా వుండేవారు. కృతులు: ముత్యాలసరాలు; చిన్నకథ - కన్యాశుల్కము - బిల్హణీయము - కొండుభట్టీయము

# ధూమకేతువు

ధూమకేతువు కేతువనియో
మోముచందురు డలిగిచూడడు!
కేతువా యది? వేల్పు లలనల
కేలి వెలితొగ కాంచుమా!

అరుదుగా మిను చప్పరంబున
చొప్పుతెలియని వింత పాడమగ
చన్న కాలపు చిన్నబుద్ధులు
బెదిరి యెంచిరి కీడుగా;

అంతెకాని రవంతయైనను
వంత నేగతి కూర్చనేర్చునె,

నలువ నేరిమి కంతు యిదియన
నింగితొడవయి వ్రేలుచున్.

కవులకల్పన కలిమి నెన్నో
వన్నెచిన్నెలు గాంచు వస్తువు
లందు వెట్టి పురాణగాథలు
నమ్మజెల్లును పండితుల్.

కన్ను కానని వస్తుతత్త్వము
కాంచనేర్పరు లింగిరీజులు ;
కల్లనొల్లరు ; వారి విద్యల
కరచి సత్యము నరసితిన్.

దూరబంధువు యితడు భూమికి,
దారిబోవుచు చూడవచ్చెను
దెబ్బదెనుబది యేండ్ల కొకతరి
నరుల కన్నుల పండువై.

తెగులు కిరవని కతల పన్నుచు
దిగులుజెందు టదేటికార్యము ?
తలతు నేనిది సంఘ సంస్కర
ణ ప్రయాణ పతాకగాన్.

చూడు, మునుమును మేటివారల
మాట లనియెడి మంత్రమహిమను
జాతిబంధము లన్ని గొలుసులు
జారి, సంపద లుబ్బెడున్.

ఎల్లలోకము వొక్క యిల్లై,
వర్ణ భేదము లెల్లకల్లై,
వేల నెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియ.

మతము లన్నియు మాసిపోవును,
జ్ఞాన మొక్కటి నిలిచి వెలుగును ;
అంత స్వర్గ సుఖంబు లన్నవి
యవని విలసిల్లున్.

## ఓ న మా లు

ప్రేమ విద్దెకు వోనమాలివి :
యెదను నిల్పిన, మేలుచేకురు.
"మరులు ప్రేమని మదిదలంచకు ;
మరులు మరలును వయసుతోడనె ;
మాయ, మర్మములేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుకముకు రాజమార్గము -
ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును -
ప్రేమ నిలిపిన, ప్రేమ నిలుచును"
ఇంతియె.
కాసు వీసము నివ్వనొల్లక ;
కవిత పన్నితినని తలంపకు ;
కాసు లివె ; నీ కంఠసీమను
జేరి బంగరు వన్నెగాంచుత !
మగడు వేల్పన పాతమాటది ;
ప్రాణమిత్రుడ నీకు, నీ నెనరు
కలుగక యున్న, పేదను ; కలిగినను
నా పదవి వేల్పులరేని కెక్కడ ?

# లంగరెత్తుము!

విరిగి పెరిగితి, పెరిగి విరిగితి,
కష్ట సుఖముల పార మెరిగితి;
పండు నన్నవి ఆశలెన్నో
యెండి రాలగ బొగిలితిన్.

అందజాలని పళ్ళకోసము
అఱ్ఱు జాపితి; నేల ప్రాకిన
చెట్ల పళ్ళను విలవ లెరుగక
పాద రక్షల మట్టితిన్.

తీపి విరిగిన చెరుకువలె ఆ
నాటి కోర్కెలు నేడు బెండౌ
టెంచి నవ్వితి; బుద్ధి చపలత
కొత్త కోర్కెల తగిలితివ్.

దేవతలతో జోడు కూడితి,
రక్కసులతో కూడి ఆడితి;
కొత్త మిన్కుల తెలివి పటమును
మంచి చెడ్డల మార్చితిన్.

చూతునా! అని చూసితిని, మరి
జేతునా! అని చేసితిని; ఇక
చూడ చేయగ రాని వింతలు
చూపి కన్నులు కట్టితిన్.

శత్రు మిత్రుల కిచ్చి నెనరులు
స్నేహవార్ధిని కొల్ల గొంటిని;
నాటి మిత్రులు తరల శూన్యం
బైన పుడమిని నిలిచితిన్.

పంజరంబున నున్న కట్లను
పగల దన్నగ లేక స్రుక్కితి;
నింగి పర్వగ లేని జన్మము
      నీరసం బని రోసితిన్.

"ఉసురులకు విసికితివో ? యుద్ధము
కలదు; దేశము కొరకు పోరుము"
యుద్ధమా ? ఇక నేమి లోకము !
      చాలు ! చాలును ! లంగ రెత్తుము !

---

## రాయప్రోలు సుబ్బారావు

గురుదేవ్ రవీంద్రనాథ్‌ఠాకూర్ స్థాపించిన శాంతినికేతన్‌లో వుంటూ ఇంగ్లీషు, జర్మన్ భాషలలో కవితారీతుల్ని గురించి కృషిచేస్తూ, అలంకార శాస్త్రం అభ్యసించారు. నైజాం కాలేజీలో తెలుగు అధ్యాపకులుగావున్నారు. ప్రస్తుతం తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఆంధ్రశాఖకు అధ్యక్షులు. కృతులు : లలిత - కష్టకమల - స్వప్నకుమారము - తెనుగు తోట - తృణకంకణము - ఆంధ్రావళి - జడకుచ్చులు - కన్నెపాటలు.

జననం : 1892

## తమ్ముడా

శ్రీలు పొంగిన జీవగడ్డయి,
పాలుపాఱిన భాగ్యసీమయి,
వ్రాలినది ఈ భరతఖండము
భక్తి పాడర తమ్ముడా !

వేదశాఖలు పెరిగె నిచ్చట,
ఆది కావ్యం బందె నిచ్చట,
బాదరాయణ పరమఋషులకు
పాదు సుమ్మిది చెల్లెలా !

విపినబంధుర వృక్షవాటిక
ఉపనిషన్మధు వొలికె నిచ్చట,
విపులతత్త్వము విస్తరించిన
విమల తల మిదె తమ్ముడా!

సూత్రయుగముల శుద్ధవాసన,
క్షాత్రయుగముల శౌర్యచంద్రిమ,
చిత్రదాస్యముచే చరిత్రల
చెఱిగిపోయెనె చెల్లెలా!

మేలి కిన్నెర మేళవించీ,
రాలు కరగగ రాగ మెత్తీ,
పాలతీయని బాలభారత
పదము పాడర తమ్ముడా!

నవరసమ్ములు నాట్య మాడగ
చివురుపలుకులు చెవులవిందుగ
కవిత లల్లిన కాంతహృదయుల
గారవింపవె చెల్లెలా!

దేశగర్వము దీప్తి చెందగ
దేశచరితము తేజరిల్లగ
దేశ మరసిన ధీరపురుషుల
తెలిసి పాడర తమ్ముడా!

పాండవేయుల పదునుకత్తులు
మండి మెరసిన మహితరణకథ
కండ గల చిక్కని తెనుంగుల
కలిసి పాడవె చెల్లెలా!

లోక మంతకు కాక పెట్టిన
కాకతీయుల కదనపాండితి
చీకిపోవని చేవపదముల
చేర్చి పాడర తమ్ముడా !

తుంగభద్రా భంగములతో
పొంగి నింగిని పొడిచి త్రుళ్లీ
భంగపడని తెనుంగునాథుల
పాట పాడవె చెల్లెలా !

## పుస్తకము

నిండాఱ బాఱు నఖండగోదావరిన్
దాగిన చాళుక్యనాగరికత,
పాడైన పెనుకోటగోడల దీర్ఘని
ద్రలువోవు కాకతి ప్రాభవమ్ము,
పల్లెపదాల జీవము నిల్పికొన్న ప
ల్నాటివీరుల రక్తనాళపటిమ,
కడలేక యేడ్చు తుంగాభద్ర కెరటాల
మఱగిన ప్రాజ్య సామ్రాజ్యభరము,

హృదయములు విన పలుకక చదువు చెప్ప
పుస్తకతపస్విని తెనుంగుపూలపొదల
నిలిచి సేవాశుకమ్ములన్ పిలిచి పిలిచి
తిరుగ పాడించు గాత జాతీయగీతి.

ఆచారమునకు దాస్యము చేయుచును వంట
యిలు దాటి రాని పూర్ణేందుముఖుల,
ఉదయాస్తమయములు నొడలిచెమ్మట లోడ్చి
క్షేత్రసేవలు చేయు సేద్యగాంధ్ర,

బ్రతికినన్నాళ్లు తీరనికష్టి రెక్కలు
విరిచి జీవించెడు పేదజనుల,
తను వచో వీథులన్ తాకరా దనుచు దు
ర్గతుల బ్రోసిన చెప్పరానివాంధ్ర,

పూలతో నిండి కమ్మదనాలు చిమ్మ
పుస్తకనికుంజపుంజాళిపొంత బిలిచి,
'నా జనము, నాదుదేశ' మనంగ జాలు
ఇంత జ్ఞానభిక్షాదాన మిమ్మ తల్లి!

ఆంధ్రుల శిల్పవిన్యాసంబు చూపించు
కలిమి గోపురములన్ గల దటంచు,
ఆంధ్రనాగరికకళ్యాణచిహ్నములైన
గానసాహిత్యముల్ గల వటంచు,
ఆంధ్రభాగ్యమ్ము మోయగ గౌతమీ కృష్ణ
దరులను నావలు తిరిగె ననుచు,
ఆంధ్రవీరులకు స్వర్గాతిథ్య మిచ్చి పా
టలు పాడిన యుగమ్ము కల దటంచు,

చెప్పి యొప్పించు పుస్తక శ్రీకుమారి
యందగింపగ గల యాలయములు గట్టు
డాంధ్రదేశమునం దెల్ల నాంధ్రపుత్రు
లా ప్తమానవసంఘసేవానురక్తి.

## మేఘము

ఆకాశంబున జీబుకాడె సొగసై యాషాఢయోషా నితం
బాకీర్ణాలకజాలకంబు లన పాయల్పాయలై మేఘముల్;
రాకాచంద్రవిలాసముల్ ముసుగువాఱన్ నైల్యమాల్యంబులై
ప్రాకెన్ చీకటిచెట్లసోయగపు పూరంగుల్ దిశాంతమ్ములన్!

చినుకు చినుకునకు చీలిన చిన్నిరేకుల
తోడ పద్మంబు లల్లాడదొడగె;
ధార ధారకు మాపు తగిలిన చిగురుల
తోడ కొమ్మలు సొంపు లోడగడగె;
జల్లు జల్లునకు తృష్ణలు సళ్ళు తీయుమ్మ
తోడ చాతకము లఙ్ఞాడసాగె;
ఉరు మురుమునకు నంకురమైన మొలకల
తోడ వేణువులు తూగాడనయ్యె;

భేదమును మోద మవనికి గీలుకొలిపి
ప్రౌఢవయి నటియించు వాషాఢలక్ష్మి,
పల్కలేక ప్రాల్మాలు నా నాల్కగూడ
క్రొత్త చక్కిలిగింతల గుస్తరింప!

ఎండిన బీళ్ళయందు నుదయించినపచ్చిక కండ్లపండువై
యుండగ చూడియాలు తలలూపుచు బోయెడి, క్రొత్తనీటిచే
నిండె తటాకగర్భములు, నిమ్నటముల్ కడుశ్యామలంబులై
మెండుకొనెన్ వనిన్ మొగిలు మేసె ప్రభాతములందు కొండలన్.

నీడల్ గట్టగ భూమియందు, చదలన్ వ్రేలాడు కాదంబినీ
చూడాకృష్ణకలాపగుచ్ఛములపై చూడ్కుల్ కటాక్షించి, లీ
లా డోలాసుఖలాలనీయరతి సోలన్ సాగె నృత్యోత్సవ
క్రీడోన్మాదములై మయూరములు సారెన్ పింఛముల్విప్పుచున్.

కడలిమూలల నుండి పికక్కటిల లేచి
బొబ్బరిల్లుచు మబ్బులు పోవసాగె,
తొలకరి వయఃపయస్సు పొంగుల విధాన
పుబ్బెతలు విప్రలంభవాగురుల జిక్క!

# క వి త

తేట లయిన పుణ్యారణ్యవాటికలను
పుట్టితి నుషఃకుమారి తోబుట్టుగాక!

ఇగురుటాకు నెలల పచ్చియెండలందు
అంద మెకబోయు లావణ్య మాహరించి,
పసితనం బసియాడ జీవనము త్రావి,
పెరిగితిని నిత్యకోమలస్ఫురణ లొలయ!

గ్రీష్మమాసవేణికల తేటిన జలాల
స్నానమాడి శిరోజగుచ్ఛములు కడిగి
సందె కుంకుమ తిలకలాంఛనము తీర్తు!

నింగిబాలెంత నడికట్టుకొంగు లనగ
జాఱు నతసీపయోద ప్రసన్నరేఖ
లందికొని లాగి చీరెగా నందగింతు!

క్షాళిత విశాల విశ్వరంగంబునందు
నిండువెన్నెల తెలిచాందినీలు గట్టి,
మొలక పచ్చని ముగ్గులు పుడమి దీర్చి,
శారదోత్సవభోగముల్ సలిపి తనిసి;
పచ్చి ముత్యాలవాయనాల్ పంచిపెట్టు
ఉదయసతి కాకుపచ్చపయ్యెదలు సాతు!

పత్త్ర వస్త్రాపహరణ పాపంబుకతన
చిన్నవోయిన కొమ్మలసిగలమీద
ఋతుహితస్నానశోభన మెదుగ జూతు!

తడిసితడియని నాజూకుత్రాళ్ళ వలల
భావశుకములు బందాలుపడ రచించి,

ప్రాణిలోకమ్ము నానందపథ విలీన
మహ దనంత సౌందర్య సామ్రాజ్యమునకు
పెనువలపు గొన నారాటపెట్టుచుందు !

చిక్కని శకుంతములకు సచిత్రమయిన
అమల వాగర్థకేళీరహస్య మధువు
నామెతలు పెట్టి సాకుదున్ ప్రేమ విరియ !

నాదు సౌందర్యవిభవము, నాదు రేఖ,
నాదు కన్నెసింగారంబు, నాదు చేష్ట,
నాదు నడకలపొందిక, నాదు గీతి,
సుమధురంబైన పూజాప్రసూనమట్లు
అస్ఖలితమైన కన్నెసోయగము చాయ,
కనుల పూజించి మనసుతో గౌరవించి
వాణి ద్రావుచు నుందు రరీణభక్తి
పరిపరివిధాల శోభాతపస్వి జనులు !

బాలపుష్పము నంటిన పాప మనుచు,
ముగుదవలె రేకుజెఱగుల మూసికొనిన
మధురతారుణ్య మర్చనామాత్ర మనుచు,
అడుగు సోకిన కడ నెల్ల నణువు లణువు
లగుచు ప్రాణకళలు రాలు నంద మెంచి
కొలుచుచుందురు భావకోమలులు నన్ను !

నిత్యకౌమార తరుణాభిజాత్య నగుచు
నింత స్పర్శాకలంకము నెఱుగ నేను !

బాలాంత్రపు వేంకటరావు - ఓలేటి పార్వతీశం. వీరు జంటకవులు. సంస్కృత, బెంగాళీ భాషలలో పండితులు. ఆంధ్రప్రచారిణి పేరుతో గ్రంథ మాలను స్థాపించి నవలా పఠనలో ఆంధ్రులకు అభిరుచి కల్పించారు.

జననం బాలాంత్రపు వేంకటరావు 1881
ఓలేటి పార్వతీశం 1882 – మరణం 1955

కృతులు : బృందావనము - ఏకాంతసేవ - కావ్యకుసుమావళి - భావ సంకీర్తనము - వాల్మీకిరామాయణము.

## ఉదయగానము

ఏడు కుండలు పొంగి యేకమైపోయె
ఏడు కొండలు క్రుంగి యిట్టట్టులాయె
ఏడేడు లోకాల కెడము లేదాయె
ఏదిరా నీ బుద్ధి యెందాక బోయె
లేదురా నిద్రలో లేదురా సుగతి
చూడరా కన్నెత్తి చూడరా జగతి!

అన్నదమ్ములు చేతులందుకొన్నారు
అలుబిడ్డలు తారు లాడుచున్నారు
కన్ను మూయగ గంత గట్టుచున్నారు
కర్మమా యిది యేమి కదలకున్నావు
లేదురా నిద్రలో లేదురా సుగతి
చూడరా కన్నెత్తి చూడరా జగతి!

నిలుపుచున్నారురా నీటిలో నిప్పు
మెలపుచున్నారురా మెప్పులో ముప్పు
తెలుపుచున్నారురా తెలివిలో తప్పు
తేరుకోవేమిరా తెల్లవారినది
లేదురా నిద్రలో లేదురా సుగతి
చూడరా కన్నెత్తి చూడరా జగతి!

ప్రొద్దు చెంగట సంజ పొంచున్నవేళ
సద్దు చేయక రేయి చనుచున్నవేళ
మిద్దెలోపలి దివ్వె మిన్నెక్కువేళ
తమ్ముడా యీ జోగు తగదురా నీకు!
లేదురా నిద్రలో లేదురా సుగతి
చూడరా కన్నెత్తి చూడరా జగతి!

కొండ కొమ్మల పెద్ద గోల ముట్టినది
నిండువెన్నెల చెట్లనీడ పట్టినది
గుండుతుమ్మెదలలో కాటు పుట్టినది
గుండె లెట్లుండెరా గుర్రు పెట్టెదవు
లేదురా నిద్రలో లేదురా సుగతి
చూడరా కన్నెత్తి చూడరా జగతి!

మంచు పెందెరలపై మించు రేగినది
కంచు మేడలలోన గంట మ్రోగినది
పంచమధ్వని మింట పర్వసాగినది
మించిపోయె నికైన మేలుకోవేర
లేదురా నిద్రలో లేదురా సుగతి
చూడరా కన్నెత్తి చూడరా జగతి!

చిగురు కొమ్మల చేరి చిన్న కోయిలలు
వగరు కుత్తుకలు నొవ్వగ పల్కుచుండె
నగరు లోపల చేరినా రెల్లవారు
పగలయ్యె నింకేటి పడకరా నీకు ?
లేదురా నిద్రలో లేదురా సుగతి
చూడరా కన్నెత్తి చూడరా జగతి !

భవ బంధము లెడల్చు బ్రహ్మణ్యమూర్తి
కాలపాశము త్రెంచు కైలాసమూర్తి
వారుణీశ్వరునొంచు వైకుంఠమూర్తి
ఈ త్రయీ మూర్తి నీ యెదుటనున్నాడు
వేయి చేతులు సాచి వెలుగుచున్నాడు
పేరు పేరున లేపి పిలుచుచున్నాడు
లేదురా నిద్రలో లేదురా సుగతి
చూడరా కన్నెత్తి చూడరా జగతి !

## ప్రణయ గీతములు

కాళీయ ఫణి జూచి కార్చిచ్చు జూచి
వెర్రి గోపికలార ! వెరచెదరేల ?
కొదవలన్నియు తీర్చు గోపాలమూర్తి
మీపాలనుండగా మీకేమి భయము ?

* * *

గోపాలకుల వీడి గోవుల వీడి
పాడుచు నాతోడ పరుగెత్తివచ్చి
బాలకృష్ణుడు చాల బడలినాడమ్మ !
విరజాజి చెల్లెలా విసరవే మమ్మ !

రాసమండలములో రాధికారమణి
బాలకృష్ణునిలీల భావించి సొగసి
తన్మయత్వంబుచే తన్ను దామరచి
సుఖియించుచుండగా చూపోపలేక
షట్పదస్వరముతో ఝూంకరించెదవు
మతిలేదటే నీకు మల్లికావల్లి ?

*　　*　　*

మమతగ్రమ్మిన దమ్మ మధురరూపమున
తెలివి తప్పినదమ్మ దివ్యతేజమున
మధురమోహనునిపై మనసు నిల్పుటయె
అపరాధ మౌనటే అళినీమ తల్లి !

ధరణీధరము నెత్తి దావాగ్ని మ్రింగి
చెలువు కందకయుండ చిన్నికృష్ణుండు
రాసమండలములో రమణులందరకు
వినిపించుచున్నాడు వేణుగానంబు !

కన్నులున్న ఫలంబు కనుగొంద మమ్మ
కామినీమణులార కలసి రారమ్మ !
దెసలెల్ల తెలివందె ! తిమిరంబు డిందె !
చలువ తెమ్మెరవీచె జాబిల్లితోచె !

మనసులో కుందుచు మౌనదర్పమున
ఎన్నాళ్ళు లిటులున్న నేమగు నమ్మ !
జగదేకవిభుడైన శ్యామసుందరుని
సుందరీ మణులార ! చూడరా రమ్మ !

# భావసంకీర్తనము

రజనియా - నే జేయు ప్రార్థనము పెడచెవింబెట్టి,
మెల్లగ వెడలిపోయినది;
దీపకళికలా - సదమల కాంతులఁ దొఱఁగి,
వెల్లమొగముతో గనబడుచున్నవి ;

మందిరమన్నచో - చెన్నుఁదొఱఁగి చిన్నవోయిన
పగను దోఁచుచున్నది ;
చూడ, నా కన్నులలోనె బళ్ళునఁ దెల్లవాఱి
పోయినది ;

నీవు దరిసెన మ్మీయకే తలఁగిపోయితివి గదా !
తలుపులు తీసిన వటులే
నిరర్గళంబులైయుండని మ్మైన నేమి ?
కనులు మూసి,
నిను మదిలోఁ గాంతును ప్రభు !

## పింగళి - కాటూరి

పింగళి లక్ష్మీకాంతం. మద్రాసు విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. డిగ్రీ తీసుకున్నారు. బందరు నోబుల్ కాలేజిలో లెక్చరర్‌గానూ, మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోధకులుగానూ, తర్వాత చాలా సంవత్సరాలు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆంధ్రభాషలో ప్రధానాచార్యులుగానూ పనిచేశారు. ప్రస్తుతం విజయవాడ ఆలిండియా రేడియోలో సాహిత్యపర్యవేక్షకులుగా వున్నారు. వీరి రచనలు: గంగాలహరి - గౌతమవ్యాసాలు.

కాటూరి వెంకటేశ్వరరావుగారు. బందరు నోబుల్ కాలేజిలో బి. ఏ. చదువుతూ అసహాయోద్యమంలో పాల్గొనేందుకు చదువు మానేశారు. చాలా కాలం ఆంధ్రజాతీయ కళాశాలలో అధ్యాపకులుగానూ, కొంతకాలం ప్రిన్సిపాలుగానూ పనిచేశారు. తొమ్మిది సంవత్సరాలు కృష్ణాపత్రికకు గౌరవ సంపాదకులుగా వున్నారు. వీరి రచనలు: పౌలస్త్యహృదయం - గుడిగంటలు.

1920 నుంచి వీరిద్దరూ కలిసి కవిత్వరచనలు చేశారు.

పింగళి లక్ష్మీకాంతం, జననం 1894

కాటూరి వెంకటేశ్వరరావు, జననం 1895

కృతులు: తొలకరి - సౌందరనందము.

# కవితాసామగ్రి

చూతురా ? దీనిని జూతపల్లవఖాదిని
పికాంగనాగాననిస్వనంబు
కొందురా ? దీనిని గ్రొమ్మెఱుంగుల జిల్గు
పనికిఁ గాఁదగిన కుందనపుఁదళుకు

కావలెనా ? యిద్ది, కలువపూరేకు
పాత్రములఁ జిప్పిలెడు మెత్తందనమ్ము
వలయునా ? మలయపర్వతసానువులనుండి
దిగుమతియగు కమ్మ తెమ్మెర లివి

తీయుదుర ? దీని వెన్నెలతేట నిగ్గు
ఒఱయుదుర దీనిఁ బచ్చకప్పురపుఁదావి
కోరికొందుర ? దీనిఁ బటీరజలము
త్రావిచూతుర ? తీయని పూవుఁదేనె.

నికరమ్మై, యకలంకమైన సరకుల్, నిర్దుష్టముల్ మీ పరీ
క్షకుఁ దాళంగల మేలి క్రొందినుసు, మీకన్నప్పు మోసంపు వ
ర్తకుఁడన్గాను, కులక్రమాగతము బేరమ్మిద్ది భాషాకు మా
రకులారా ! కొనరండు మీరు కవితారంభప్రియంభావుకుల్.

ఈనాటిదా ! మాకు, బానయ్య మా మూల
పురుషుండు యిజ్జ కీసరకు లమ్మె

ముత్తన్న సెట్టి మా ముత్తాత పింగళి
వారింటఁ దననాఁడు పతనకాఁడు

కన్నయ్య, మా తాతకాలానఁ జేమకూ
ర్వెంకన్న మా కొట్టు బేరగాఁడు

ధవళేశ్వరమున మా తండ్రి యంగడిమీఁదఁ
దిరుపతికవులు నీసరకె కొనిరి

నమ్మకమ్మైన యీసరకమ్ముచుందు
నాంధ్రదేశమ్ము నలుదిక్కులందుఁ దిరిగి
వతనుగా వత్తు నే ననువత్సరమ్ము
నొకపరిఁ గొనుండు మాటనమ్మకము తెలియు.

చనుదెండో కవులార ! మీరు కవితాసామగ్రి వాంఛింతురే
ననుచున్ బందరుపేటలన్ దిరుగు బేహారిన్ విలోకించి, తె

చ్చెనురా కైతము లమ్మకానికని వచ్చెన్ గావ్యకృన్మామసా
ధనచింతాపరుఁ డొక్కరుండు బుజముల్ తాటించుచున్ వీథికిన్.

రచ్చకువచ్చి, యోయి యిటురమ్మనిపిల్చి కవిత్వవస్తువుల్
తెచ్చితివా! కనుంగొనెదఁ దీయుము మూఁతలటం చొకొక్కఁడున్
విచ్చి, సకౌతుకాద్భుతపు వీక్షలఁ జూచుచు నీసడించి "పో
వచ్చు, నివేటివస్తువులు వర్తకుడా!" యనినవ్వి యిట్లనున్:

కపురంపుంబలుకుల్, తుషారజలముల్, కల్వల్, పికధ్వాన, మ
చ్చపుబంగారము పూవుదేనియలు, జ్యోత్స్నల్, చల్లగాలుల్, కవి
త్వపుసామగ్రియటంచుఁ జూపెదు, కవిత్వంబన్న నెట్లుండునో
యెపుడున్ జూడనివానికింబలెనె; పామ్మీ చాలు సంతోసమే.

అని దారిఁ జూపు కవిమొగ
మును గని వెఱగంది, ధైర్యమున నేమేమో
యనఁబోవు బేరి సరకులు
గొనుతలఁపున మూగి రింకఁ గొందఱు సాముల్.

ప్రౌఢసమాసకల్పనమున్న నీయొద్దఁ
జూపుమీ యని చేయిచాపె నొకఁడు
శ్లేషకవిత్వమంజూష నీకడనున్నఁ
గొనియెద నేనంచుఁ గొసరె నొకఁడు
సత్కావ్యరచనా రసాయనంబున్నచో
నీ బుద్ధినింపుమంచిచ్చె నొకఁడు
ఆశుకవిత్వమ్ము నల్లుమంత్రములున్న
నూదుమీయని చెవియొగ్గె నొకఁడు
ఫారిసీ మెట్లు వ్రాయంగఁ బనికివచ్చు
ఫణితులేమేని యున్నచో బయటఁబెట్టు
మంతియే కాని కవనదాహమ్ము దీర్ప
మంచునీళ్ళలయని కోపగించె నొకఁడు.

ఇట్టు లెగబడువారిఁ గన్నెత్తిచూచి
అంగడిని సర్దుచున్ సెట్టి "యన్నలార!
దండమిడుదును నన్నుఁ బోనిండు లెండు
మందుమాకు లీ యంగడియందు లేవు.

కవితాలతాంగికిఁ గర్ణభూషణ మైన
        కలువ మీచేఁబడి నలిగిపోవు
మీకృతికన్యల కీ కుందనపుఁ దళ్కు
        నగలు కై సేయు పుణ్యమ్ము గలదె
ఈవలిగాడ్పు మిమ్మావహించిన దవ
        జ్వాల లీనునెకావి సౌఖ్య మిడదు
తీయని యీ గండుగోయిలగానమ్ము
        వెగటాయె నౌర మీ వీనుగవకు

ఈతుషారజలమ్ము మీ చేతులంటి
మలినమైపోయెఁ, గొనకున్న మానె పొందు
సుకవిభోగ్యమ్ము లిచట వస్తువులు వీని
నలిపివేయకుఁ డటునిటుఁ గలచివైచి.

ఎఱుగక వచ్చినాడ క్షమియింపుడు వేఱొక పేటయందు నే
ర్పరులు గలారు వారు నను రమ్మని మాటికిఁ జీరుచుందు రేఁ
బొరపడి వీనినమ్మెదనుబో! తమబోంట్లకు లాభమేమి? నా
సరకులపేరుకూడ జెడుఁ జా"లని సాగె మఱొక్క చోటికిన్.

# సంక్రాంతి

దినకరుఁడు శాంతుఁడై తోచె దినము లింత
కుఱుచలయ్యెను జలిగాలిచుఱుకు హెచ్చెఁ
బొలములన్ రేల గ్రుడ్డివెన్నెలలలోనఁ
గుప్పలన్ నూర్చుకాపులు గొంతులెత్తి
పదములన్ బాడఁదొడఁగిరి; పచ్చపూల
జనుపచేలకు ముత్యాలసరులుగూర్చి
మిరపపండ్లకుఁ గుంకుమ మెరుపుఁ దార్చి
బంతిపూవుల మొగము లల్లంత విచ్చి
మనగృహమ్ముల ధాన్యసంపదల నిల్పి
సరసమధురమ్ము పుష్యమాసమ్ము వచ్చె.

కోడితో మేలుకొని తానమాడి నుదుటఁ
దిరుమణియుఁ దిరుచూర్ణముఁ దీర్చిదిద్ది
యొక్కకేలను దంబుఱ, నొక్కకేలఁ
జిఱుతలం బూని నున్నని శిరముపైని
తొలఁగకుండ నక్షయపాత్ర నిలిపి, మేలు
కొలుపులంబాడి వీధి వీథులను దిరిగి
యనుపదమ్మును 'రంగరంగా' యటంచుఁ
గడపగడపకు నేగి భిక్షమ్ముఁ గొనుచుఁ
జేరవచ్చెను సాతానిజియ్య రదుగో.

మేలుకొనుమమ్మ నాతల్లి! మేలుకొనుము;
తల్లి వేసినముగ్గు చెదరకమున్నె
గొబ్బిళులు చెల్లితోఁ బెట్టుకొందుగాని,
బంతిపూవులు, ముద్దచేమంతిపూలు
చంద్రకాంతమ్మలును, సన్నజాజిపూలు
కోసి యొడినింపుకొని తెచ్చుకొందుగాని
తల్లిరో! దొడ్డిలోని సీతాఫలమ్ము

కోసి యిచ్చెద రమ్మ కుంకుమముఁ బసపు
గొబ్బెమ కలంకరించి మ్రొక్కెదువుగాని,
నిన్నుదీవించు గొబ్బెమ్మ కన్నతల్లి!

తమ్ముఁడా! రమ్మ గంగెదు దాసుఁ డదుగొ,
వెండిబిళ్ళల మొలత్రాడు దండకడెము
ముక్కునఁ బైడికాడయు మోమునందుఁ
బంగనామమ్మలును, వెంట గంగిరెద్దు
చేత మునికోల తనపేరు సెప్పుచుండ
నూరి నడువీథి నాడుచునుండె రమ్మ.

డోళ్ళచప్పుళ్లు, మంగిలికోళ్ళపాట
లదర శ్రీరామునకును సీతమ్మ నిచ్చి
పెండ్లిఁగావించుచుండె నా వేడ్కఁజూచి,
కానుకల నిచ్చివత్తము కదలిరమ్మ!

# తొలిపూత

కార్శ్యమును జెంది, బడలికఁ గనులు మోడ్చి
మేను మఱచిన జగముల మేలుకొలుపఁ
గోకిలాకాహళము నూఁదికొనుచు, శీత
లానిలోపచారమ్ముల నమృతకలశ
హస్తుఁడై నూత్నచైతన్య మనువుపరుప
సాగె, నదె పుష్పసమయైంద్రజాలికుండు.

కనులు నులుముచుఁ బ్రకృతి యంగకము లల్ల
నల్ల సవరించుకొనుచుఁ బాయంగఁద్రోచి
ముసుఁగు, విడిజారుకొప్పును ముడిచికొనుచుః
బడలికలువాయ లేచి నిల్వఁందొడంగె;
నిదురచొక్కులు గన్పడనీక మేను
గరగరికసల్పి చివురంచు కట్టుపుట్ట
మును మడతనిప్పి కై సేసికొనఁదొడంగె.
కలకల న్నవ్వుచప్పుడే తలుపుదెఱచి
వాకిటన్నిల్చి తాయత్తపడి నెబాసు :
స్వాగతము నీకు వాసంతి! స్వాగతమ్మ.

వాకు విప్పవె నీవింక కోకిలమ్మ!
పాటకత్తెవు నీవెకా పలుకవేమె?
సూర్యకిరణపథమ్మునఁ జూపవలవ–

దెఱుగమే మేము - నీమేని గరగరికలు
వెడలి రమ్మింక సిగ్గుల పెండ్లికొడుక !

పాటకుఁడ వౌదువెమ్మ బంభరుఁడ ; రేపు
మొదలు తనివిసనంగఁ బాడెదవుగాని
వేగ దయసేయు మీ పెండ్లిపీటపైకి.

జగములకునెల్ల నానందసంవిధాయి
యగు వసంతుని తొలిచూలు ముగుదతనపు
ప్రథమయౌవనసుధ గ్రోలరాఁగదయ్య.

నీలమేఘుఁడ వీవు, మాబాల తళుకు
చిలుక తొలకరిమెఱుపు. మీ చెలిమికాఁడు
మలయపవనుండు నొక చోటఁ గలసియాడి
కాలగతిరహస్యము దెల్పఁ గడఁగుడింక.

పరిణయాగతద్విజకులవనితలార !
పలుకుజవరాలివీణతోఁ గలిపి యొక్క-
మంగళము పాడరమ్మ బంభరవరునకు
సకలసౌభాగ్యవతికి వాసంతికకును.

---

## అబ్బూరి రామకృష్ణరావు

ఎం. ఏ. పేసైనారు. ఆంధ్రవిశ్వవిద్యాలయములో లైబ్రేరియన్‌గా ఉద్యోగంచేస్తున్నారు. రంగస్థలాన్నిగురించీ, నాటక ప్రదర్శనాలనుగురించీ ప్రత్యేకకృషి చేశారు.

జననము 1896.

కృతులు: ఊహాగానము; పూర్వప్రేమ-మల్లికాంబ-నదీసుందరి

# పూజా శిరీషములు

పూజాశిరీషము లేరుకొంటివి
పోయి వచ్చెదో, జవ్వనీ!
తేజోవిలీన దృగంచలమ్ముల
తేరి చూచెద వెవ్వనీ?

ఆనందవస్త్రము లే కుమారుం
డల్లు తెల్లగ నల్లగా,
ధ్యానంపు హైందవగీతి నెవ్వం
డల్లు నల్లగ తెల్లగా?

ఆలింపు పాడెద నాంధ్ర తోమలి
యార్ద్ర హైందవగీతులన్,
పాలింతు నెల్లెడ భావపుష్పిత
నవ్య శయ్యారీతులన్ :

## అరవిందఘోషు

కొండలదండ శోభ కనుగో
    నిలువంబడి శ్రావణాంబువుల్
నిండుగఁ బొంగి బిట్టు ఱచు
    నిర్ఝరిణీ శ్రయ దూర్మికింకిణీ
తాండవము ల్వినంబడు
    విధంబున నో యరవింద! వింటి నె
న్నండో భగవద్గభీర కవన
    మ్మది నేడును కొత్తఁ గొల్పెడిన్ !

గుమ్మడిపూవు తేనియలకున్
    సరిపోవును నీదు ధోరణుల్
జిమ్మెడు మాధురుల్ ;
    రస నిషేవణము లుది నొందువేళ నా
కుమ్మడి నీ కడింది పలుకుల్
    వినిపించెద పంత పూవుచం
దమ్మున విచ్చు జన్మ మరణ
    క్షుభితాధిక జీవితావధుల్ !

పాడయి రాయచూరు విభవమ్ముల
నిల్చిన జీర్ణభిత్తికల్
పాడు నుదాత్త పూర్వకథలన్వలె,
నీ యెలజవ్వనమ్ము సం
పీడల నొందియున్ హృదయ వృత్త
శుభాశలు భగ్నమయ్యు. ఓ
నాడవ భారతీజననియం
దభిమాన మనోవిచారముల్ !

## మృతప్రేమ

ప్రోషితై రాలె హృదయసరోజదళము
లాకులితవై భవమ్ము చీకాకుపడగ,
వంచినముఖాన నేయెడ పొంచియుందు
వాకు కదలని నేటి మధ్యాహ్నవేళ ?
నైజరుచిరమ్ములగు స్రవంతీ జలమ్ము
లారిపోయిన లాతిబయళ్లవోలె
రిత్తయయిపోఁ దలంపుల మెత్తఁదనము
గిల్లుకొనిపోయి యేడ డాగికొనెదిపుడు ?

## బసవరాజు అప్పారావు

మద్రాసు ప్రెసిడెన్సీకాలేజిలో బి. ఏ. ప్యాసైనారు. కొంతకాలం ఆంధ్ర పత్రికకూ, భారతికీ సహాయసంపాదకత్వం వహించారు. తరువాతను బి. ఎల్. పేసయి బెజవాడలో ప్రేక్టీసుచేశారు.

జననం 1894—మరణం 1933

కృతులు: బసవరాజు అప్పారావు గీతాలు – సెలయేటిగానము – ఆంధ్రకవిత్వ చరిత్ర.

# తగనా?

దాసిగా నుంటకైన
తగనా ప్రాణేశ, దేవ? దాసిగా...

పాదమ్ములు నొచ్చినంత
పట్టుటకైనను దగనా? దాసిగా...

తలపై నీ పాదధూళి
దాల్చుటకైనను దగనా? దాసిగా...

వదనమ్మును గాంచి భక్తి
ప్రణమిల్లుటకుం దగనా? దాసిగా...

నిన్ను జూచి మదిని ప్రేమ
నిలుపుటకైనను దగనా?　　　　దాసిగా...

నా నాథుడ వీవె యనుచు
నమ్ముటకైనను దగనా?　　　　దాసిగా...

ఒరు లెవ్వరు జూడకుండ
నొక్కముద్దు గొనదగనా?　　　　దాసిగా...

పరవశమున నీ ప్రేమము
పాడుటకైనను దగనా?

దాసిగా నుంటకైన
తగనా ప్రాణేశ, దెవ?

## యశోధరా విలాపము

లేపనైనా లేపలేదే!
మోము
చూపనైనా చూపలేదే!
కోపకారణ మేమొ
యేపాప మెఱగనే!　　　　లేపనైనా లేపలేదే!...

హృదయ తల్పముపైన
సొద మరిచి హాయిగా
నిదురబోగే నన్ను
వదిలి పోయేవేళ!　　　　లేపనైనా లేపలేదే!...

మబ్బు కన్నెల కింత
ఉబ్బితబ్బిబ్బెలో ?
ఆకాశమున కంత
ఆనంద మెందుకో ?　　　లేపనైనా లేపలేదే!...

మాధవీలత కింక
మంటికౌగిలి యేన ?
మాపటింతల నింట
దీప మిక వెలిగేన !　　　లేపనైనా లేపలేదే!...

ద్వారమా ! నాథు
డే దారిబడి పాయెనే ?
కన్ని బాబా ! నీకు
కలలైన రాలేద ?
　　లేపనైనా లేపలేదే !
　　　　　　మోము
　　చూపనైనా చూపలేదే !

## వెఱ్ఱిపిల్ల

గుత్తొంకాయ్ కూరోయ్ బావా !
కోరివండినానోయ్ బావా !
కూరలోపలా నా వలపంతా
కూరిపెట్టినానోయ్ బావా !
　　కోరికతో తినవోయ్ బావా !

తియ్యని పాయసమోయ్ బావా !
తీరుగ వండానోయ్ బావా !
పాయసమ్ములో నా ప్రేమనియేటి
పాలుబోసినానోయ్ బావా !
బాగని మెచ్చాలోయ్ బావా !

కమ్మని పూరీలోయ్ బావా !
కర కర వేచానోయ్ బావా !
కర కర వేగిన పూరీలతో నా
కాంక్ష వేపినానోయ్ బావా !
కనికరించి తినవోయ్ బావా !

వెన్నెల యిదుగోనోయ్ బావా !
కన్నుల కింపానోయ్ బావా !
వెన్నెలలో నా కన్నెవలపనే
వెన్న గలిపినానోయ్ బావా !
వేగముగా రావోయ్ బావా !

పువ్వుల సెజ్జిదిగో మల్లే
పువ్వులు బరిచిందోయ్ బావా !
పువ్వులలో నా యవ్వనమంతా
పొదిపి పెట్టినానోయ్ బావా !
పదవోయ్ పవళింతాం బావా !

## స్వామి శివశంకరశాస్త్రి

తల్లావఝుల శివశంకరశాస్త్రి. సంస్కృతము, ప్రాకృతము, పాళీ, లేటిన్, ఫారసీకము, హిందీ, బెంగాలీ, కన్నడ భాషలలో పాండిత్యంగల వారు. సాహితీ సమితిని స్థాపించి, సాహిత్ర పత్రికను ప్రకటించారు. తరువాత సఖి పత్రికను ప్రకటించారు. నవ్యసాహిత్య పరిషత్తుని చాలాకాలం నడిపించారు. అసహాయోద్యమంలో జైలుకి వెళ్లారు. అస్పృశ్యతా నివారణకు యేర్పాటైన శ్రీ కృష్ణాశ్రమానికి అధ్వర్యం చేశారు కొంతకాలం. సరస్వతీ గ్రంథమండలికీ, ఆంధ్రప్రచారిణీ ప్రచురణలకీ గౌరవ సంపాదకులుగా వుండేవారు. తెలుగుభాషా సమితి సంపాదక వర్గంలోనూ, ఢిల్లీ సాహిత్య అకాడమీ తెలుగు సలహాసంఘంలోనూ సభ్యులు.

జననం **1892.**

కృతులు శివశంకర కృతులు—రెండుభాగాలు.

# హృదయేశ్వరి

ఈ హృదయదాహ మెట్టిదో యెరుకగలదె
నీకు హృదయేశ్వరీ, నేను నిన్నె నమ్మి
సకలము త్యజించినాను నిస్సంశయముగ
నను కటాక్షింతు వనుచు నేనాటికైన.
ఎవ్వరికి తావులేకుండ హృదయమెట్లు
ఆక్రమించితి వొక్కతెవక్కజముగ !

తియ్యని పాయసమోయ్ బావా!
తీరుగ వండానోయ్ బావా!
పాయసమ్ములో నా ప్రేమనియేటి
పాలుబోసినానోయ్ బావా!
బాగని మెచ్చాలోయ్ బావా!

కమ్మని పూరీలోయ్ బావా!
కర కర వేచానోయ్ బావా!
కర కర వేగిన పూరీలతో నా
కాంక్ష వేపినానోయ్ బావా!
కనికరించి తినవోయ్ బావా!

వెన్నెల యిదుగోనోయ్ బావా!
కన్నుల కింపానోయ్ బావా!
వెన్నెలలో నా కన్నెవలపనే
వెన్న గలిపినానోయ్ బావా!
వేగముగా రావోయ్ బావా!

పువ్వుల సెజ్జిదిగో మల్లే
పువ్వులు బరిచిందోయ్ బావా!
పువ్వులలో నా యవ్వనమంతా
పొదిపి పెట్టినానోయ్ బావా!
పదవోయ్ పవళింతాం బావా!

## స్వామి శివశంకరశాస్త్రి

తల్లావఝుల శివశంకరశాస్త్రి. సంస్కృతము, ప్రాకృతము, పాళీ, లేటిన్, పారసీకము, హిందీ, బెంగాలీ, కన్నడ భాషలలో పాండిత్యంగల వారు. సాహితీ సమితిని స్థాపించి, సాహితి పత్రికను ప్రకటించారు. తరువాత సఖి పత్రికను ప్రకటించారు. నవ్యసాహిత్య పరిషత్తుని చాలాకాలం నడిపించారు. అసహాయోద్యమంలో జైలుకి వెళ్లారు. అస్పృశ్యతా నివారణకు యేర్పాటైన శ్రీ కృష్ణాశ్రమానికి అధ్వర్యం చేశారు కొంతకాలం. సరస్వతీ గ్రంథమండలికీ, ఆంధ్రప్రచారిణీ ప్రచురణలకీ గౌరవ సంపాదకులుగా వుండేవారు. తెలుగుభాషా సమితి సంపాదక వర్గంలోనూ, ఢిల్లీ సాహిత్య అకాడమీ తెలుగు సలహాసంఘంలోనూ సభ్యులు.

జననం **1892.**

కృతులు శివశంకర కృతులు–రెండుభాగాలు.

# హృదయేశ్వరి

ఈ హృదయదాహ మెట్టిదో యెరుకగలదె
నీకు హృదయేశ్వరీ, నేను నిన్నె నమ్మి
సకలము త్యజించినాను నిస్సంశయముగ
నను కటాక్షింతు వనుచు నేనాటికైన.
ఎవ్వరికి తావులేకుండ హృదయమెల్ల
ఆక్రమించితి వొక్కతె వక్కజముగ !

స్మరణకు నతీతమౌ పూర్వజన్మమందు
విమల బాంధవ్య మేదియో వెలయు మనకు.
నిన్ను గాంచిన దాదిగా నేటివరకు
నిశ్చలమ్ముగ నీమీద నిలిచియుండి
బుద్ధి యన్యముఖంబుగా బోవలేదు;
దేవతా రూపిణివి నాకు కేవలమ్ము !

## ద్వాత్రింశత్

కాలమహాపగా విపుల
గర్భమునం బడిపోయె నేటితో
లీలమదీయ జీవనజలేజము
ముప్పది రెండురేకు, లీ
చాలుననే సమగ్రముగ సారస
పత్రము లొక్కటొక్కటే
రాలి, విలీనమై మరలిరావు
మహాప్రభు శాసనమ్మునన్
ఆరయగానరావకట, హర్షము
గొల్పుటకేని మన్మహో
దారకృతుల్ ! స్మరించిపరితాప
శిఖింగుములంగ నేనియున్
దారుణ కార్యముల్ మదికి దట్టవు,
జీవన పూర్వ భాగమం
దూరక దాటిపోయిన వహో యిటు
ముప్పదిరెండు వర్షముల్ !

ఎక్కువలేవు నే ననుభవించిన
లౌకికసౌఖ్య సంపదల్,
మొక్కలుపోయి దుఃఖముల మూర్ఛిత
మయ్యెను బుద్ధి, ఎన్నియో
గ్రుక్కలు జ్ఞాన భాండమున గ్రోలగ
నైతిని మందబుద్ధి ! నీ
యక్కరమాలిసట్టి బ్రతుకయ్యెయొ,
యెందులకో మహాప్రభూ !

ఇక్కడనుండి నేను త్యజియించితి
నాథ, సమస్త ధర్మముల్,
నిక్కపుభక్తి సేవలము నీపద
యుగ్మము నాశ్రయించితిన్
మక్కువతోడ నాహృదయ
మధ్యమునన్ వసియించి సంతతం
బెక్కరణీన్ నియోగముల నిత్తువో
అట్లు లొనర్చెదన్ ప్రభూ !

## ఆవేదన

ప్రీతిన్నాడు సుధా సమానమగు
కాఫీగ్రోలి ప్రత్యగ్ర సం
భూతోత్సాహముతోడ లేచితి
షికార్పోవం బ్రభాతంబునన్,

సద్దే మాత్రము చేయకుండ మృదు
రక్షల్ దాల్చి పాదంబులన్
అద్ధంబట్టులు నిద్దమై విశదమౌ
నధ్వంబు బ్రాపించితిన్.

చేతోమోద మెలర్పమారుతము
వీచెన్ మందమందంబుగన్ ;
వాతాందోళిత పర్ణనిస్వనితముల్
వ్యాపించె నల్వంకలన్.

బాలార్కా రుణదీప్తి భూతలముపై
బర్వెన్, విహంగౌఘముల్
ఆలాపింప దొడంగె మోహనముగా.
నవ్యక్త రాగంబులన్.

కొమ్మల్ కొమ్మలు దాకి దట్టముగ
న్యగ్రోధావనీజంబు లే
కమ్మై పచ్చనికాయ మానమువలెన్
గాన్పించె ద్రోవం జనన్.

ఆనందంబున గొంతసేపు చనగా
నామార్గ మధ్యంబునన్
కానన్వచ్చిరి వ్యాధ బాలకులు
వీకన్ ధ్యానముల్ సేయుచున్

ఆ రావంబుల కేమిహేతువనినే
నచ్చోట ప్రాపింపగా
క్రూరాకారులు మట్టుపెట్టిరొక
చిక్రోడమ్ము నొక్కుమ్మడిన్.

షోవం జొచ్చితిసాగి, కూసె
విహగంబుల్ శ్రావ్యనాదంబులన్,

పూవుల్ రాలెను, గాలివీచె, అయినం
బోయెన్ ముదం బంతయున్.

# జాషువ

గుఱ్ఱం జాషువ నాల్గవ ఫారంవరకూ ఇంగ్లీషు చదువు అయిన తరువాత, టీచరు ట్రెయినింగు పొందారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఉభయ భాషాప్రవీణ.........గున్నేశ్వర రావుగారు స్థాపించిన చింతామణీనాటక సమాజానికి నాటక రచయితగా నియమితులైనారు. కొంతకాలం మద్రాసులో యుద్ధప్రచారక శాఖలో పాటల ప్రచారకులుగా ఉద్యోగంచేశారు. గుంటూరు, గురుజాల, వినుకొండ, హైస్కూళ్లలో తెలుగు పండితులుగా వుండేవారు. ప్రస్తుతం మద్రాసు ఆలిండియా రేడియోలో 'స్పోకెన్‌వర్డు ప్రొడ్యూసరుగా' వున్నారు.

బిరుదులు: కవికోకిల, కవితాశారద, నవయుగచక్రవర్తి, కవి దిగ్గజ, మధుర శ్రీనాథ.

జననం 1895.

కృతులు: ఫిరదౌసి-స్వప్నకథ-ముంతాజ్‌మహల్-గబ్బిలం-ఖండకావ్యములు, 5 భాగాలు-నాకథ-బాపూజీ-నేతాజీ-స్వయంవరం-రాష్ట్రపూజ-నాలుగు నాటకాలూ, ఒక గద్య కావ్యమూ,

# శ్మశానవాటి

ఎన్నో యేండ్లు గతించి పోయినవిగాని యీ శ్మశానస్థలిన్
గన్నుల్ మోడ్చిన మందభాగ్యు డొకడైనన్ లేచిరా డక్కటా
యెన్నాళ్ళీ చలనంబు లేని శయనంబే తల్లు లల్లాడిరో!
కన్నీటంబడి క్రాగిపోయినవి, నిక్కంబిందు పాషాణముల్,

ఆకాశంబును కాఱుమబ్బుగము లాహారించె, దయ్యాలతో
ఘూకంబుల్ చెరలాడసాగినవి వ్యాఘోషించె నల్దిక్కులన్
గాకోలంబులు గుండె ఝల్లుమనుచున్నంగాని యిక్కాటియం
దాకల్లాడిన జాడలే దిచట సౌఖ్యం బెంత క్రీడించునో!

ఇచ్చోట నేసత్కవీంద్రుని కమ్మని
కలము, నిప్పులలోన గఱిగిపోయె?
యిచ్చోట నేభూములేలు రాజన్యుని
యధికార ముద్రిక లంతరించె?
యిచ్చోటనేలేత యిల్లాలి నల్లపూ
సలసౌరు గంగలో గలసిపోయె?
యిచ్చోట నెట్టి పేరెన్నికం గనుగొన్న
చిత్రలేఖకుని కుంచియ నశించె?

ఇది పిశాచులతో నిటాలేక్షణుండు
గజ్జె గదలించి యాడు రంగస్థలంబు
ఇది మరణదూత తీక్ష్ణమౌ దృష్టులొలయ
నవని బాలించు భస్మ సింహాసనంబు.

ముదురు తమస్సులో, మునిగిపోయిన క్రొత్తసమాధిమీద బై
బొదలు మిణుంగురుం బురువు పోలిక, వెల్గుచునున్నదివ్వె. ఆ
ముదముడివోయినన్, సమసిపోవుట లేదది దీపమందుమా?
హృదయముసుమ్మి, నిల్చనియెన్గతపుత్రిక. యేయభాగ్యయో.

కవులకలాలు, గాయకుల కమ్మని కంఠము, లీశ్మశానపుం
గవనుల ద్రొక్కిచూచెడి నొకానొకనా డల కాళిదాస భా
రవుల శరీరముల్, ప్రకృతిరంగమునం దిపు డెంతలేసి రే
ణువులయి మృత్తికం గలిసెనో కద! కుమ్మరివాని సారెపై.

ఆలోకించిన గుండియల్లరగు, నాయాపిల్ల గోరీలలో
నే లేబుగ్గలసౌరు రూపటియెనో ! యేముద్దు నిద్రించెనో !
యే లీలావతి గర్భగోళమున వహ్నిజ్వాల జీవించునో ?
యీ లోకంబున వృద్ధిగాదగిన యేయేవిద్య లల్లాడునో ?

ఇట నస్పృశ్యత సంచరించుటకు దావేలేదు, విశ్వంభరా–
నటనంబున్ గబళించి, గర్భమున విన్యస్తంబు గావించి, యు
త్కటపుం బెబ్బులితోడ మేక నొకప్రక్కన్ జేర్చి జోకొట్టి యీ
అట గల్పించు నభేదభావమును, ధర్మంబిందు గారాడెడిన్.

వాకొన్నరాని గొప్ప ధనవంతుని నిద్దపు బాలకాతి గో
రీకడ బారవేయబడి ప్రేలికలం బొరలాడుప్రేత, మే
యాకటి చిచ్చునన్ గుమిలి, యార్చి, గతించిన పేదవాని దో
నోకద ! వానికై వగవ దొక్కడు దాచదు కాటినేలయున్.

## శి శు వు

బొటనవ్రేల ముల్లోకములు చూచి లోలోన
నానందపడు నోరులేని యోగి
తల్లి దండ్రుల తనూవల్లరీద్వయికి వ
న్నియబెట్టు తొమ్మిది నెలల పంట
అమృతంబు విషమను వ్యత్యాస మెఱుగ కా
స్వాదింప జను వెఱ్ఱి బాగులాడు
అనుభవించు కొలంది, నినుమడించుచు మరం
దము జాలువాఱు చైతన్యఫలము

భాషరాదు, పట్టి పాలుమాత్రమె త్రాగు
నిద్రవోవు, లేచి నిలువలేదు:
ఎవరెరుంగ రితని దేదేశమో కాని,
మొన్న మొన్న నిలకు మొలిచినాడు.

గాన మాలింపక కన్ను మూయనిరాజు
అంబకౌగిట పంజరంబు చిలుక
కౌదమకండలు దేరుకొను పిల్ల వస్తాదు
యుయ్యేల దిగని భాగ్యోన్నతుండు
ఊఊలు నేర్చిన యొకవింత చదువరి
సతిని ముట్టని నాటి సాంబమూర్తి
ప్రసవాబ్ధి తరియించి వచ్చిన పరదేశి
తనయింటి క్రొత్త పెత్తనపు దారి

ఏమి పనిమీద భూమికి నేగినాడొ!
నడువ నేర్చినపిమ్మట నడుగవలయు
నేండ్లు గడచిన ముందు ముందేమొ కాని
యిప్పటికి మాత్రమే పావమెఱుగ డితడు.

నవమాసములు బోజనము నీరమెఱుగక
పయనించు పురిటింటి బాటసారి
చిక్కు చీకటి జిమ్ము జేవెడు బొట్టిలో
నిద్రించిలేచిన నిర్గుణుండు
నునుజెక్కుకలబోసినోటి నవ్వులలోన
ముద్దులు చిత్రించు మోహనుండు

అక్షయంబైన మాతృక్షీర మధుధార
　　　　లన్నంబుగా దెచ్చుకొన్న యతిథి

బట్టగట్టడు, బిడియాన బట్టువడడు,
ధారుణీ పాఠశాలలో జేరినాడు
వారమాయెనో ! లేదో ? మాప్రకృతికాంత
కఱపియున్నది పేని కాకలియు నిద్ర.

ఊయేల తొట్టి యే ముపదేశ మిచ్చునో
　　　　కొసరి యొంటరిగనూ కొట్టుకొనును
అంబతో తనకెంత సంబంధమున్నదో
　　　　యేడ్చి యూడిగము జేయించుకొనును
పరమేశ్వరుం దేమి సరసంబు లాడునో !
　　　　బిట్టుగా గేగిస గ్గొట్టుకొనును
మూన్నాళ్ళలోన నెప్పుడు నేర్చుకొనియెనో !
　　　　బొమ్మన్నచో జిన్న బుచ్చుకొనును

ముక్కు పచ్చలారిపోయి ప్రాయమువచ్చి
చదువు, సంధ్య, నేర్చి బ్రదుకునపుడు
"నాదు పసిడికొండ నారత్న" మని తల్లి
పలుకు పలుకు లితడు నిలుపుకొనునె ?

తనచేతి గిలకపండునకు ముచ్చట సెప్పు
　　　　బలుకులే దనుచు గోపంబు సేయు
పొరుగింటి యిల్లాలి సరస జీదరజెంది
　　　　పరు లన్న భేదభావమును జూపు

మకరందమునకు సమ్మతిజూపి నోరూరి,
దరిజేరి, రుచులభేదములు తెలియు
ప్రతిశబ్ద మీను నుగ్రధ్వాన మాలించి
కంపించి తల్లిని గౌగలించు

దాయ లార్గురు నొకరు నిద్దరును దప్ప,
చేరుకొన్నార లీతని చిత్తవీథి
జగతి నీతిని జాతకచక్రమందు
బొంచియుండున దప యశంబో యశంటో!

## శిల్పి

చేత మిగురొత్త నొక నల్లఱాతియందు
మలచినాడవు, భయద సింహముల తలలు
వసుధ గన్పట్టు సర్వపర్వతములందు
జిత్రముల నెన్నిగతుల జూచెదవొ! నీవు.

సున్నితంబైన నీచేతి సుత్తెనుండి
బయలువడె నెన్ని యెన్ని దేవస్థలములు
సార్థకముగాని యెన్ని పాషాణములకు
గలిగె నీ నాడు పసుపు'గుంకాలపూజ.

కవికలంబున గల యలంకారరచన
కలదు కలదోయి శిల్పి! నీ యులిముఖమున

గాకపోయిన తెనుఁగాతికంబలములకు
గుసుమవల్లరు లేరీతి గ్రుచ్చినావు ?

ప్రతిమలు రచించి యొక మహారాజు చరిత
వల్లె వేయింపగలవు చూపరులచేత
గవనమున జిత్రములు గూర్చు కవికి నీకు,
దారతమ్యంబు లే దబద్ధంబు గాదు.

ఱాల నిద్రించు ప్రతిమల మేలుకొలిపి
యులినిసోకించి బయటికి బిలిచినావు
వెలికిరానేర్చి, నీ పేరు నిలుపుకున్నె
శాశ్వతుడవోయి నీవు నిశ్చయముగాను.

తలయెత్తెన్ గద, నీదుచాతురి యజంతాగహ్వరశ్రేణిగో
వల పాషాణములందు, జీవకళ నిల్పంజాలు నీసుత్తెలో
మొలుచన్మానవవిగ్రహంబులు మహాపుణ్యుండవయ్యా ! హరి
త్తులు, నీబొమ్మలచెంత, ముగ్ధగతినంచున్, శిల్పికంఠీరవా !

నునుపుల్ దీర్చి, మదంబుచిందిపడనేస్తున్ గున్నలన్ జెక్కవై
చిన చాతుర్యము నీ శిరోగ్రమున నిల్చెన్, సత్కిరీటాకృతిన్
తెనుగుదేశము నిన్నువంటి పనివానింజూచి, యుప్పొంగుచుం
డును నీలేమిం దలంచి కంటదడిబెట్టున్ శిల్పవిద్యానిధీ !

తెలిఱాతన్ జెలువార వచ్చరపడంతిం దిద్ది యా సోగక
న్నులపజ్జన్ నిను నీవు దిద్దుకొని, సంతోషించుచున్నాడవా !
భళిరే ! శిల్పి ! జగంబులోన జిరజీవత్వంబు సృష్టించుకో
గల నీకెవ్వడు సాటివచ్చును ? నమస్కారంబు నీప్రజ్ఞకున్.

# కవికొండల వెంకటరావు

---

బి. ఏ బి. యల్. పాసయ్యారు. అడ్వొకేట్‌గా రాజమండ్రీలో ప్రాక్టీసు చేస్తున్నారు.

జననం: 1892.

కృతులు: ప్రకృతీపాంచజన్యము – విశాలవిశ్వము – నెలబాలుడు – అంగడపలు – ప్రకృతిచందనము – ఆత్మవ్యక్తి – చిట్టికైత – చదువులదుత్త – పొట్టి రచికలు—వాలుజడలు (కథలు)—జనుపకోట (నవల)

## నావపై పిల్ల

పదినిండ నీరున్నదీ - నావపై పిల్లున్నదీ
పిల్లాకు వొళ్లున్నదీ - వొళ్లెల్ల వయసున్నదీ
ఏటికి మేటెక్కడా ? - గోటికి దాటైన చాల్ !

చిన్నాది పూదేనెరా - కవటాకులో ఈనెరా
పూన్నామినెల బరణిరా - ముమ్మొదట నారాణిరా
నీతోటి ఏమన్నదీ ? నాతోటి రమ్మన్నదీ.
మాటంటె బోటోనిదీ - అనకుంటె గోటోనిదీ
గొంతుకలొ పాటున్నదీ - అంతాట ప్రజ్ఞున్నదీ
ఎంత కూ సిగ్గంటునే - వింతకూ మొగుతుంటదీ,

చీకట్లో కేకడతదీ - కేకెడుతూ కిందడతదీ
ఏకాడ తడు మూదురా ? - ఆకన్నె అతిలేతరా !
పీకాను కాలేతునో? - పయ్యంట చెయ్యంతునో ?

ప్రేమూడి ప్రాణాముగా - మానామెడా నాడిగా
ఊపిరి ముందాడెరా - ఆపైని రూపాడెరా !
ఓపాటి స్త్రీగాదురా - నాపట్ల అతిసాధురా !
కళ్ళల్లో ముద్దెట్టుతూ - తెల్లార నీ నంటదీ
తెల్లారిపోతుంటె తా - నెల్లాగొ అయిపోతదీ
ఒక్కళ్ళమై యున్ననూ - నక్కితా నలు సొతదీ.

ఊదేస్తె గాలౌతదీ - రోడిస్తె నభమౌతదీ
దరితీస్తె నీరౌతదీ - బరిగీస్తె ధరణౌతదీ
పొగకట్టి కగ్గౌతదీ - ఇగనాకు దారేదిరా ?

మా యిద్దరీ మధ్యనూ - బాలార్కు డుదయించుటా?
బాలార్కు డుదయించి తా-మార్తాండుడై మండుటా ?
ఏనాటి వెలుగోపలెం - ఆపక్క నీడాపలేం.

మేమిద్దఱం మేలుకో - పక్షుల్లు కావార్చుటా ?
కావార్చి కావా చ్ఛవే - కోవెలల దటి మేయుటా ?
చీమంత రొదసాగలెం - కూనంత క్రుధ వేగలేం.

ఒకనాటి దైతేమిరా - ప్రకటితముగా వీడతాం
మొగమోటమనిపిల్ల నా-నగు పెదవి పేర్చెక్కిపో
కల్యాణమని పాడతాం - విశ్వ - కల్యాణమని ఆడతాం.

## ఒకానొక పువ్వును జూచి

రంగు రంగులుగల చిన్ని దొంగపూవ!
పూయుదువు నీవు మఱుమూల పొలముకంచె,
కత్తనారకమ్మలపయి నెత్తుప్రాకు
కొంచెతీగను, నుయ్యాల కులుకుతోడ
నూగుదువు నీవు! నల్లమబ్బాగి యాగి
నీపయిని వాన కురియింప నేత్రపర్వ
మగుదు! నీదు పేరెమి? యేమంద్రు నిన్ను?

వేసగిని నిన్ను చూడరు; వ్రేళ్ళకంట
నీదులత యెండిపోయెదు; పాదుతెలియ;
దింతలో నెట్లు మొలిచి పుష్పించి తొక్క!

నిరుడు మొలిచిన తావున నియతిమీఱ
చినుకు చినుకున కొకవింత చెలువుదాల్చి,
మెఱపుటుఱుముల నొకవింత యొఱపునిల్చి,
చల్లగాలికి పడిపడి నుల్లసిలుచు,
నవ్వుచున్నావు! జనపద నవ్యశోభ
వానకాలంపు గ్రొంగ్రొత్త పైరు కలిమి
నూత్నభావంబు లేమి వినోదముగను
ఆకలింపగ నవ్వుచున్నావు పూవ!

నీదు పేరెవ్వరెఱుగరు, నేరడకట!
పసుల కాపరియైన నీపసలు! నీవు
విడిచి వడి రాలిపోయిన సడి యెఱుంగ

డొక్కరుడు! - ఇంక నేర్వంగ నుర్వివెందు
ఉందురో? చిన్నిపూవ! నీ యూహలెన్ని?

ఊహలెన్నియో లేకున్న ఊరకిట్లు
మొలిచి విలసిల్లి గాలికి ముదముగొనుచు
చినుకు చినుకాలకించుచు చిన్మయమటు
శోభనందగింతువటె? సత్పుమమ! నీవు!

## దాక్కొనివుంటాయి

దాక్కొనివుంటాయి - దారంట - గడ్డి - ని
రక్కొనివుంటాయి—
తలపగ రానిపూలు
పిలువగ బోనిపూలు
నిలుపగ లేనిపూలు
దాక్కొనివుంటాయి - దారంట - గడ్డి - ని
రక్కొని వుంటాయి—

గ్రుక్కెడు వాన నీళ్ళకు
పక్కన నవుతాయి;
ఉక్కగ గాసంతుంటే
త్రొక్కట పడతాయి
దాక్కొనివుంటాయి - దారంట - గడ్డి - ని
రక్కొనివుంటాయి—

ఔక్కకురా, వోలక్ష!
చిక్కవు మాలను గ్రుచ్చ,
ఇక్కడ నక్కడ బచ్చ
జక్కన బూస్తాయి.
డొక్కని చూస్తాయి - దారంట - గడ్డి - ని
రక్కని కూస్తాయి—

ఒక్కడ నడుస్తూవుంటే,
చుక్కలు పొడుస్తూవుంటే,
మక్కువ కూర్చోమంటాయి
ఎక్కడొ యెందుకొ చెప్పవు
డొక్కనివుంటాయి - దారంట - గడ్డి - ని
రుక్కనివుంటాయి—

మంచు బిందువుపడిన,
ఎంచి బాష్పమువిడిన,
అంచుల గాస్తాయి;
వంచక మోస్తాయి;
డొక్కనివుంటాయి - దారంట - గడ్డి - ని
రుక్కనివుంటాయి —

## విశ్వనాథ సత్యనారాయణ

---

యం. ఏ. పాసయ్యారు. సంస్కృతభాషలో మంచి పాండిత్యంవున్నది. తెలుగులో అనేక రచనలు చేయడమేకాక సంస్కృతంలో కూడా నాటకాన్ని రాశారు. బెజవాడ కాలేజీలో ప్రస్తుతం తెలుగు లెక్చరర్‌గావున్నారు. కవి సామ్రాట్ అని ఈయనకు బిరుదు.

జననం : 1895

కృతులు : పద్యకావ్యాలు, పది–చిన్న నవలలు, పది – పెద్ద నవలలు, పన్నెండు – నాటకాలు, ఆరు – రామాయణం.

# చిన్ని తలపు

ముదురాకు రాలేటి ముదిమి నాళులలోన
తొడిగేటి చివురాకు పడుచు పొద్దులలోన
ఆకునైనా కానుగా,

అయినచో

సోకేది చిఱుగాలి నన్ను
మెల్ల, తాకేది మిణుగురుల పెన్ను.
మొగిలు కన్నెలగుంపు దగదగని మెరిసేటి
చిగురువన్నెల కావి సొగసు సంజలలోన
మొగిలునైనా కానుగా,

అయినచో

ఎగిరియుందును వింటికొనల
మెల్ల, తగిలియుందును వెల్లుసొనల.

తొలిప్రేమ రుచిచూచు నెలప్రాయంపుం గన్నె
తలిరుమెత్తని బేల వలపులో తలపులో
ఊహనైనా కానుగా,

ఆయినచో

వలచేది నను చిన్న = చూపు
మెల్ల, కలచేది చివురాకు తూపు.

# కిన్నెరసంగీతము

కోనలన్నీ ముంచుకొనివచ్చు సెలయేటి
చాన కిన్నెరసాని జలజలా స్రవియించు
తరగలో, పైకెగయు
నురుగులో, క్రొంగ్రొత్త
తేనె కాలువలూరెనో - అమృతంపు
వాన చినుకులు జారెనో !

తేనె తరగల పిండుతోన జలజలసాగు
చాన కిన్నెరసాని జాలైన మేలైన
వాకలో, అందాల
రాకలో, బంగారు

జిలుగుగంటలు మ్రోగెనో - చిన్నారి
బిగువు నవ్వుల సాగెనో!

తేనెలై కలకండ సోనలై వానలై
చానకిన్నెరపాట సాగులాడుట చూచి
చివరలో, చివురొత్తు
సవురులో, క్రొమ్మావి
వింతగా సిగ్గందెనో - కోకిలా
గొంతులో కద లాడెనో!

చెఱకు పానక మెఱ్ఱ జీరపాకమువోలె
తరుణి కిన్నెరపాట తారులాడుట చూచి
పువ్వులో, లేసంజ
రువ్వులో, దానిమ్మ
తెల తెల్లనయి పోయెనో - క్రొంజిల్క
పలుకులో పసదప్పెనో!

ప్రొద్దుకాకల జారిపోవు మంచునుబోలె
పొలతి కిన్నెరపాట పొంగిపోవుట చూచి
నీటిలో, కిన్నెరా
సాటిలో, అడవిలో
తోగుల్లు పారాడెనో - క్రొంజలువ
వాగుల్లు సాగాడెనో!

పికిలిపిట్టల యీలలను క్రొత్తసాటిగా
సకియ కిన్నెరపాట జరగులాడుట చూచి

సాములో, చిఱువెచ్చ
జాములో, మెల్లగా
పగలు పులకలుపొందెనో - మల్లెలా
సొగసు వెలుగులు చిందెనో !

## రా ధి క

నాకు నీలోన గలసియుండని శరీర
మొకడు కలిపించి నన్ను నెంతకు విధించె
ప్రకృతి దౌర్బల్యమకట యీ పాడుదేహ
మడ్డు నిలచెను మనదు ప్రేమైక్యమునకు
అకట! నాలుకరాదు మాటాడనైన
పార్వతీశంకరులె కొంతవరకు ధన్యు
లా మహాత్ములకును దేహమందునైన
గలిగె నైక్యమ్ము భేదమ్ము తొలగకున్న
పరులెఱుంగక భేద మేర్పరుపరాక
నీకు నాకైన భేదమ్ము నిర్ణయింప
రాక నిజముగా భేదమే లేకయుండ
గలిసిపోదము ప్రేమపు గడ్డవోలె
పాలునీరమ్ము కలయికవోలె పలుచ
దనము మాత్రము రాకయంతకు గడింది
ప్రేమము నిరంతరము ఘనీభవించునట్లు
కలసిపోయెడుగతి ననుగ్రహము చూపు

కలసిపోవుట యయ్యును కలసిపోయి
నట్టి భావమ్ము కనరాక నైక్యమన్న
మాటకు మన యిర్వురి సంగమమ్ము నందు
బోలు నన్వర్థమే లేకపోవుగాక

కలసియుంటనె యెడబాటువలన గలుగు
వేదనాదుఃఖము ననుభవింపజేయు
నీ మనోహర రూపమ్ము నించుగాత
మవధి మీఱిన దివ్యకృపాంబుచయము

బిగికౌగిళ్ళకు విరహపు
బొగలకు దరిలేని ప్రేమపూరము పొంగున్
జిగిపల్కులకును నందని
దగు సంబంధంబు మనకు నమరెడుగాతన్

## నండూరి వెంకటసుబ్బారావు

బి. ఎల్. పాసయిన తర్వాత ఏలూరులో అడ్వొకేటుగా వుండేవారు. బి. ఎల్. పూర్తికాక పూర్వం కొంతకాలం ఉపాధ్యాయులుగా వుండేవారు.

జననం: 1895 - మరణం - 1957

కృతి: ఎంకిపాటలు.

# నా యెంకి

నన్నిడిసిపెట్టెల్లినాడే
నారాజు,
మొన్నె తిరిగొస్తనన్నాడే!

నీలు తేబోతుంటె, నీతోడె—వోలమ్మొ!
నా యెంటె యెవురోను నడిసి నట్టుంటాదె!
నన్నిడిసిపెట్టల్లినాడే,
నారాజు...

అద్దములో సూత్తుంటె అది యేటొ సిగ్గమ్మొ!
నాయెనక యెవురోను నవ్వినట్టుంటాదె!
నన్నిడిసిపెట్టెల్లినాడే,
నారాజు...

సల్లన్ని యెన్నెట్లొ సాపేసి కూకుంటె—
ఒట్టమ్మీ - వొల్లంత ఉలికులికి పడతాదె!
నన్నిడిసిపెట్టెల్లినాడే
నారాజు...

నీత్తైనవోడె, నారాతెట్టగుంటాదొ!
కళ్లల్లో సత్తెముగ కట్టినట్టుంటాడె!!!
నన్నిడిసిపెట్టెల్లినాడే,
నారాజు,
మొన్న తిరిగొస్తనన్నాడే!!!

## కనుబొమ్మ

నన్ను తలుసుకు యెంకికన్నుమూయాలి!
కనుబొమ్మ సూడాలి!
కరిగిపోవాలి!

నన్ను కలలో సూసి నవ్వుకోవాలి!
కనుబొమ్మ సూడాలి!
కరువుదీరాలి!

నిదరలో సిగపూలు సదురుకోవాలి
కనుబొమ్మ సూడాలి!
కమ్మగుండాలి!

పిలుపేదొ యినగానె తెలివిరావాలి!
కనుబొమ్మ సూడాలి!
కతలు తేలియాలి!

# గోవు మాలచ్చిమి

గోవు మాలచ్చిమికి కోటిదణ్ణాలు,
మనిసికైనా లేని మంచిపోకిళ్లు !

యెంకితో కూకుండి
యింత సెప్పుతుంటే,
తనతోటి మనివల్లె
తల తిప్పుతాదీ !
గోవు మాలచ్చిమికి కోటిదణ్ణాలు...

యెంకి సరసాలాడ
జంకుతావుంటే,
సూసి సూడక కన్ను
మూసి తెరిసేది !
గోవు మాలచ్చిమికి కోటిదణ్ణాలు...

కోరి కూకుని నేనె
పోరుపెడుతుంటే,
తల్లిడివు పిల్లల్లె
తెల్లపోతాదీ !
గోవు మాలచ్చిమికికోటిదణ్ణాలు...

నాయని సుబ్బారావు

---

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో బి. ఏ., బి. ఇడి. డిగ్రీలు పొందారు. కొంత కాలం అసహాయోద్యమంలో పాల్గొన్నారు. చాలాకాలం నరసారావుపేట హైస్కూలులోనూ, ప్రస్తుతం తిమ్మసముద్రంలో హైస్కూలులోనూ హెడ్మాస్టరుగా పనిచేస్తున్నారు.

జననం : 1899

కృతులు : సౌభద్రుని ప్రణయయాత్ర — మాతృగీతాలు.

## విశ్వరూపము

ప్రథమసందర్శనముననే ప్రణయమూర్తి
నాదు కనుపాపలందు సంధానమయ్యె
నది సురుగకుండ నారెప్ప లదుముకొంటి
క్రమముగా నది నాయంతరమున నిండె.

అంత భరియింపలేక నాయక్షియుగ్మ
మల్ల తెఱచితినో లేదొ యంతరమున
ప్రతిమ బ్రహ్మాండగోళమ్ము పట్టలేదు
నేను నిలువను తావు సుంతైన లేక.

ఆ ప్రణయరాశి విశ్వరూపప్రకాశ
మునకు నంధుడనై నేను మూలమూల
లొదుగుకొని పోవుచుంటి నన్నుద్ధరింప
తలపు గొనదది తనలోన కలుసుకొనదు.

## అవధి!

విచ్చిన శరన్నిశీధినీ వేళలందు
బయలుప్రాకిన తారకా స్వప్నకథలు
నాకు దుస్సహమైనవి నీకు జెలిమిఁ
కత్తె యౌట గదా చలిగాలి విసరు.

ఈ చలి వియోగ రాజ్యంపు టెల్లబోలు
నీమనసు మూలమూలల నిదురవోవు
ప్రణయమకరంద మాధుర్యమున లవమ్ము
సంతరించుక వచ్చెనా చాలు నాకు.

అలసిపోతిన యేనాటి కంతులేని
కాలచక్రంపుటాకుల కదలికలకు
ప్రణయ నీహారశీక రార్ద్రమ్ము నీదు
దృగ్విలాసమ్ము నను సేదదేర్చునెపుడు.

ఎంతయుత్నించి వెలుగలేదింత హృదయ
దేవళమ్మున దీపావళీ వలయము
స్నేహపూరమ్ము పొంగు నీ చిన్నిమేను
క్షణము మెఱసిన నట ముట్టుకొనునొ యేమొ.

చికిలి పూదేనెలకు తుషారకణములకు
నేమి సంబంధ బాంధవ్య మీశరత్ప్రి
భాతవేళా వికాసి పుష్పముల కోసల
కలసికొన్నవి ప్రణయ శృంగార మొలయ.

## మాతృగీతము

ఏను స్నానమ్మునకు బావి కేగునపుడు
లేత సూర్యుని బంగరు పూతలందు
మురియుచును తల్లి యొడ్డును ముద్దుగొనుచు
'అమ్మ యేదిరా'యన్న వా యలలు నన్ను.

పైని వేంచేసి యూపిరి పట్టుకొనుచు
చిన్ని తాబేలు నన్ను వీక్షించి జలము
త్రవ్వుకొను చేగె కూపగర్భమున దాగ
పై నలముకొన్న సుళ్ళు నాపాల విసరి.

'నీకు లేదమ్మ' యన్నది నీటిపాము
పైకెగసి యొక్క కప్పను పట్టుకొనుచు
'నాకు లేదమ్మ' యన్నాను శోకవహ్ని
తప్తహృదయుండనై యింటి దారిపట్టి

## కృష్ణశాస్త్రి

దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి బి. ఏ. పేసైనారు. కొద్ది సంవత్సరాలు పెద్దాపురం, పిఠాపురం హైస్కూళ్లలో ఉపాధ్యాయులుగా వున్నారు. రఘుపతి వెంకటరత్నం నాయుడిగారి ఆప్త శిష్యులు కావడంవల్లను సంఘ సంస్కార ఉద్యమాలలో అభిలాష కలిగింది. అస్పృశ్యతా నివారణ, కళావంతుల సంఘ సంస్కరణవంటి ఉద్యమాలలో పాల్గొన్నారు. తరువాత నవ్య కవిత్వాన్ని చాలా ప్రచారం చేశారు. సాహితీ సమితిలోనూ నవ్యసాహిత్య పరిషత్తులోనూ అధ్వర్యం వహించారు. చాలా రేడియో నాటికలు రాశారు. మల్లీశ్వరి మొదలు ఫిల్ములకు మాటలూ పాటలూ రాశారు. ప్రస్తుతం హైదరాబాదు అలిండియా రేడియోలో స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసరు.

జననం: 1897

కృతులు: కృష్ణపక్షం - ఊర్వశి; ప్రవాసం - మహతి - బుగ్వీధి - కన్నీరు.

## ఉమార్ ఖయ్యాం

రావెసాకీ, సాకీ, రాగవీధుల నడచి
కడచి చలివేళ పొలిమేర ఆమని పొడిచె!

రాగ బుల్ బులు గొంతు మ్రోగించు బాకా;
సోగ విరితీగ తెగతూగించు జూకా;
జాగా గులాబి పొద నూగును బులాకీ,
ఆగకిక సాకీ

...రావె

దురుసు మనుగడ రెక్క తొడిగి కోగా,
దరిసె మృత్యువుకోర లొరసిరాగా,
వెరచి సీజరు సికందరులు పోగా

...రావె

తళుకు జల్తార్ బుటాలల్లిన
నీల వలయ మ్మీ గుడారం,
చాల సుఖద మ్మీ బిడారం,
పరం అపరం తెలియు జాలం
ప్రస్తుత మ్మీటనే బిచానా,
ఇంతలో ఎటకో రవానా !
మౌల్ శరీ జాయీ గులాబీ
మేల్ జూహీ చంపా చమేలీ
మనకు చుట్టాలీ హవేలీ !

ఒక్క షా్రయీ, పక్క ప్యారీ
అవనియంతా మా గువిస్తాన్
అతిథి శాలయె మాకు బూస్తాన్,
చేయి చెయి, మెయి మేయి తగిలిచి
చెంతనే వుండాలి ప్యారీ
చెలియయే మాపాలి హౌరీ!
పూవులోపల మధువు లుంటే
తీవ తీవ వయారి సాకీ
తీర్చువేగ సుకాల బాకీ !

పాచ్చా జలాల్ ప్యారీ జమాల్
మలు సంచె వెన్నెలవోలె ఝాటా,
మనకు సత్యం మధువు లోటా !
ఏరిరా బైరాం, హాతీం, కైకుస్రు, రుస్తుం అల సికందర్.
పారెరా సమ్రాట్ సీజర్,
నిన్నరాబో, వెళ్లి రాలేదన్నమాటే సిసలు ఖయ్యాం,
ఉన్న రోజే మనది హయ్యాం !

## పి లు పు

నాటి ఆమని తరువాత తోటలోన
పాటలో మేలుకొన్న స్వప్నములు మూగె,
పాటల పలాశములు నా గవాక్ష వీథి
నానయనములనుండి నాలోన నిండె;

ఎంత మెత్తని యడుగుల నేగు దెంచినావొ
నా కయి, నా కుటీరాజిరమున
" నేను రావచ్చునా " యన్న పిలుపు వి
నంబడదు, నాటి యూహాంగణముల జొచ్చి ;

పోయెనా కోయిలలకారు, పోయెను నవ
మల్లి కలవేళ, శ్రావణమ్మొ శరత్తు,
మూల మూలల ఈ పర్ణశాల నేడు
హిమ పదాంకములే తల లెత్తి పిలుచు ;

జీవితము మృతిగా, సుప్తశిలగ గుండె,
గొంతు చీకటిగా, మాట కొసరి రాక
" నీవు రావోయి " యని పిల్వనేర కిపుడు
" నేను రాతే " నటం చెద్వనైన లేను !

# మధు పాత్ర

వేబోక విరియు, నెచ్చెలులార, ఇనుడెగయు,
లజ్జావతియుషస్సు రజతనీహారాంశు
కాంచలమ్ముల మౌక్తి కాంసమ్ము కప్పికొను,
ప్రాభాత కల ధౌతపాత్ర తెండో చెలులు!

హిమ పాండు రమ్మయ్యె సుమలత కపోలమ్ము,
ఉదయవాసితమయ్యె వసుధా సుధా పనము,
అమర సీమా కోమలానిలమ్ములు వీచె,
త్రాగుడా మరల నూతన వినోదయ వేళ!

మరకతాసనముపై కొలువున్నది గులాబి
పరచి రుజ్వల విపుల శాద్వలంపు తివాసి,
అరుణ మందారమో అనల ప్రవాళమో
మధువు, సాకి, మధువు! మసల దీ తొలిప్రొద్దు!

ఏల, ఈ మధుశాల, ఏరు మూసినవారు ?
చాలు, ఈ ప్రొద్దునా సాల మూయ గలారు ?
హేకవాట విపాటకా, కృపాళూ, వేడు
వార మీ ద్వార మీ వే తీయుము నేడు!

అద్భుత మ్మన్యాయ మక్కటా మాధ్వీక
మందిరద్వార బంధన మేల శుభవేళ ?
త్రాగుడా యిట ఈ గులాబి పాదరింటిలో
సాగు జీవన జీవనమ్మె ఈ యూటలో!

ఈ గారడీ పాత్ర, ఇది, సికిందరు ముకుర,
మిందు ప్రతి బింబిత మ్మి విశ్వవలయమ్ము ;
ఈ మంత్రి తాకులకు ఇది విచిత్రమ యమ్ము,
ఇందు క్రోలగ దొరకు విశ్వ విజ్ఞానమ్ము !

అరుణ సుమవల్లిలో, అరుణ మాధ్వీపాన,
మరుణోదయమ్ములో అరుణా ధరాస్వదన,
మిట్టి పూవుల నంటి ఏ మధువ్రత మాను,
ఇట్టి జీవికలంటి ఏ చక్రవర్తి మను ?

మరల, హాఫీజ్, మరల, మధుపాత్ర, మధుపాత్ర,
మరి మరి ప్రియాననాన్వేషణోత్సవయాత్ర !
ఏనాడొ ఏవింత సీమలోనొ తొలంగు
నీ క్షమా దృఢ హస్తముల నే సఖి మునుంగు !

## వేదుల సత్యనారాయణశాస్త్రి

సంస్కృతము, బెంగాలీ భాషలలో పాండిత్యం ఉన్నది. ఉభయ భాషా ప్రవీణ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. ముప్పై సంవత్సరాలు ఉన్నత పాఠశాలల్లోనూ ప్రస్తుతం కావలి కళాశాలలోనూ ఆంధ్రోపన్యాసకులు.

గౌతమీకోకిల అని వీరికి బిరుదు.

జననం: 1900

కృతులు: దీపావళి - నవలలు: అపరాధిని, ధర్మపాలుడు, రంగమహలు - నాటకాలు: రాణాప్రతాప, ఆయేషా, ప్రేమవిజయము.

# సుధాకరా!

ఓయి సుధాకరా! నిలువు మొక్క నిమేషము; నీ మహోదయ
చ్ఛాయలు సోకి నా యెడద సాగరమట్టులు పొంగుచున్న దే
వో యను భూత జీవిత సుఖోర్మ్ములపూర్వ విముగ్ధనాట్యముం
జేయుచు బాడుచున్నవి వినిర్మల మోహన రాగ గీతికల్.

నా కిపు డీ ప్రపంచ మొక నందన మట్టులు నీయునంతలో
కైక పవిత్ర కాంతి సుధలందున విచ్చిన మూగ సోయగం
బై కనుపట్టె; మానవుల యాశలతో విధికిన్ నిరంతరా
నీకము సాగు నీ కటికినేల మనోజ్ఞత యింత నిల్చునే ?

ఈ యది మోదమో, యెడద నేర్చెడు ఖేదమొ, యంతలంతలై
పోయెడు మోహమా, తొలగిపోవని స్వప్నమొ, చెప్పలేని దే
దో యనుభూతి దివ్య పవనోర్మి పరీమళమట్లు ముగ్ధునిం
జేయుచు నుండె నన్నిపుడు నీ తెలికాంతుల కౌగిలింతలన్.

నీ వొక యప్సరః ప్రదాయినీ కబరీచ్యుత పారిజాతమా
లా విసరంబవో, మఱి యిలా తలమంట సుధాతుపారవ
ర్షా విమలావ కుంఠనము జార్చుచు బోవు శరద్విభావరీ
దేవి లలాటికామణివొ, దీపికవో సురరాజ్య లక్ష్మికిన్.

ఆలసట జెందెదేమొ, యుదయాస్తమయమ్ములె జీవనమ్ముగా
దలచెడు మర్త్యపాళి కమృత ప్రభలన్ వెదజల్లి యింత సొం
పు లొలుకు వెన్నెలం గనులు మూయని పేదలకై కృపారసం
బొలికెడు నీ సుధామురళి నూదుదువో భువనాలు సోలగన్.

చిర విరహైక వాసనల జిమ్ము సుఖస్మృతులేవొ పైపయిం
బొరలుచు, దుఃఖపుంగసటువోవని యాశల మేలుకొల్పు సుం
దర తరచంద్రికా పులకితమ్ముగు నింతటి తీయనైన రా
తిరి తెలవారి పోవక యిదేగతి నా కయి నిల్వరాదొకో !

ఓ యమృతాశ్రు మూర్తి! యెటకో పరువెత్తుదు వాయులీనమై
పోయెడు రాగ రేఖవలె, మోయగరాని ప్రవాస దుఃఖమో,
తీయని ప్రేమ వేదనయొ, తీరని కోరికయో, యెదో యెదం
గోయునొ యేమొ రాల్చెద వనూన హిమాశ్రుకణాల నా వలెన్.

విరిసిన పూల వెన్నెలల వెల్లువ జక్కదనాల హంసవై
యరిగెడు నిన్ను జూచు నిశలందున నా కగు బాష్పశాంతి నీ
వెరుగుదు; దుఃఖ తాపముల కిల్లగు పాడు ప్రపంచమం దెరుం
గరు కరుణైక ముగ్ధుల యగాధ హృదంతర బాష్ప మాధురిన్.

ప్రేమ పిపాసచే నమృత వీధుల జేరిన యప్సరోంగనా
స్తోమసితాప గుంఠన తతుల్ సుమి యీతెలిమబ్బు దొంతరల్
నీమృదు శయ్యలై సుధలు నిండిన నీస్మితరోచిరూర్మికా
కోవల ఫేనరాసులయి కూర్చెడు నాయెద కింత వేదనన్.

నేను నిరంతర ప్రళయ నిష్ఠుర మీ బ్రదుకున్ భరింపగా
లేను, క్షుధాగ్ని నార్పుకొనలేక తపించెడు ప్రేమకాంక్ష యిం
తేని నశింప కుంట మరణింపగ లే నిటులే నిరోధముల్
లేని మహాప్రవాహము చలింపగ నిల్చిన దొక్క నాయెడన్.

ఆ మృదు చంద్రికా యవనికావృత నీల నభోనిశాంత శో
భామయసీమలం దమృతవాటుల స్వప్నపథాల నొక్క యీ
యామిని మాత్రమే తిరుగులాడెద నే జిఱుమబ్బువోలె నీ
తో మనసార, నొక్కపరి దోడ్కొనిపొమ్మట కో సుధాకరా!

# పెంపుడు నెమిలి

మేదుర వినీల మేఘాల మేలిముసుగు
వేసికొని వచ్చె శ్రావణ మాస లక్ష్మి
ధారుణి ధరించె దొలకరి సారె యిడిన
యార్ద్ర పురుగు పూవుల శాద్వలాంబరమ్ము.

కడిమి పూల నెత్తావుల కసటువార
వృష్టిముందటి తడిగాలి వీవసాగె
ఎల యింతటి చక్కదనాలవేళ
నెగురులాడ రెక్కలు రావు హృదయమునకు.

నే డిదేమో మా పెంపుడు నెమలి కొదమ
గోఁత మదురున మెడ రాచుకొనునె గాని
యురుము లురిమెడు మబ్బుల తెరువుకేసి
చూడఁబోవదు పురివిప్పి యాడఁబోదు.

ఆడకున్నను మానె గొంతైన విప్పి
కేకవేయు దాశల గిలిగింత లడర
కోడెత్రాచుల నరగించుకొనగ జాలు
ప్రకృతి కెటుగల్గెనో యెడబాటు బరువు.

కన్ను తడియని మూక శోకమున ముంచి
నన్ను వెతనొంచె నీ పెంచుకొన్న ప్రేమ
వానకారు నృత్యము చూడ వాంఛగొన్న
నా యెద ప్రవాస వేదనాచ్ఛాయ లలమె.

కుండపోతగ వర్షమ్ము గురిసెనేని
తేలిపోవును పో మింటి నీలి ముసుగు
కాని, యెదలోని విరహదుఃఖంపు బరువు
తీరు టెట్లు నాకేని, మయూరికేని.

## ఒక క్షణము

పండి వ్రాలిన వరిపైరు పైని ప్రాకి
వచ్చు చిరుగాలి తరగల వరుసవోలె
ఈ మహానంద పులకిత హృదయమందు
బరుగు లిడుచుండె వింత భావమ్ము లెన్నొ.

ఇంత యానందమున కేది హేతువనుచు
వెనుదిరిగి చూచుకొంటి - కెంబెదవులందు
జిఱునగవు జీరుకాడ నీ చిగురుగేల
నా భుజమ్ము స్పృశించి యున్నావు నీవు.

ఎపుడు గుర్తించినదొ నీ యదృష్ట పూర్వ
భవ్యరూపమ్ము నీ కరస్పర్శ మాత్ర
నపుడె పులకించి పులకించి యుపశమైన
నా యెద గ్రహించె నీ వాత్మ నాథుడవని.

మఱపు దట్టిన కాలమ్ము మడతలందు
పాడువడనట్టి బహుజన్మ పరిచయమ్ము
నా మలిన బాష్ప గుంఫిత ప్రేమ సూత్ర
కలితమై నీ పదమ్ముల గౌగిలించె.

ప్రకృతి సౌధపు దక్షిణద్వార మంత
దెరచుకొని వచ్చి మనల నిర్వారను గూడ
మృదుల పవమాన పరిమళోర్మికల తోడ
బాధ లేకుండ బంధించివైచి రెపరొ.

ఆ దృఢాశ్లేషమున భేద మంతరించి
యొక హృదయ మొక్క ప్రాణమైయున్న యపుడు.
ప్రేయసీ యని ప్రాణప్రియా యటంచు
పలుకరించు కొంటిమి బాష్ప భాషణముల.

అప్పుడు నిర్మేఘ మార్గశీర్షాభ్రవీధి
వృద్ధసంధ్యా తపస్విని పెదవి విరచె
విశ్వవీణా గళము నీరవించి పోవ
గ్రమ్ముకొనె మృత్యుకైశిక కాళిమంబు.

మనము దిన సంధ్యలము, కూడుకొనుచు నుందు-
మొక క్షణమ్మె ఛాయారోచిరు దయవీధి
అయిన నేమాయె, మన వియోగైక్యము లనె
యొదవు ప్రేమదేవతకు రేయుం బవళ్లు.

కొడాలి ఆంజనేయులు

---

ఇంగ్లీషు, సంస్కృతం, హిందీ భాషలతో మంచి పరిచయమున్నది. రెవిన్యూశాఖలో ఉద్యోగానికి రాజీనామాయిచ్చి అసహాయోద్యమంలో పాల్గొన్నారు. నాలుగుసార్లు జైలుకు వెళ్ళారు. హరిజన సేవాసంఘానికి, ఆంధ్రరాష్ట్ర రాజకీయబాధితుల సంఘానికి అధ్యక్షులు. డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు రచించిన కాంగ్రెసు చరిత్రను తెనుగుచేశారు.

జననం: 1898

## దేవుడు

సిద్ధ సంకల్పుడైన యే శిల్పి అమృత
హస్తములలోని ఉలితాకినంత మాత్ర
లోహములు గ్రావములు దారు లూహగనునొ
అతడు మలచిన తొలికారు ప్రతిమ వీవు.

మిన్ను మన్నును కలిసిన మేఱకడచి
కనెదు ప్రత్యగ్ర దృగ్విలక్షణము గలుగు
నా కళామూర్తి స్వర్ణశలాక నీకు
చిలికె యుగ యుగమ్ముల వోని జీవకళలు.

ఈ చరా చరా ఖిల లోక మెవనిగీతి
లీనమగుచుండు నతని కల్యాణ నాద
కవిత రోదోంతరాళ రేఖా విభూతి
చిర విశిష స్వరూప మిచ్చినది నీకు.

ఆగతానాగతాది వృత్తాంత మెవని
అక్షర మరంద బిందు మాలాభిలీన
మతని కావ్య సంజీవనీ లత యుగాంత
ములకు పోని యూపిరిపోసి కొలుచు నిన్ను.

ఎట్టి సుముహూర్తమందు భావింపబడితొ
ఈ ప్రపంచ మానవలోక మెంత దనుక
ఆశయును. భీతియును వీడదంతవఱకు
నిన్ను పదచ్యుతుచేయ నెవ్వనికి కాదు.

## అంధబాలిక

అంధురాలను దివ్య నిశాంత సమయ
పరిమళానిల మార్గముల్ పట్టిపోదు
త్వత్పదాబ్జ సేవాపరత్వమున జేసి
జీర్ణతృణ కుటీరాంగణ సీమవిడచి.

చిగురు వెన్నెల లేత పచ్చిక బయళ్ళ
మధుర నీహారముల మాటు మణుగువేళ
వలపు పిల్లనగ్రోవి పాటలకు నేను
వెదురు పొదరిండ్ల రొదలలో వెదకి కొందు.

గొల్ల పడుచుల చెదరిన కుంతలముల
జారిపోయిన అడవి గన్నేరు పూల
తావులంబట్టి నడచెద తాపకీన
ప్రణయ పదరేఖ మలచు భూభాగములకు.

త్వద్గళమ్మున నాగర ప్రమద విడిన
స్వర్ణ కర్పూరమాలానిసర్గసౌర
భముల త్రోవలంబడి పోవవలతు నేను
ప్రేమపూజాసుమాన్వేష హృదయ నగుచు.

నీ మనోహర రూపమ్ము నీ మనోజ్ఞ
వేణుగానమ్ము కీర్తించి వెల్లివిరియు
విమల యమునా తరంగ నాదముల చాయ
చనెద నిబిడీ తమాల వృక్షముల నీడ.

## జైలులో

భావమున పొంగిపొరలు చింతావియోగ
సాగర తరంగఘోషల జాలివడని
కొండఱాతి గోడలమధ్య కూరుచుండి
కడుపుచుంటిని కటికిచీకటుల నిశల.

ప్రణయ మధురమ్ములగు ప్రియురాలి కనుల
కొలకులను వేడి నీరెప్పు డొలుకగంటి
నకట! చల్లని చందమామకును నాకు
నాటనుండి ఋణానుబంధమ్ము దీరె.

ఏవియో స్వప్నగత పూర్వ వృత్తములను
తలచుకొని కొన్ని అర్ధరాత్రముల లేచి
కనులు పొడుచుకొన్నను గాని కానరాని
కారుచీకట్ల కన్నీటి కడిగివైతు.

నాకు నడిరేయి మింటికి నడుమనపుడు
కటికఱాల కప్పాక ట్టు కాదయేని
జాలి గుండెలు గలుగు నక్షత్రగణము
లెంత దుఃఖించి యుండునో యెవని కెఱుక ?

కనుకెఱుంగని ప్రియురాలి కనులలోన
కృష్ణపక్ష నిశీథమ్ము లెన్నియేని
కలసిపోవుచున్నట్లు కలల గాంచి
ఉలికిపడి లేతు రాత్రివేళల నొకప్డు.

మేను బంధింప బడుగాక, దాన నేమి
కాలి సంకెల లటునిటు కదలకుండ
కడపితి ప్రియావియోగ దీర్ఘమ్ము లైన
అర్ధరాత్రుల స్వప్న ప్రయాణములను.

తనువు కదలక యున్నను మన సదేమొ
పూర్వ పరిచిత పుణ్యభూములను చూడ
నదుల వాగుల వనుల కొండలను దాటి
మెఱపు మెరసిన విధమున పరుగులెట్టు.

పగటివేళల నా క్షేమవార్త యొకటి
పంపగ దలంచి యొక పిచ్చివాని వగిది
కాళిదాసుని దివ్యమేఘమ్ము కొఱకు
కలయ వెదకుచునుందు నాకసమ్ము నెల్ల.

రెండు సంవత్సరము లొంటరిగ ప్రవాసి
నగుచు నెన్నియో ఆకాశ హర్మ్యములను
కట్టుకొంటిని నా చిన్ని కొట్టులోన
నే కిరీటాధిపతులవి యెక్కగలరు ?

జీవితపు దండలో రెండు పూవులు సుడి
గాలి తాకున రేకులు రాలిపోయి
నట్టులయ్యెను కారాగృహాన నేను
కడపినట్టి రెండు వసంత కాలములును;

భీకర విషాద వీచికల్ వెల్లివిరియు
నీ గభీరకాల సముద్ర మింక నెన్న
డే నమూల్య రత్నముల పండించు ననుచు
కాచుకొని యుంటి దైవ యోగమ్ము కొఱకు.

## దువ్వూరి రామిరెడ్డి

దువ్వూరి రామిరెడ్డి తమ 20 వ యేట కవితారంగంలో ప్రవే శించారు. స్వయంకృషితో బహుభాషలలో పాండిత్యం గడించి, కర్షకజీవి తము కవితావస్తువేనని నిరూపించారు.

జననం : 1895 - మరణం 1947

కృతులు : కృషీవలుడు, పానశాల, యువకస్వప్నము, జలదాంగన, నక్షత్రమాల.

## స్మృతి కణము

కనులు మూసినఁ దెఱచినఁ గానుపింతు
వింట నడయాడినట్టులె యిందువదన!
సంతత ధ్యానలీనమౌ స్వాంతమునకు
వెలుఁగు జీఁకట్ల భేదంబు దొలఁగునేమొ!
తెల్లవాఱినఁ బాదంతఁ దీసివైవఁ
దరుణివేణిక నిలుచు నెత్తావి పోల్కి,
మర్త్యమౌ నీ స్వరూపము మాటువడియు
సారవర్ణాంకిత స్మృతి సమసిపోదు.
చావు బ్రతుకుల మధ్య విశాలమైన
కలల వంతెనగట్టితి తలిరుఁబోణి;
కార్యలంపట దినమున కన్నుఁ బ్రకృతి
ముసుఁగుఁదీసెడి రాత్రి నా కొసఁగుఁ బ్రియము.

పవలు రేయికిఁగల భేదబాంధవములె,
యిహపరంబులయందు నూహింపఁగలము;
రెంటి కూడలియగు సంజ, మింటికొనల
విమలరాగంబు వొదజల్లు, వెలుపునిడదు.

## ఆగంతుకి

చాలు లజ్జా మధుర వినయము!
ఏల యవగుంఠనము వైచెదు
పూలదండలు గట్టియున్ మెడఁ
గీలుకొల్పక కేలఁ జిదిపెదు

శోభినీ,
యప్సరః కామినీ!

సందెవేళలఁ బూలతేకులు
క్రింది కురలఁగఁ గాంచి కాంచి మ
రందబిందులు కన్నుఁ దమ్ములఁ
జిందఁ బొగిలెదు ప్రకృతి చేష్టకు,

కామినీ.
సుందరగామినీ!

పలుకరించినఁ బలుకవేమొ!
పులుకుఁ బులుకునఁజూచి, చూపుల
వెలువరించెదు లలితహృదయా
విల కఠోరవ్యసన భారము!

ఏలనే?
మౌనంబేలనే?

ఎపుడు మౌనవ్రతవు టుద్యా
సపు దినంబులువచ్చుఁ గోమలి,
యెపుడు విరియునో మూకసందే
శపు నిలీన రహస్యభావము;

పోలునే,
చింతస చాలునే!

తేలివచ్చెడి కల విధంబునఁ
గాలి యడుగులు సందడింపక
యేల వచ్చితి వీ వసంత వి
నీల గగనచ్ఛాయ నొంటిగఁ?

బలుకవే,
భావముఁ దెలుపవే!

చీఁకటులు బలమయ్యెఁ; జుక్కల
రాకపోకల నేల తలఁచెదు?
నా కుటీరమునందు వెన్నెల
సోఁకి తమము నశింప దీపము

పెట్టవే,
నామది ముట్టవే.

## రాధయుత్కంఠ

చల్లని పన్నీట జలకంబులాడి
యగరు ధూపము వెట్టి యలకంబులార్చి
నుదుటఁ గస్తురిబొట్టు కుదుటుగాఁ దీర్చి
కన్నుఁ దమ్ములఁ గ్రొత్తకాటుక దిద్ది

గోరంట పూగుత్తి కొప్పునం దురిమి
కమ్మతావుల నీసు కలపంబు నలఁది
పాడి కప్పురంబులఁ బడకింటఁ జల్లి
పాన్పుపైఁ బువ్వులు పఱపుగాఁ బఱచి
యేల రాఁడో సామి యింకేల రాఁడో
యనుచుఁ బొరము నానుకొని వేచియుంటి.

*　　　*　　　*

స్వాంతమాలస్యంబు సైరింపలేక
వేదనాభరమున వ్రీలఁగజొచ్చెఁ
గని కని దారులు కన్నులు నొచ్చె
నా సామి కృష్ణుండు ననుఁగాంచరాడు
సంజ కెంజాయలు శమియించిపోయెఁ
బక్షులు గూళ్లకుఁ బరుగిడసాగె
మందలకాపులు మరలిపోయెడిని
వేణుగానంబులు వీనుల సోఁకె
కోయిల క్రొమ్మావి గుబురులోఁ గూసె
సందె చీకటి పొగ చదలావరించెఁ
జుక్కల రనగుండ్ల జోపంబు లలరె
నేల రాడో కృష్ణుఁ డింకేల రాఁడో !

*　　　*　　　*

కప్పురపుం దివ్వె కడముట్టవెల్గె
బాన్పుపైఁ బువ్వులు వసి వాళ్లు వాడె
మంచి గంధపుఁ బూతమైఁ జిట్లిపోయె.

నిద్ర మాంద్యమ్మున నేత్రము ల్మొగిడెఁ
బడమటిదెస కేఁగు నుడుగణంబులను
గనుచు ద్వారముకడఁ గన్ను గూర్చితిని.

* * *

నా సిగు పుచ్చంగ నలినబాంధవుఁడు
వెయ్యి దివ్వెలతోడ వెలుఁగుచు వచ్చె,

* * *

కూర్కు లేమిని గన్నుఁగొన లెఱవాఱ
బొరలు చిటీన మేనిపూఁతలు రాల
జెమ్మట ముత్యాలు చెక్కిళ్ళ జాఱ
ఘల్లు ఘల్లని చేతిగాజులు మ్రోడు
మజ్జిగ జిల్కుచు మధురగీతములఁ
గాంతుఁ దొనర్చిన కఠినంపుఁ జేఁతఁ
తుమ్మెదపైఁ బెట్టి దూఱుచునుండ
నా ముద్దు కృష్ణుడు నావెన్క నిలిచి
ముసిముసి నవ్వుల మురియుచునుండె.

* * *

వేచియుండినయప్డు విభుఁ డరుదేఁడు,
వేసవి వానల విధముగా నతఁడు
కల వలె వచ్చును గనిపించిపోవు.

బసవరాజు రాజ్యలక్ష్మమ్మ. ప్రఖ్యాత కవి బసవరాజు అప్పారావుగారి సతీమణి. విదేశవస్త్ర బహిష్కారయత్నంలో పికెటింగుచేశారు. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారు. నాలుగేళ్లు గుంటూరు శారదా నికేతన విద్యార్థినీ వసతి గృహానికి మేనేజరు. తరువాత మూడేళ్లు వార్ధా మహిళాశ్రమంలో శిక్షణపొందారు. తిరిగి వచ్చి శారదా నికేతనంలో మేనేజరుగా ఉన్నారు. పిమ్మట వ్యష్టి సత్యాగ్రహంలో జైలుకు వెళ్ళారు. తదనంతరం బొంబాయివద్ద బోర్విలిలో మహిళా సేవా శిక్షణ శిబిరంలో శిక్షణ. పిమ్మట, బొబ్బిలిలోనూ సీతానగరంలోనూ కస్తూర్బా ప్రసూతి చికిత్సా శిక్షణశిబిరాలకు వార్డెనుగావున్నారు. మొన్నటివరకూ మద్రాసు హిందీ ప్రచారక మహిళా విద్యాలయ హాస్టలు వార్డెనుగావుండి, ప్రస్తుతం మద్రాసులో హిందీ ప్రచారకులుగా వున్నారు. కన్నడం, గుజరాతి, మహారాష్ట్ర, హిందీభాషలతో మంచి పరిచయం వున్నవారు.

జననం: **1904**

# గుర్తులు

సూర్యుండు పడమటా క్రుంకేటివేళ
నా నాధు డింటికి వచ్చేటివేళ
చంద్రకాంతం పూలు పూచేటివేళ
నా నాధు డింటికి పచ్చేటివేళ!

ఆవు లంబా యనుచు అరిచేటివేళ
నా నాథు డింటికి వచ్చేటివేళ
బీరల్ల పూవుల్లు పూచేటివేళ
నా నాథు డింటికి వచ్చేటివేళ!
అరుణోదయమ్ము వేళను
ఆకసమున బారె పిట్ట
లానందముగను బాడుచు
మంగళగీతములతోను !
పారిజాత పూవులన్ని
పడిపోయెను పాదులలో
పుణ్య భరతభూమిపైన
పూలక్షతలు చల్లినటుల !
నే నిటులే గడుపుచుంటి
నీవు లేని జీవితమ్ము,
నొంటిగా విసిగివేసట
నావికుడు లేని నావవలె !

## పారవశ్యము

మా పెరటను పెరుగుచున్న
వేపనీడ ఎండవేళ
చల్లదనము హాయి నొసగు
చల్లని వెన్నెల రాత్రుల!

చేరి యచట, నాథుడేక
తార మీట, నే పాడుచు
తేలియాడ ! హాయిలోన
తెలియక రాతిరి గడచెను !

## అడివి బాపిరాజు

---

బి. ఎల్. పేసయి కొంతకాలం భీమవరంలో ప్రేక్టీసుచేశారు. అసహాయోద్యమంలో పాల్గొన్నారు. తరువాత బందరు ఆంధ్ర జాతీయ కళాశాలకు ప్రిన్సిపాలుగావున్నారు. ఫిల్ము పరిశ్రమలో కళాదర్శకత్వం వహించారు. హైదరాబాదులో మీజాన్ పత్రికకు సంపాదకులుగా పనిచేశారు. చిత్రకళలో ప్రఖ్యాతి సంపాదించారు.

జననం : **1895** – మరణం **1952**

కృతులు : తొలకరి - గోధూళి - శశికళ - రాగమాలిక - తరంగిణి - నారాయణరావు - హిమబిందు-తుపాను - గోనగన్నారెడ్డి - కోనంగి- నరుడు - అంజలి - అడవిశాంతిశ్రీ - మధురవాణి - రాతిరథము.

# లేపాక్షి బసవయ్యా

లేపాక్షి బసవయ్యా లేచిరావయ్యా,
కైలాస శిఖరిలా కదిలి రావయ్యా!

హుంకరించిన దెసలు ఊగిపోయెను
ఖురముతో దువ్వితే కులగిరులెవణికేను లేపాక్షి

ఆకాశగంగకై అర్రెత్తి చూస్తేను
పొంగేటి పాల్కడలి గంగ డోలాడేను లేపాక్షి

నంది పర్వతజాత నవ పినాకిని జలము
నీ స్నాన సంస్పర్శ నిలువునా పులకించు                    లేపాక్షి

ఒంగోలు భూమిలో, పెనుగొండసీమలో
నీ వంశ మీనాడు నిలిచింది గర్వాన                    లేపాక్షి

## అ వ త ర ణ ము

నీలిమిను పవళింపు
నిదురించు నీ సొంపు
తేలిపోతూ దిగెను
వేలతే వెలిగేను!

తొంగిలించే వయసు
నింగినంతా బలిసె
బంగారు మంచాన
పవళించె నీ సొగసు!

తెలికొండపై గంగ
తేలి వాలిన రీతి
తెలివి నా తలపుగిరి
తేలివాలితి నాతి!

నిత్యవికసిత దేహ
నృత్యవిలసిత హాస
నిదురించు నినుకోరి
పదము మొదలిడినాను!

జన్మ జన్మల రాణి
తన్మయుడనే జాణ
మేలుకొలుపులు నిన్ను
జాలిగా పిలిచెనటె!

అలనల్ల నాడించి
అరవిచ్చె నీ కనులు
దరిసినది నీ సొగసు
విరిసినది నా మనసు!

విరుచుకొను నీ మేను
వికసించు కల్పకము
ఆత్రమై ఆశతో
చిత్రమై దరిసేను!

వాలు చూపుల చూచి
మేలుకొనె నీ వలపు
తొలిపొద్దు కిరణమై
చెంగలువ అరుణమై!

జాళువా పాన్పుదిగి
బాల వయ్యారివై
మ్రోల నిలిచితివటే
మోకరిల్లితి నేను!

ఎవ రెవరి హృదయాలు
ఏమి కాంతించెనో,
ఎవ రెవరి భావాలు
ఏమి కాంక్షించెనో!

## చావలి బంగారమ్మ

---

సహజమైన కవిత్వ ధోరణిగలవారు. భావాన్ని అనుసరించి భావం పరుగెడుతుంది. సులువుగానూ, సుఖంగానూ పలికే విచిత్రశక్తి వున్నవారు.

జననం: 1897

## నీడ

అందాలు తానె చూసింది,
నీటిలో చందాలు తానె చెప్పింది
నాతోటి,

వొడ్డున్న మందార వొంగి బెట్టుట్టుకొని
అందాలు తానె చూసింది !

సొగసెల్ల చూసేను సొమ్మసిలిపోయేను,
చెట్లంటి పాములే చెరువెల్లపాకేయి,
అందాలు తానె చూసింది!

ఆ వింతల్ని చూసింది,
అప్పుడే ఆకాశ మడలిపోయింది
గజగజావొణకి తా గట్లపై కొరిగింది,
సూర్యుడే చెట్టెక్కి చూడ భయపడ్డాడు;
అందాలు తానె చూసింది !

జుట్టెల్ల విరియబోసింది
మందార బొట్టిట్టె చెదిరి రాలింది
గట్ల గుండెలుకలగ, మెట్లకన్నులు చెదర-
వొంగున్న మందార వొంగియేవుండి ఆ
అందాలు తానె చూసింది,
నాతోటి
మందార మాట లాడింది!

## కార్తికపూర్ణిమ

పక్షుల్లు పలుకకే పడియుండినాయి,
వృక్షాలు చూచుచూ వూరకున్నాయి,
తనవెంట పడుతున్న
తరుణిజూడ డిదేమి!
పోతువున్నాడు తాను,
అదుగదుగొ పొంగులో కాలు గనను!

గాలి ఉయ్యాలలై కదులుతుండెడి మబ్బు
కనుల కడ్డమురాగ, కాలైన తడబడక,
పోతువున్నాడు తాను!
తనగర్వపొంకములు దెలుపుతూను!

వాద్యములు వినబడవొ, చోద్యములు కనబడవొ
నిముసంబు నిలువ దేనీడ నిలుచునొ గాని,
పోతువున్నాడు తాను!
గర్వంపు పొంగు బోకారిపోను!

పక్షి కలకలములే పరిభవం బనియెంచి,
తెల్లబోయిన మోము తెలియకుండుటకునై,
పోతువున్నాడు తాను!
తనువెల్ల తారుమా రగుటచేను!

## శ్రీ శ్రీ

శ్రీరంగం శ్రీనివాసరావు బి. ఏ, పేసైనారు ఇటీవల రష్యా, యూరోప్ దేశాలు పర్యటనం చేశారు. ఫిల్ములకు పాటలూ, మాటలూ రాస్తున్నారు.

జననం : 1910

కృతులు : ప్రభవ - మహాప్రస్థానం

# దేశచరిత్రలు

ఏదేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం ?
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం.

నరజాతి చరిత్ర సమస్తం
పరస్పరాహరణోద్యోగం :
నరజాతి చరిత్ర సమస్తం
రణ రక్త ప్రవాహ సిక్తం.

బీభత్సరసప్రధానం,
పిశాచగణ సమవాకారం !
నరజాతి చరిత్ర సమస్తం
దరిద్రులను కాల్చుకుతినడం.

బలవంతులు దుర్బలజాతిని
బానిసలను కావించారు:
నరహంతలు ధరాధిపతులై
చరిత్రమున ప్రసిద్ధి కెక్కిరి.

రణరంగం కానిచోటు భూ
స్థలమంతా వెదకిన దొరకదు:
గతమంతా తడిసె రక్తమున,
కాకుంటే కన్నీళులతో.

చల్లారిన సంసారాలూ,
మరణించిన జనసందోహం,
అసహాయుల హాహాకారం
చరిత్రలో మూలుగుతున్నవి.

వైషమ్యం, స్వార్థపరత్వం,
కౌటిల్యం, ఈర్ష్యలు, స్పర్థలు,
మాయలతో మారుపేర్లతొ
చరిత్రగతి నిరూపించినవి.

జింఘిజ్ ఖాన్. తామర్లేనూ,
నాదిర్షా, ఘజ్నీ, ఘోరీ,
సికిందరో ఎవడైతేనేం ?
ఒకొక్కడూ మహా హంతకుడు.

వైకింగులు, శ్వేతహూణులూ,
సిథియన్లూ, పారశీకులూ,
పిండారులు, థగ్గులు, కట్టిరి
కాలానికి కత్తుల వంతెన.

అజ్ఞానపు టంధయుగంలో,
ఆకలిలో, ఆవేశంలో—
తెలియని ఏ తీవ్రశక్తులో
నడిపిస్తే నడిచి మనుష్యులు—
అంతా తమ ప్రయోజకత్వం
తామే భువి కథినాథులమని,
స్థాపించిన సామ్రాజ్యాలూ,
నిర్మించిన కృత్రిమచట్టాల్—
ఇతరేతర శక్తులు లేస్తే
పడిపోయెను పేకమేడలై!
పరస్పరం సంఘర్షించిన
శక్తులలో చరిత్ర పుట్టెను.

చిరకాలం జరిగిన మోసం,
బలవంతుల దౌర్జన్యాలూ,
ధనవంతుల పన్నాగాలూ
ఇంకానా! ఇకపై చెల్లవు.

ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తీ,
ఒక జాతిని వేరొక జాతీ,
పీడించే సాంఘిక ధర్మం
ఇంకానా! ఇకపై సాగదు.

చీనాలో రిక్షావాలా,
చెక్‌దేశపు గనిపనిమనిషీ,
ఐర్లాండున ఓడ కళాసీ,
అణగారిన అర్తులందరూ—

హాటెన్‌టాట్, జూలూ, నీగ్రో,
ఖండాంతర నానా జాతులు
చారిత్రిక యథార్థతత్త్వం
చాటిస్తా రొక గొంతుకతో.

ఏ యుద్ధం ఎందుకు జరిగెనో ?
ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో ?
తారీఖులు, దస్తావేజులు
ఇవి కావోయ్ చరిత్రకర్థం.

ఈ రాణీ ప్రేమ పురాణం,
ఆ ముట్టడికైన ఖర్చులూ,
మతలబులూ, కైఫీయతులూ
ఇవి కావోయ్ చరిత్రసారం.

ఇతిహాసపు చీకటి కోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావా లిప్పుడు !
దా చేస్తే దాగని సత్యం.

నైలునదీ నాగరికతలో
సామాన్యుని జీవన మెట్టిది ?
తాజమహల్ నిర్మాణానికి
రాళ్ళెత్తిన కూలీలెవ్వరు ?

సామ్రాజ్యపు దండయాత్రలో
సామాన్యుల సాహస మెట్టిది ?
ప్రభువెక్కిన పల్లకి కాదోయ్,
అది మోసిన బోయీ లెవ్వరు ?

తక్షశిలా, పాటలిపుత్రం,
మధ్యధరా సముద్రతీరం,
హారప్పా, మొహెంజదారో,
క్రో-మాన్యాన్ గుహాముఖాల్లో —

చారిత్రిక విభాత సంధ్యల
మానవ కథ వికాస మెట్టిది ?
ఏ దేశం ఏ కాలంలో
సాధించిన దే పరమార్థం ?

ఏ శిల్పం ? ఏ సాహిత్యం ?
ఏ శాస్త్రం ? ఏ గాంధర్వం ?
ఏ వెల్గుల కీ ప్రస్థానం ?
ఏ స్వప్నం ? ఏ దిగ్విజయం ?

## భిక్షు వర్షీయసి

దారిపక్క, చెట్టుకింద,
ఆరిన కుంపటి విధాన
కూర్చున్నది ముసల్దొకతె
మూలుగుతూ, ముసురుతున్న
ఈగలతో వేగలేక.

ముగ్గుబుట్టవంటి తలా,
ముడుతలుతేరిన దేహం,
కాంతిలేని గాజుకళ్లు,
తనకన్నా శవం నయం.

పడిపోయెను జబ్బుచేసి;
అడుక్కునే శక్తిలేదు,
రానున్నది చలికాలం;
దిక్కులేని దీనురాలు.

ఏళ్లు ముదిరి, కీళ్ళు కదిలి,
బతుకంటే కోర్కె సడలి—
పక్కనున్న బండరాతి
పగిదిగనే పడి ఉన్నది.

"ఆ అవ్వే మరణిస్తే,
ఆ పాపం ఎవ్వరి"దని
వెర్రిగాలి ప్రశ్నిస్తూ
వెళిపోయింది!

ఎముకముక్క కొరుక్కుంటు
ఏమీ అనలేదు కుక్క.
ఒక ఈగను పడవేసుకు
తొందరగా తొలగెతొండ.

క్రమ్మె చిమ్మచీకట్లూ,
దుమ్ము రేగెనంతలోన,
"ఇది నా పాపం కా"దనె
ఎగిరివచ్చి ఎంగిలాకు.

## జ్వాలాతోరణం

స్వర్గనరకముల ఛాయాదేహాళి
తెలి, నలి, తలుపులు తెరచి, మూసికొని—
స్వర్గవిలయ హేమంత వసంత
ధ్వాంత కాంతి విక్రాంతి వేళలో,

చావుపుట్టుకల పొలిమేరలలో
ఆవులించె నొక చితాగ్నికుండం!
అనాధజీవుల సమాధులన్నీ
అఘోరించి ఘోషించాయి!

ఇదేమి! లోకం హిరణ్యనేత్రుని
పదాఘాతమున ప్రతిధ్వనించగ,
కురుక్షేత్రమున క్రుద్ధవృకోదరు
గదాఘాతమున గజగజలాడగ,

జాతి జాతి నిర్ఘాతపాత సం
ఘాతహేతువై, కాలకేతువై,
అదె సంవర్తపు తుఫాను మేఘం
తొలి గర్జించిన తూర్యవిరావం!

ప్రదీప్తకీలా ప్రవాళమాలా
ప్రపంచవేలా ప్రసారములలో,
మిహిరవాజితతి! మఖవధనుర్ద్యుతి
పుడమికి నేడే పుట్టినరోజట :

## నార్ల వెంకటేశ్వరరావు

బందరు నోబుల్ కాలేజీలో చదివి బి. ఏ. పేసయ్యారు. కొంతకాలం కృష్ణా పత్రికకు సహాయ సంపాదకులుగా పనిచేశారు. విద్యార్థి దశలో స్వదేశ సంస్థానాలు అనే పుస్తకాన్నీ; బి. ఏ. పేస్ కాగానే నేటి రష్యా అనే పుస్తకాన్ని ప్రచురించారు. ఉప్పు సత్యాగ్రహం రోజులలో పోలీసు ఆగ్రహానికి గురి అయి దెబ్బలు తిన్నారు. కొంతకాలం దౌర్జన్యానికి ప్రోద్బలమిచ్చిన రాజకీయ పక్షంలో పనిచేశారు. తరువాత జనవాణి పత్రికలో పనిచేశారు. ఆ తరువాత కొంతకాలం ప్రజామిత్ర పత్రికకు సంపాదకత్వం బాధ్యత వహించారు. చాలాకాలం నుంచి ఆంధ్రప్రభ దిన వార పత్రికలకు సంపాదకులుగా వుంటున్నారు.

జననం: 1908

కృతులు: స్వదేశ సంస్థానములు–నేటి రష్యా–జగన్నాటకం–నార్ల వారి మాట–మాటా మంతీ–పిచ్చాపాటీ–కొత్తగడ్డ.

# నవోదయం

చీకటి తెర తొలగునులే!
    ఇక నీ
వాకిట సిరి వెలుగునులే!!
    రేపన్నది వచ్చునులే
    ఆపన్నుల మెచ్చునులే

కన్నుల తడి నొత్తునులే
చిన్నగ నొడి కెత్తునులే
చీకటి తెర తొలగునులే !
ఇక నీ
వాకిట సిరి వెలుగునులే ! !

చిత్తము చిగురొత్తునులే !
ఎత్తుగ ధ్వజ మెత్తునులే
సత్యము పురి విప్పునులే
నృత్యము ధర నొప్పునులే
చీకటి తెర తొలగునులే !
ఇక నీ
వాకిట సిరి వెలుగునులే ! !

కత్తికి చెదపట్టునులే
క్రౌర్యము తుదముట్టునులే
ఆశలు తల లెత్తునులే
ఆర్తులు పరువెత్తునులే
చీకటి తెర తొలగునులే !
ఇక నీ
వాకిట సిరి వెలుగునులే ! !

నవశకమే విరియునులే
నవ్యాభ్రము కురియునులే
న్యాయంబిల నిలుచునులే
నవజీవము పిలుచునులే
చీకటి తెర తొలగునులే !
ఇక నీ
వాకిట సిరి వెలుగునులే ! !

## మబ్బుకన్నె

ఏమిలోపం మబ్బు కన్నెకు ?
ఏల శోకం మేఘబాలకు ?
కన్నుమరుగై మిన్నుతెరపై
కరిగిపోయిన, తరిగిపోయిన,
పుటకగురుతే చిటిలిపోవగ
కటిక నేలకు రాలిపోయిన
ఏమి లోపం మబ్బుకన్నెకు ?
ఏల శోకం మేఘబాలకు ?

సంజతల్లులు సరిగ చీరల
సారె కావడి పంపలేదా ?
ముద్దుచేతుల మంద పవనుడు
ముంగురులు సరిదిద్ద లేదా ?
ఏమి లోపం మబ్బు కన్నెకు?
ఏల శోకం మేఘబాలకు ?

మెచ్చి మెరపులు, వచ్చివేణికి
కుచ్చుసవరం కూర్పలేదా ?
తీర్పలేదా బాలచంద్రుడు
తీరుగా సితగంధ తిలకము
ఏమిలోపం మబ్బు కన్నెకు ?
ఏలశోకం మేఘబాలకు ?

కొల్లకొల్లలు మింటిచుక్కలు
మల్లెలై జడ విరియలేదా ?
కన్ను చెదరే పూలపాలకి
మిన్నురాజే యెత్తలేదా ?
ఏమి లోపం మబ్బు కన్నెకు?
ఏల శోకం మేఘబాలకు?

పిడుగు పిండులు దిక్కు లదరగ
పెద్దభేరీ వెయ్యలేదా ?
నెమలి గుంపులు విమలఫణితుల
నృత్యకేళిని నెరపలేదా ?
ఏమిలోపం మబ్బుకన్నెకు?
ఏలశోకం మేఘబాలకు ?

కరగిపోయిన, సురిగిపోయిన,
కటికనేలకు రాలిపోయిన
కడలినాథుని చేరబోదా?
కన్నె చెరలను వీడబోదా?
ఏమి లోపం మబ్బుకన్నెకు ?
ఏలశోకం మేఘబాలకు ?

## పిచ్చివూహలు

పిచ్చివూహ లేవో
రెచ్చిపోవు నాలో !

కత్తికె కన్నుంటే
నెత్తురు చూడగనే
ఒళ్ళు తిరిగి ఉర్వికి
ఘల్లున పడునేమో!
పిచ్చిపూహ లేవో
రెచ్చిపోవు నాలో!

రూకకె నోరుంటే
వ్యాకుల చిత్తముతో
"కొంపలు నా పేరిట
కూల్చకు" మనునేమో!
పిచ్చిపూహ లేవో
రెచ్చిపోవు నాలో!

గోడకె చెవులుంటే
మేడల బ్రతుకులలో
గుట్టుమట్టు లెన్నిటి
రట్టుకు తేగలదో!
పిచ్చిపూహ లేవో
రెచ్చిపోవు నాలో!

రొట్టెకె కాళ్ళుంటే
పట్టెడు మెతుకులకే
అల్లాడే దీనుల
ఇల్లు చేరునేమో!
పిచ్చిపూహ లేవో
రెచ్చిపోవు నాలో!

రాతికె మమతుంటే
నాతిగ మలచగనే
తరుణి శిల్పియెదపై
ఒరిగి పోవునేమో!
పిచ్చివూహ లేవో
రెచ్చిపోవు నాలో!

కలకే బలముంటే
విలువలు తలక్రిందై
కవికోరే స్వర్గము
భువికే దిగునేమో!
పిచ్చివూహ లేవో
రెచ్చిపోవు నాలో!

నింగి జల్లెడైతే
రంగుల చుక్కలెన్ని
మాణిక్యాలై మన
మాగాణుల బడునో!
పిచ్చివూహ లేవో
రెచ్చిపోవు నాలో!

నాకే రెక్కలున్న
ఆకాశపు టంచులు
దాటి దాటి ఏ మధు
వాకిట చేరుదునో!
పిచ్చివూహ లేవో
రెచ్చిపోవు నాలో!

## పురిపండా అప్పలస్వామి

---

విశాఖపట్టణంలో కవితాసమితి స్థాపకులు. అధ్యక్షులు కూడా. విశాఖ రచయితల సంఘం, నవ్యసాహిత్యపరిషత్తు సంస్థలలో కృషిచేశారు. కాంగ్రెస్ ఉద్యమంలో ఖద్దరు ప్రచారంచేశారు. కొంతకాలం విశాఖపట్టణం మునిసిపల్ కౌన్సిలర్‌గా వున్నారు.

తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఒరియా, బెంగాలీ సాహిత్యాలతో మంచి పరిచయం కలవారు.

జననం: **1904**

కృతులు: మురళీధ్వని – సౌదామిని – ఉత్కళపతనం – మహమ్మదు . విశ్వకథావీథి - భగవద్గీత - వ్యావహారికాంధ్ర మహాభారతము.

# చేమంతి

ఏ నిలింప వాటికనుండి ఎగసిపడెనొ
ఒక్క హేమంతరజనీ వియోగవేళ
కనక మృదుహాసముల కలకలని విరిసె
మా గృహ ప్రాంగణాన చేమంతి పూవు.

ఏ పురాతన బాంధవ్యమేమొ కాని
అది చలించిన నా హృదయము చలించు,
అది కదలెనేని నాలోని నిదురగొనిన
తలపులే నేత్రములువిచ్చి కలువరించు.

అది హిమావృతమైన నా అంతరంగ
మంధతమసా వృతమ్మగు - అపుడు నిపుడు
పిలుచునది నన్ను మౌనగీతల రచించి
ఏను శయనించు వేళనెవో నవీన
వాసనల జిమ్ము కలత స్వప్నాలు రేపు!
ఇది ప్రసూనమ్ము కాదెదో నృపకుమారి
ననువలచి నా గృహద్వారముననె విరిసె
ఏ యుగాల వియోగమో ఎంత వలపొ!
నా విషాద విహ్వలమైన జీవితమ్ము
మరల వికసించునో పరిమళము లెగసి
మ్రోయునో నేడు మరల నా పూలవంశి!

## చందమామ

చందమామ
చందమామ
చల్లని నీ పాటలన్ని
తెల్లని నీ నవ్వులన్ని
ఏ తారా కోమలికో
ఏ దిగంత మోహినికో!

నీలి నీలి సాగరాల
నీరవ భూమీధరాల
హిమకణాల సుమగళాల
మిల మిల తళ తళ తళ తళ
తే నిగూఢ రాగములో
ఏ రహస్య వేదనలో
చందమామ!
చందమామ!!

## ర జ ని

బాలాంత్రపు రజనీకాంతరావు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో డిగ్రీ తీసుకున్నారు. ఆంధ్ర ప్రచారిణికి ఉపసంపాదకుడుగా కొంతకాలం వున్నారు. మద్రాసు ఆలిండియా రేడియోలో నాటక రచయితగానూ, కళాకారుడుగానూ చాలా సంవత్సరాలు పనిచేశారు. ప్రస్తుతం విజయవాడ ఆలిండియా రేడియోలో కార్యక్రమ సహాయకులుగా ఉద్యోగం. వీరి గేయ సంపుటి 'శతపత్ర సుందరి' మద్రాసు ప్రభుత్వ బహుమతినీ, 'వాగ్గేయకార చరిత్ర' ఆంధ్రప్రదేశ ప్రభుత్వ బహుమతినీ పొందాయి.

జననం: **1920**

కృతులు: శతపత్ర సుందరి - వాగ్గేయకార చరిత్ర.

## సంక్రాంతి

వచ్చెను సంక్రాంతి!
ఇచ్చు శుభము శాంతి !!

కుచ్చుల స్వప్నాలూరే
వెచ్చని కంబళ్ళూ!
మంచు తెరలు చీల్చే
చలిమంటల సందళ్ళూ!... వచ్చెను

వెన్నెల కడిగిన దారుల
వెలసిన ముగ్గుల్లో,
ముగ్గుల ముసిముసి నగవుల
సిగ్గుల మొగ్గల్లో! ...వచ్చెను
ఆవిరు లెగసే నోళుల
అందపు పాటల్లో !
అందెల గాజుల రవళుల
ఆడే గొబ్బిళ్ళొ!...వచ్చెను

పిల్లల తలలనురాలే
అల్లో నేరేళ్ళొ!
పెద్దల దీవన కోర్కుల
పెరిగే నూరేళ్ళొ!...వచ్చెను

అలకల మామల ఓపిక
కొలిచే అల్లుళ్ళొ!
రంగుల బొమ్మల కొలువుల
పొంగే కూతుళ్ళొ!...వచ్చెను

పూవులు కుంకం పసుపూ
పూజల నాగళ్ళొ!
పాలతుల నోముల కలకల
పులగం పొంగళ్ళొ...వచ్చెను

గాదెల గడపల ధాన్యం
కదిలే వాకిళ్ళొ!
అందరి పనులకు జనులకు
ఆట విడుపు వీళ్ళొ!...వచ్చెను

నిగిడిన రెక్కల కండలు
తెగు పందెపు కోళ్ళూ!
కొమ్ముల సందుల రోషం
కొసరే పొట్టేళ్ళూ!...వచ్చెను

మకరంచేరిన సూర్యుడు
సుకమిచ్చు పగళ్ళూ!
సకియలు దూరమ్మైతే
శకాలు రాత్రిళ్ళూ!...వచ్చెను

## ఇంద్రధనుస్సు

నింగికి నేలకు వంగిన వంతెనగా
రంగులు కురిసే ఇంద్రధను స్సిదిగో!...నింగికి

సప్తాశ్వమ్ములు లాగెడు అరుణరథం,
సప్తవర్ణదీప్తమ్మగు గగనపథం,
వర్ణవర్ణముల విద్యున్మాలికలు,
కర్ణపర్వ మర్మరిత కథానికలు!...నింగికి

నేరెడు ఫలముల ప్రోవుల నిగనిగలు,
బారులు తీరిన పాలపిట్ట జతలు,
చాయలుతేరిన సంద్రపుపాయలవే
పాయలు చీలిన పాలాల చాయలవే!...నింగికి

పసుపు నలందిన దిక్కుల గడపలదే,
నొసటను కుంకుమతో మినువెలది యదే,
జేగురు సేలువ వ్రేలెడు చెలువమదే,
శ్రావణ లక్ష్మికి నిలిపిన ఛత్రమదే!...నింగికి

## సంపత్

ఎస్. రాఘవాచార్య, ఎమ్. ఏ. పేసైనారు. బి. ఇడి. పరీక్షలో మొదటివారుగా బంగారు పతకాన్ని పొందారు. సంస్కృతము, కన్నడభాష లలో మంచి పాండిత్యంవున్నది. ప్రస్తుతం కర్నూలు గవర్నమెంటు ట్రెయినింగు కాలేజీలో ప్రొఫెసరు.

జననం: **1917**

కృతి: మేఘసందేశము.

## వానవచ్చి

వానవచ్చి, చూలువచ్చి,
కాలువలో గొంతువిచ్చి
స్వర్గమదే అని గావును
బెకబెక లాడింది కప్ప.

వానవచ్చి, ఓరివిచ్చి -
మానవుడా ! బ్రతుకంటే
ఇదే, ఇదే, ఇదే, నంటు
చిటిలిం దొక చిన్ని బుడగ

వానవచ్చి, వయసువచ్చి
అందాలను తెరచిపెట్టి
పిందెకోస మూరిం దొక
పెండ్లికాని బీరపువ్వు,

వానవచ్చి, వణుకు వచ్చి,
లేచి, చూచి, నిక్కి, పీల్గి
ఆవులించి, ఊరకుంది
పెంటి లేని కుంటి కుక్క.

వానవచ్చి, సగంచచ్చి,
చావన్నది మనసు కొచ్చి
మ్యావన్నది జాలి లేని
అగడ్తలో పడ్డ పిల్లి.

వానవచ్చి, ఏదొవచ్చి
కవిగారికి ఇవికూడా
కావ్యత్వం కలిగినవే
అని చెవిలో చెప్పిందట.

## నా సోదరులకు

మానవత్వం మరచిపోయిన
మాయలోకపు క్రూరసత్యం
ఒప్పుకుంటూ ఒదిగిపోతారా ?
తిరగబడుతూ ధిక్కరిస్తారా ?

ఘోరలోభం కోరలెత్తిన
ధూర్తలోకపు దుష్టతత్త్వం
మెచ్చుకుంటూ మురిసిపోతారా ?
ధ్వంసమయ్యేదారి తీస్తారా ?

పిరికివాళ్ళై, పిచ్చివాళ్ళై
పాడులోకపు కీడులో పడి
ఆహుతై మీ రారిపోతారా ?
అమరలోకం అవని కిస్తారా ?

చూసుకుంటే ముందువెనకల
ఇందిపోటులు, పందికొక్కులు;
ఆటకోసం కొరికి బరికే
వేటకుక్కలు, గుంటనక్కలు.

అడుగుతీస్తే, అడుగువేస్తే
ద్రోహబుద్ధులు, దొంగచూపులు,
నంగనాచులు, మహానీచులు
గోముఖవ్యాఘ్రులు, త్రాచులు.

పట్టి చింపే, కుట్టి చంపే,
ఎండ్రకాయలు, మండ్రగబ్బలు;
అంతరార్థా లున్న మాటలు
ప్రేమలో తడిగుడ్డ కోతలు.

ఎన్నినాళ్ళీ ఘోర శాపం!
ఎన్ని ఏళ్ళీ నరకకూపం!
దురంతాలను తుడిచివేసే
బలం రాదా? భయం పోదా?

మాయ చేసే మంత్ర మేసే
ఈ భయంకర లోకవృత్తం
ధ్వంసమయ్యేదారి తీలేరా
అమరలోకం అవని కీలేరా?

## పిలకా గణపతిశాస్త్రి

విజయనగర సంస్కృత కళాశాల విద్యార్థులు. సాహిత్య విద్యా ప్రవీణ. ఉభయ భాషాప్రవీణ పి. జి. ఎల్. పరీక్షలలో ఉత్తీర్ణులు. కొన్ని సంవత్సరాలు 'ఆంధ్ర శిల్పి' సహాయ సంపాదకులు. ప్రస్తుతం 'భారతి' 'ఆంధ్ర వారపత్రిక'లకు సహాయ సంపాదకులు.

జననం : 1911

కృతులు : విభ్రాంతా మరుకము - రత్నాపహారము - మణిదీపిక - ప్రాచీన గాధాల హరి (కథలు)

## చలిమంట

నీతి సమిధలుకాల్చి, నీ వలపు చలివేళ
నెచ్చెలీ, రగిలించె, వెచ్చ వెచ్చని కీల!
చలికాచు కొనరమ్ము చెలికౌగిలింతలో
వెలలేని పరువ మూర్పుల నెగిరె ధూళిలో!

అధర మధుపాత్ర మధు మధుర మై రేయమ్మ
మధియించి మహిత జీవధనమ్మె దోచెదము,
ఈ మైకమిది, నాకసీమ లేనేలేదు;
హేమంతరాత్రి మనకై మరలిరాదు!

వలదు వలదనువారు కలరెందరో ఘనులు
వలవంతవేగి ముదుసలులైన సోమరులు,
కనలేనివారు పలికినది రేపను పదము,
వినుము కవిసూక్తి, యీ క్షణ మొక్కటే నిజము!

వెలలేని పరువ మూర్పుల నెగిరె ధూళిలో
చలికాచు కొనరమ్మ, చెలికౌగిలింతలో!
నీతి సమిధలు కాల్చి నీ వలపు చలివేళ
నెచ్చెలీ, రగిలించె వెచ్చ వెచ్చని కీల!

## వాన పాట

సాయంకాలం నీరెండల కెం
జాయల మెరుపులు మెరిసినవి!
వేయి యుగమ్ముల జల్లుల చల్లని
హాయి, కనుంగవ నిండినది!

తెల్లని కొంగల బారులలో నీల
నల్లని మేఘా లల్లవిగో!
పిల్లల్లారా, చినిచిని ముంగురు
లల్లల్లాడగ రారండీ!

ఏలా నలుదెస లరసెద వోహెూ
బేల్లా; నీ హృదయేశుని కొరకో!
గాలిలో చెలరేగి యాడెను
లోలము నీ చేలాంచలము!

రాలిన బంగరు పండుటాకులే
ధూళుల గిరగిర తిరిగినవే !
లోలో దుఃఖిత హృదయ
మ్మీవేళ నింగికే యెగసె నిదే !

సాయంకాలం నీ రెండల కెం
జాయల మెరుపులు మెరిసినవి !
వేయి యుగమ్ముల జల్లుల చల్లని
హాయి కనుంగవ నిండినది !

---

దాశరధి కృష్ణమాచార్యులు, బి. ఏ. వరకూ చదివారు. అనహాయోద్యమంలో పాల్గొని జైలుకువెళ్ళారు. ఇంగ్లీషు, హిందీ భాషలతో మంచి పరిచయం వున్నది.

జననం : 1927

కృతులు : మహాంధ్రోదయం - మహాబోధి - పునర్నవం , అగ్నిధార - రుద్రవీణ.

# పూలలో జ్వాలలు

నన్ను రమ్మని పిలుచుకొన్నావు నాడు
వద్దు పొమ్మని నేడు కోపపడినావు
నవ్వుకొన్నాను నేను అనాడు కూడ
నవ్వుచున్నాను నేను ఈనాడు కూడ !

నాడు నీయింటి వెనుక పున్నాగ నవ్వె
నేడు నీయింటిముందు కన్నెర్రజేసె
సార చారు శృంగార మందార సుమము,
అరుణతరుణ ప్రభాత భాస్కరసమమ్ము !

అంత చల్లని నీ గుండెయం దిదేల
కోపమగ్ని కీలామాలి కోపమమ్మ ?
ఇంతచల్లని ఈ పూల చెంత ఏల
పెకిలివచ్చు వక్షోజాల వెచ్చదనము ?

జ్వాలజ్వాలయు పూవుగా చల్లవడును
పూవుపూవు జ్వాలాజిహ్వ పొల్కనెగయు
నాల్గుదిక్కుల వెచ్చందనమ్మె లెమ్మ !
నాల్గువాడల చల్లంద నమ్మె సుమ్మ !

నీవు వెచ్చని శయ్యవైనావు నాకు
నేను నీకు గాలైన పానీయమైతి
అన్నమైతిని నేను నీ కమృతమైతి
వీవు నాకు బుభుక్షా సహిష్ణువునకు !

ఘోర కారాగృహమ్ములు కూలద్రోచి
బయలు వెడలిన రాక్షస ప్రకృతివాని
కదలనీకుండ బంధించ గలుగునీదు
కోమల భుజాభుజం గోపగూహనమ్మ !

నీవు నేనని ఎవరేని నిలువదీసి
వేరువేరుగ పేరులు పెట్టిరేని
పార్వతీ పరమేశ్వరస్వామి చూపి
నవ్వుకొంద మమాస పున్నములవోలె !

కనబడిన 'తెల్ల' యెల్ల శృంగారమనుచు
కంటబడు 'నల్ల' యెల్ల వికారమనుచు
మూల్గు లోకాన కెయ్యది వెల్గుచూపు ?
నీ సితాసితలోచ నాంతికము గాక !

## సాహిత్యసామ్రాజ్యము

కలమెహాద్యోగము మానుకొమ్ము, కవితా కంజాక్షితో రాత్రి వే
ళల మేఘమ్ములుగాలి కౌగిళుల నిద్రల్‌వోవు నీలాల జా
డల సంచారముచేసిరమ్ము; పరపీడా వృత్తితోఁగ్రుమ్మగ్గు భూ
ముల నేమున్నదిరా నిరాశ్రయుల ఊర్పుల్ కంటనీర్ గార్పులున్!

అటె వాహ్యాళికిపోయి ఊరకొనబో, కాశాతటిత్కామినీ
నటనా వైభవముల్ నిరాశయను అంధ్యంబూడ్చె; చూచాయగా
ఎటొ మార్గంబది కానుపించును,ప్రయాణించన్‌వలెన్ రమ్ము,సం
కటముల్‌బాసి ప్రపంచమంతటను సౌఖ్యశ్రీలు చెన్నారగన్.

ఏ నాడెవ్వడు కత్తితో గెలువలేదీ విశ్వమున్ ప్రేమపా
శానన్‌కట్టుము నాలుగుంబది ప్రపంచాలన్; మహాత్మ్యం బిదే
జ్ఞానోద్బోధముసేసె, నెవ్వడువినెన్ ? సాహిత్యసామ్రాజ్యమం
దైనన్ కొంతగ శాంతిపాదుకొననిమ్మా, నీకు పుణ్యంబగున్ !

## అచుంబితం

మాట్లాడని మల్లెమొగ్గ
మాదిరిగా నడచిరా
నిశ్శబ్దం ఎరుగనట్టి
నిమ్నగవలె గడచిపో

చేదగు కన్నీటిబొట్లు
చిందిన చప్పుడులు విను,
వచియింపగరాని మనో
వారిరాశి లోతుకను.

మూగి పుస్తకాలలోని
రాగాలను పాడుకో
గాలిలోన కదలాడే
ఆలోచన వాడుకో.

భీముని గదలా బరువై
భీతిగూర్చు ఋషిశాపం,
రాముని బాణానికంటె
ప్రబలమైన జనకోపం.

తలలు వాల్చియున్న జనం
గళాలెత్తి పాడుట,
కదలలేని ఎదనెమళ్ళు
కండ్లువిప్పి ఇడుట.

మెట్లులేని మేడమీద
మేలినీలి ముసుగుతీసి
నవ్వే అందాల తరుణి
నవశారద నిశాశశి.

ముసలి భాస్కరుని చూపుల
మసకలలో తప్పిపోయి
కనుపించని కాలాంశం
కని చూపుల కనుపించుట.

పవళించుము నీలో నీ
వెవరిని బాధించబోకు,
విచ్చిన ఎదకంటి చూపు
విశాలమై క్రమ్మనీ.

## సి. నారాయణరెడ్డి

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. పేసైనారు. తెలంగాణా రచయితల సంఘానికి కార్యదర్శిగానూ, స్రవంతి పత్రికకు సహాయ సంపాద కులుగానూ భాషాసేవచేశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో లెక్చ రరుగా వున్నారు.

జననం: 1931.

కృతులు: నవ్వని పువ్వు - జలపాతం - విశ్వగీతి - స్వప్నభంగం - అజంతా సుందరి - నారాయణరెడ్డి గేయాలు - నాగార్జునసాగరం.

# నీవు పిల్చితివి

నీవు పిల్చితివి మరింత
నిశ్శబ్ద మలిమికొనగ,
నాయెడంద అంజనాద్రి
యై, అంధతమో గుహయై
కాలోరగ విషసమూ్మ
ర్ఛాలసయై యున్నవేళ
నీవు పిల్చితివి మరింత
నిశ్శబ్ద మలమికొనగ !

నీ పిలుపున తేనియ వీ
ణియలు మ్రోల్గు ననుకొంటిని;
నీ పిలుపున పికగళ
వ్యాసృతిగల దనుకొంటిని !

ఎలనాగల కన్నుల దా
రులలో మెత్తగ నడచెడు
కలల కాళ్ళ సవ్వడి నీ
పిలుపున గల దనుకొంటిని;

కాని, నీవు పిల్చితి విం
కా నిశ్శబ్దత పేరగ;
మ్రోసి మ్రోసి పారవశ్య
మును పట్టగలేక తెగిన
నటస్వామి దక్షిణ చర
ణనూపురము నైనగాను!

పలికి పలికి తారాధ్వ
ప్రసారిత స్వరయై మది
చెదరి మూర్ఛపడిన విపం
చీ తంత్రికనైన గాను!

ఇపు డిపుడే మ్రోయుదునని
ఎడదను కిన్నెరగ మలచి
స్వరనిర్ణయ శంకా ని
స్తబ్ధ జీవనుడనైతిని!

గుండెనిండ శబ్ద బ్ర
హ్మాండమ్మును నింపుకొనక
ముందుగనే నీరవతా
ముద్రి తాత్మకుడనైతిని!

మరల నీవు పిలువుము హిమ
గిరి వీపు చురుక్కుమనగ.
తురంగలించు తరుణ సూర్య
కిరణ కశాగ్రమ్ము వోలె!

మరల మరల పిలువుము ఈ
న్మత్తాంభోద ద్వీప మ
స్తముల నెచ్చరించు విద్యు
దంకుశోగ్ర ధార వోలె!

మరల నీవు పిలిచిన పి
మ్మట చూడుము నాయెడంద
ఏకకాలమున ఢమరుక
మై కచ్ఛపియై మ్రోగును!

## జలదగీతి

సాగుమా ఓ నీలమేఘమా,
గగన వీణామృదుల రాగమా!

బీటవారిన చేల
పీయూషములు రాల
గరికలేని పొలాల
మరకతమ్ములు దేల
సాగుమా ఓ నీలమేఘమా!

నెమలిపాదాల కిం
కిణులు ఘల్లున మ్రోయ
ప్రియురాలి వలపు మ
ల్లియలు జల్లున పూయ
సాగుమా ఓ నీలమేఘమా!

కవిరాజు నిను జూచి
నవనీతమై పోవ,
నవనీతమై పోవ
నవగీతమై లేవ
సాగుమా ఓ నీలమేఘమా!

నిను జూచి విరహిణులు
నిట్టూరుపులు నింప,
నిటూరుపులు నింప
నిలువెల్ల పులకింప
సాగుమా ఓ నీలమేఘమా!

గుండె లోతుల పాదు
కొన్న పాతదనాలు
నీ పదమ్ములు తాకి
నీరు నీరై పోవ
సాగుమా ఓ నీలమేఘమా!
గగనవీణా మృదులరాగమా!

## ఆ శ లు

ఆశలు మరాళగరు దంచలములై -
అవనిపై జారిపడినట్టి శప్తాప్సరల
అలసిపోవని కటాక్షాంచలములై -
నను ఎగురవేసి, వెంటనె క్రింద బడద్రోసె!

పొడమె నొక వింతఅనుభూతి; నాతనువెల్లి
యెడదగా రూపొందు రీతి
కడకొక్క విరినైన గాకయే నను నేనె
విడిపోయి పరిమళము నైతి!

దెసల నాసికలందు ప్రసరింతునా, లేక
దివి గుండెలోన గొండివి సేతునా
కసిదీర అప్సరోగజగామినుల యెదల
మసలి ఉన్మాదాన్ని మండింతునా!

అదలింపబడితి నే నాశానువర్ణ శై
లారోహణము సేయునపుడు,
ఈహాపరాఙ్ముఖుడ నూహాంగ నా సఖుడ
నేమందురో చూతు నిపుడు!

తొలిమబ్బు రాచకన్నెల కొప్పు లూపి రా
ల్చును చుక్కలనెడు మల్లెలను,
మెఱపుదొరసానులను వెఱపింతు దోతునని
మేని బంగారుటొల్లెలను.

పారిజాతాంగనల పట్టితెచ్చి పలాశ
వీరులకు పెండ్లిసేయింతు,
సెలయేటి సొగసుగత్తెలు మేరుగిరిపతికి
గిలిగింతలిడ సంతసింతు!

ఆశలను దిగద్రావినట్టి వాడే తావి
యంత స్వేచ్ఛగ ఎగసిపోవు
బ్రతుకును పరిమళ ప్రతిగా మలచుకొన్న
వాని కే పరధులును లేవు!

## వింజమూరి శివరామారావు

---

కాకినాడ కాలేజిలో బి. ఏ. చదివారు. చాలా రేడియో నాటికలు రాశారు. ప్రస్తుతం విజయవాడ ఆలిండియా రేడియోలో ఉద్యోగం.

జననం: **1908**

కృతులు: రజకలక్ష్మి - కళోపాసన - విజయ పతాక.

# ఏదిరా

చక్కని చుక్కేదిరా ?
ఎక్కడ కనరాదురా !
టక్కరి పడు చేదిరా ?
పక్కన నవ్వేదిరా,
నవ్వులోన బొండుమల్లె
పువ్వులు రువ్వేదిరా !... చక్కని

టక్కరి పడు చేదిరా ?
మక్కువ చూపేదిరా,
అరచూపుల దరిదాపుల
మెరపులు దూసేదిరా !... చక్కని

టక్కరి పడు చేదిరా ?
తక్కుతు వొచ్చేదిరా,
తులుకు నడకలోన కొత్త
వలపులు విచ్చేదిరా !... చక్కని

టక్కరి పడు చేదిరా ?
సొక్కుచు పత్కేదిరా,
మాటలందు తీయనైన
పాటలు చిల్దేదిరా !... చక్కని

## ఉయ్యాల

ఊపరె పూపరె వుయ్యాలా !
చిన్నరి పొన్నరి వుయ్యాలా ! !
చుక్కలదాకా రెక్కలు సాచే
చక్కని బంగరు వుయ్యాలా;
మిన్నులపై పరువమ్ముల వెన్నెల
తెన్నుల తిరిగే వుయ్యాలా !... ఊపరె

పచ్చని తీగల వుయ్యాలా,
విచ్చిన పూవుల వుయ్యాలా !
మువ్వలు మొరసే నవ్వులు మెరిసే,
వెలుగు జిలుగులా వుయ్యాలా !... ఊపరె

కలకల్లాడే వుయ్యాలా,
తలతళ్ళాడే వుయ్యాలా !
పాపం పుణ్యం యేమీయెరగని
పాపాయూగే వుయ్యాలా !... ఊపరె

పడుచువారి మది కోరికలోయన
పడిలేచే నిది వుయ్యాలా !
భూమిని స్వర్గము నేకము చేయుచు
పొంగుచు తిరిగే వుయ్యాలా !... ఊపరె

## నారాయణబాబు

శ్రీరంగం నారాయణబాబు. ఇంగ్లీషుభాషలో మంచి ప్రవేశంవున్నది పాడగలిగిన శక్తి సంగీతమంటే మంచి ఆసక్తివున్నవి.

జననం: 1906

## నిశాగీతి

కళ్లల్లో
కర్పూరం జల్లినట్టు
పన్నీరే పోసినట్టు
భగ్గని మండించి
చల్లగ తోచావు
ఈ నీల నిశలోన
నా పునుగు ఎదలోన.

హృదయానికి
వలపే లేదు,
నయనాలకి
చూపేలేదు.

అంధుని
కనురెప్పలపై కన్నీరు
నా గీతం!-

పెండ్లి పీటై
పుడమి పులకరించింది !
వ్యోమ మార్గం
హోమ గుండం
ధూమ మెగజిమ్మేన్.
దోయిలించిన
తలంబ్రాలచేతుల
నిశానీల హస్తాలను
ఖండించే
ఉదయ సంధ్య.
నిశయన నింతే
వలపన నంతే !

## చల్లని గీతి

ఇసుక యెడారుల
పసిరిక నేలై
కుసుమించిం దీబ్రతుకు !

కర్షక హర్షోదయ
వర్షాగమ వేలావేళల
తూనీగా
ఎడద యెగిరె హాయిగాను.

గ్రీష్మపు టెండల
మండిన భూముల

తొలకరి వేళల
మాతృ మృత్తికా
మధురవాసనలు
సుధాగళమ్మున.

ఉన్మిషితమ్ములు
జీవితాధ్వములు
శరన్ మేఘములు
పరుగులెత్తినవి,
విద్యున్మాలలు
వెంట తరిమినవి,
తల్లిచేతి చల్లందనము
పిల్లల మాటలతీపి
కొల్లగొన్నదేమొ బ్రతుకు !

మాతృవక్షమున
పాల పోటుతొ
తల్లి కడుపులో
పిల్లడు కదిలాడు,
చల్లని గీతి
రేకెత్తింది!

## అనిసెట్టి సుబ్బారావు

బి. ఏ. పేసైనారు. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఆంగ్లసాహిత్యపఠనం కొంతకాలం కృషిచేశారు. తరువాత మద్రాసు లాకాలేజిలో చదివారు. విద్యార్థి ఉద్యమాలలోనూ, యువజనోద్యమాలలోనూ కృషిచేస్తూ రెండు సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించారు. కొంతకాలం 'ప్రజాశక్తి' పత్రిక సంపాదకవర్గం సభ్యులు. నవ్యసాహిత్యపరిషత్తుతో సన్నిహితమైన సంబంధం వుండేది; అభ్యుదయ రచయితల సంఘాన్ని ప్రారంభించినప్పటినుంచీ ఆ ఉద్యమంలో ప్రముఖపాత్ర నిర్వహిస్తున్నారు.

జననం: **1922**

కృతులు: అగ్నివీణ - గాలిమేడలు - మాపూరు - అనిసెట్టి కథలు.

# ఎవరి పిల్లలోయి మీరు!

బ్రిడ్జిక్రింద, స్టేషన్లో, ధూళిమీద
ఎటు చూచిన మీరూపులు!
ఎటు విన్నా మీ అరుపులు!
పార్కుచెట్లు కాల్వగట్లు
అడుగులు మరుగులు అన్నీ
ఆక్రమించి తిరుగుతున్న
ఎవరి పిల్లలోయి మీరు!

మురికివొళ్ళు, చింకికళ్లు
మీ రూపులు!
కడుపాక బాదం ఆకై,
మీ చూపులు
తోపుల్లో తుమ్మముళ్ళు!
దిక్కులేని తల్లులు
దిగవిడిచారా?
మీరు గర్భాల్లో కెక్కినపుడె
వేనోళ్ల శపించుకుంటు
శత్రుబాధలా తొమ్మిది
నెలలు మోసి,
గుట్టల్లో గుబురుల్లో
ప్రసవించి పడవేసి
తమదేమీ పోనట్లు నటించి
తరలివెళ్లారా?

దాగని గర్భశోక ముప్పొంగి
ఆగని మాతృప్రేమకే లొంగి
తల్లడిలుతు వెళ్లారా?
వాళ్ళ గర్భశోకం
ఈ లోకానికి తగులుతుంది!

మీ కేకలు వినబడవు!
విశ్వం శోధిస్తూ పైతారలు
లెఖిస్తున్నారు
జీవన్మరణ సమస్యలు చింతుస్తూ

బోధిస్తున్నారు !
మేధ స్సముద్రంలో వేటాడి
కవిత వ్రాస్తున్నారు!
గుళ్ళు, గోపురాల్, పశువులశాలలు
నిర్మిస్తున్నారు !

ఎవరి పిల్లలోయి మీరు !
ఉన్నవాళ్ళ హుంకారంతో
ఉలిక్కిపడుతుంది ఎండ !
మీరంటే ఎండగూడ మండిస్తుంది
ఉన్నవాళ్ళ ఉడుపాకటీ,
స్పృశించలేదీ వర్షం!
వానగూడ మీరంటే
వరదలు పారిస్తుంది!
విశాల ప్రకృతి పూర్ణహృదయం
కాపులించుకుని
పవళిస్తున్నా, రేడుస్తున్నా
రెవరు మీరు ?

చలి వొంటిని మెలిపెడితే
ఎండకాల్చి వేధిస్తే
భూమాతతో మొరపెడుతూ
వెక్కి వెక్కి ఏడ్చే
ఓ దిక్కులేని తమ్ములార!
నా ప్రాణ మిత్రులార !
ఈలోకపు శాసనాలు

ఎంగిలాకు లిస్తాయి
ఇనుప కమ్మి లిస్తాయి
న్యాయమూర్తి గ్రంథాల్లో
నల్లని అక్షరపంక్తులు
మీ మెడలకు ఉరి పుచ్చులు!

ఎవరి సంతతోయి మీరు!
ప్రస్తుత సమాజ దేహపు
నుదుటి రేఖలా మీరు?
భవిష్యత్తు నూరించే
వెలుగు పోచలా మీరు?
దివ్యకాంతిమూర్తులైన
ఎండిమియాన్లెంతమంది!
సంఘపు కుంపటి వెల్గించే
సైంట్ జోన్ లెంతమంది!
జీవశాంతి రసార్ద్రులౌ
జీసస్ లెందరో మీలో!

దిక్కు లేని తమ్ములార!
మిము చూస్తె
రాతిగుండె జాలువారి ద్రవిస్తుంది.
కరుణతో ప్రవహిస్తుంది!
జాలిగుండె కర్కశమై నిలుస్తుంది,
జగతి నెదురొ్కంటుంది!

## భయం భయం బ్రతుకు భయం!

భయం భయం బ్రతుకు భయం!
భయం బ్రతుకు భయం భయం!

అన్నా ! మనకీ లోకం
పన్నిన పద్మవ్యూహం !
ఆశలతో బ్రతు కీడ్చే అస్థిపంజరాలు మనం,
ఆవేదన హతమయ్యే ఆశా జీవులం మనం !
గతమంటే కారు వెగటు, రేపంటే తగని భయం !
ప్రళయం ఈ ప్రస్తుతం, క్షణక్షణం దుర్మరణం !
ఛిద్రమైన జీవితాలు, చితికిన సంసారాలకు
స్వప్నం ఒక స్వర్గసీమ, సౌభాగ్యం సౌందర్యం !
భయం భయం బ్రతుకు భయం !
భయం బ్రతుకు భయం భయం !
అన్నా ! మనకీ లోకం
పన్నిన పద్మవ్యూహం !
స్వప్నంలో స్వర్గసుఖం, సౌభాగ్యం, సౌందర్యం !
స్వప్నసుఖం మన భ్రాంతి, సత్యదీక్ష మనకు శాంతి !
స్వప్నలోక మాశ్రయించి బ్రతు కీడ్చే సంసారాల్,
ఈ వాస్తవిక జీవితాగ్ని శిఖల దగ్ధమౌను సుమా !
భీరువులో ! పీడితులో ! పెరిగిరండి మానవులై,
చైతన్య జ్యోతులార ! జగతిని శాసించండి !
అన్నా ! మనకీ లోకం
పన్నిన పద్మవ్యూహం !
భయం భయం బ్రతుకు భయం !
భయం బ్రతుకు భయం భయం !

## ఆ ర ు ద్ర

భాగవతుల శంకరశాస్త్రి. విజయనగరం కాలేజీలో బి. ఏ. చదువుతూ అసహాయోద్యమ సందర్భంలో చదువు మానేశారు. తరువాత కొంతకాలం రాయల్ ఇండియన్ విమానదళంలో సాయుధగుమాస్తా ఉద్యోగం చేశారు. కొంతకాలం ఆనందవాణి వారపత్రికకు సంపాదకత్వం వహించారు. ఇప్పుడు ఫిల్ములకు మాటలు పాటలు రాస్తున్నారు.

జననం : 1925

కృతులు : త్వమేవాహం - గాయాలూ - గేయాలు.

### ఇన్నాళ్లకు మానవుడే

ఇన్నాళ్లకు మానవుడే దేవదేవుడు
విన్నారా, సామాన్యుడు ఆదిదేవుడు !
తన పలుకే నవవేదం
తన కరుణే సుధారసం,
మనిషిలోని మంచితనం
ఎన్నటికీ పోనిధనం !... ఇన్నాళ్లకు

చివురించే సమ ధర్మం
జీవనమే పానము
స్పందించే ప్రతిహృదయం
సర్వేశుని ఆలయమే !... ఇన్నాళ్లకు

## కన్నుల నిద్దర

కన్నుల నిద్దర రాకపోతే
పడ్డావనుకో ప్రేమలో,
తిన్నది హితవే కాకపోతే !
పడ్డావనుకో ప్రేమలో !

అడుగులు తడబడి, మాటలు పొరబడి
గుండెల దడదడ హెచ్చితే,
పదహారేళ్ళు దాటిన కన్నియ
ఎదలో సూదులు గుచ్చితే
పడ్డావనుకో ప్రేమలో !

విరహములో పడి
వేదనలో చెడి, నీ
దేహము చిక్కి సగమైతే
కన్నీరే నీలో చెరువైతే
చెడ్డావనుకో ప్రేమలో !

## అజేయుడి అనురాగం

తుడుచుకో కన్నీళ్ళు
ముడుచుకో అరవిరులు
నడచి వస్తున్నాడు
కడకు నీ విభుడు

ఇది కొత్త ఏడాది
ఈ కాన్క నీది

జడలోన మల్లియలు
దడహెచ్చు గుండియలు
విడని కౌగిలిలోన
పుడమి నా కాదలి

ఇది కొత్త ఏడాది
ఈ వలపు మనది

కడలిలో ముత్యమై
అడవిలో వెన్నెలై
ఒడలు పులకించగా
సుడులు తిరిగే సొగసు

ఇది కొత్త ఏడాది
ఈ హొయలు నీది

పొడవకూడదు పొద్దు
విడవకూడదు మత్తు
పడకటింట్లో వెలుగు
నడవలో వైదొలగు

ఇది కొత్త ఏడాది
కల కాటి బూది